# ఆత్మీయుల స్మృతి పథంలో...
# నీలం రాజశేఖరరెడ్డి

సంపాదక సారథ్యం :
శ్రీ వై.వి. కృష్ణారావు, మాజీ ఎం.ఎల్.సి.
గౌరవాధ్యక్షులు,
అఖిల భారత రైతుసంఘం,
డైరెక్టరు
నీలం రాజశేఖరరెడ్డి పరిశోధనా కేంద్రం

సహకారం :
శ్రీ యన్. శివరామిరెడ్డి, మాజీ ఎం.ఎల్.ఏ.

ప్రచురణ :
నీలం రాజశేఖరరెడ్డి పరిశోధనా కేంద్రం
సి.ఆర్. ఫౌండేషన్
కొండాపూర్
హైదరాబాద్ - 32

ఆత్మీయుల స్మృతిపథంలో నీలం రాజశేఖరరెడ్డి

సంపాదక సారథ్యం :

వై.వి. కృష్ణారావు

సహకారం : ఎన్. శివరామిరెడ్డి

మొదటి ముద్రణ : డిసెంబరు 2000

ప్రతులకు : విశాలాంధ్ర ప్రచురణాలయం వారి అన్ని శాఖలు

వెల : 50 రూపాయలు

ముద్రణ : అనుపమ ప్రింటర్స్
శాంతినగర్, హైదరాబాద్ - 28
ఫోన్ . 3391364, 3304194

బ్రతికి చచ్చియు

ప్రజలకెవ్వడు

ప్రీతి గూర్చునో

వాడె ధన్యుడు

- గురజాడ

మానవునికున్న ఆస్తిలోకెల్లా ప్రియమైనది జీవితమే ! అలాంటి జీవితాన్ని గడిపే అవకాశం మనిషికి ఒకసారి మాత్రమే లభిస్తుంది. మానవజాతి విముక్తి కోసం నా జీవితాన్ని వినియోగించాను అని సంతృప్తి పడగల జీవితాన్ని ప్రతి మానవుడు గడపాలి.

- లెనిన్

# ముందుమాట

మానవ జీవితం మహోన్నత్కృష్టమైనది. అది ఒక్క పర్యాయం మాత్రమే లభ్యమవుతుంది. ఈ అవకాశాన్ని మానవసేవకు, సమాజాభ్యున్నతికి వినియోగించిన మహానుభావుల జీవితం అడవిగాచిన వెన్నెల వలే వ్యర్థం గాక సార్థకమవుతుంది. అటువంటి వ్యక్తి మరణించినా ప్రజల హృదయాల్లో జీవించే వుంటాడు. ఆ కోవకు చెందినవాడే కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డి. తెలుగుతల్లి ముద్దుబిడ్డలలో రాజశేఖరరెడ్డి ఒకడు. దేశ స్వాతంత్ర్యోద్యమంలో అరెస్టయి ఐదు ఏళ్ళకుపైగా వివిధ రాష్ట్రాలలో బ్రిటీషువారి జైళ్ళలో మగ్గిన వ్యక్తి రాజశేఖర్. కమ్యూనిస్టు కార్యకర్తగా, నాయకుడుగా సమాజసేవకు, బడుగుజీవుల సముద్ధరణకు తుదిశ్వాసవరకు అహరహం పాటుబడిన ప్రముఖుడు. ఇటువంటి త్యాగధనుల జీవితం నేటి తరం యువతకేగాక, భావితరాల వారికి కూడా స్ఫూర్తిదాయకంగా వుంటుంది. ఆయన తన జీవితానుభవాలను వ్రాయ సంకల్పించలేదు. ఆ కొరతను కొంతవరకైనా తీర్చాలనే సదుద్దేశంతో మేము ఈ గ్రంథ రచనకు పూనుకున్నాం.

అయితే ఈ సందర్భంగా ఒక విషయాన్ని పాఠకుల దృష్టికి తీసుకురావాలనుకుంటున్నాను. కామ్రేడ్ రాజశేఖరరెడ్డి మరణం తర్వాత వారి జీవిత విశేషాలను వెలుగులోకి తేవాలని అనంతపురం వాస్తవ్యులు, అభ్యుదయ రచయిత అయిన కామ్రేడ్ విద్వాన్ దస్తగిరి ఆపనికి పూనుకున్నాడు. ఆ ప్రయత్నంలో కొంత సమాచారాన్ని సేకరించాడు. రాజశేఖర్‌తో కలిసి పని చేసిన కొందరు కామ్రేడ్స్‌ను కలిసి వారి అనుభవాలను సమీకరించాడు. కాని, మరికొంత సమాచారసేకరణ జరిగితేకానీ కామ్రేడ్ దస్తగిరి తలపెట్టిన కార్యం ముందుకుసాగదు. భారత కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి వర్గ సభ్యుడుగానూ, రాష్ట్రపార్టీ కార్యదర్శిగానూ వుండి రాజశేఖరరెడ్డి సాగించిన కృషి వెలుగులోకి రావాలంటే ఆయనతో సన్నిహిత సంబంధం వున్న నాకు అప్పగిస్తేనే దస్తగిరిగారు తలపెట్టిన పని మరింత పరిపుష్టం కాగలదని రాజశేఖరరెడ్డి పెద్ద కుమారుడు డాక్టర్ విజయకుమార్ భావించి నన్ను కోరాడు. కామ్రేడ్ రాజశేఖర్ నాకు అత్యంత సన్నిహితుడు. చాలా కాలం కలిసి పని చేశాము. అందువల్ల నేను అంగీకరించక తప్పలేదు. డా॥విజయకుమార్ ఈ గ్రంథ ప్రచురణకు తన సంపూర్ణ ఆర్థిక సహకారం అందించి తోడ్పడినందుకు వారిని అభినందిస్తున్నాము.

అయితే నాకు కార్యభారం ఎక్కువగా వున్నందున సి.ఆర్.ఫౌండేషన్ ఆధ్వర్యాన నడుస్తున్న వృద్ధాశ్రమంలో చేరిన కామ్రేడ్ యన్.శివరామిరెడ్డిగారిని ఈ పనిలో సహక

రించవలసిందిగా కోరాను. అందుకు ఆయన అంగీకరించి రచనకు పూనుకోవటం వల్లనే నిర్ణీత కాలానికి ఈ గ్రంధాన్ని తీసుకురాగలిగాము. గ్రంధరచనలో మేమిద్దరమూ తరచు సంప్రదించుకుంటూ ముందుకు సాగాము.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి జీవిత విశేషాలను సేకరించడంతో పాటు వారికి సన్నిహితులుగా, మిత్రులుగా, తోటి కార్యకర్తలుగా వున్న ఆత్మీయుల పరిచయాలను కూడా మరికొన్ని సేకరిస్తేనే గ్రంధానికి పుష్టి చేకూరుతుందని భావించి అందుకు పూనుకున్నాం. మా అభ్యర్దన మేరకు కామ్రేడ్ ఏ.బి బర్దన్ మొదలగువారు, వారి అనుభవాలను సందేశరూపంలోనో, వ్యాసరూపంలోనో అందించారు వారందరికి మా ధన్యవాదాలు తెలియజేస్తున్నాం.

మరొక విషయాన్ని పేర్కొనాలి. వృద్ధాశ్రంలో వారి సతీమణి శ్రీమతి కొండమ్మతో పాటు విశ్రాంతి కొరకు వచ్చి వుండినా, నా అభ్యర్థన మేరకు శివరామిరెడ్డిగారు గ్రంధ సంపాదక బాధ్యతలు చేపట్టి అందరూ అందించిన సమాచారానికి సగిషీలు చెక్కి స్పూర్తిదాయకమైన పెద్దల ప్రవచనాలు ఈ గ్రంధంలో చేర్చి గ్రంధానికి వన్నె తెచ్చారు. వారికి నా హృదయపూర్వక అభినందనలు తెలియజేస్తున్నాను.

ప్రచురణకు తోడ్పాటు అందించిన ఆచార్య కేతు విశ్వనాధరెడ్డిగారికి, ప్రముఖ అభ్యుదయ రచయిత ఆర్.వి.ఆర్.గారికి, విశేష సహకారం అందించిన మిత్రులు పొనుగోటి కృష్ణారెడ్డిగారికి, తన వివరణాత్మక వ్యాసాన్ని అందించిన కామ్రేడ్ సిద్యాప్ దస్తగిరిగారికి మా ప్రత్యేక ధన్యవాదాలు తెలియజేస్తున్నాం.

ఈ గ్రంధాన్ని అతి తక్కువ కాలంలో చక్కగా ముద్రించిన అనుపమ ప్రెస్ మేనేజిమెంట్‌వారికి, వారి సిబ్బందికీ మా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాం.

చంద్ర రాజేశ్వరరావు ఫౌండేషన్ సంస్థాపక అధ్యక్షుడైన నీలం రాజశేఖరరెడ్డి స్మృతి చిరస్థాయిగా నిలిచి వుండేటందుకు నిర్మిస్తున్న నీలం రాజశేఖరరెడ్డి పరిశోధనా కేంద్రం తరపున ప్రధమ ప్రచురణగా ఈ గ్రంధాన్ని తీసుకు రాగలిగినందుకు మాకు సంతోషంగా వుంది. రాజశేఖరరెడ్డిగారి వర్థంతి డిసెంబరు 13న ఈ గ్రంధావిష్కరణ జరగడం కూడా సముచితంగా వుందని భావిస్తున్నాను

వై.వి.కృష్ణారావు
డైరెక్టరు
నీలం రాజశేఖరరెడ్డి పరిశోధనా కేంద్రం

హైదరాబాద్
3-12-2000

# కామ్రేడ్ రాజశేఖరరెడ్డిగారికి నివాళి

నేను పార్టీ కేంద్ర కార్యదర్శి వర్గ సభ్యుణ్ణి అయి, రాజశేఖరరెడ్డిగారికి సన్నిహితం అయిన తర్వాత వారిని గురించి బాగా ఎరుగుదును. అజయ్‌భవన్‌లో మేమిద్దరమూ ప్రక్క, ప్రక్క గదుల్లో వుంటూ వచ్చాము.

కేంద్ర నాయకత్వంలో ఆయన కప్పగించిన బాధ్యతలను జాగ్రత్తగా నిర్వహించేవారు. విద్యార్థి, యువజన రంగాలను చూచుకుంటూ, యీ రంగాలలో పనిచేస్తున్న యువ కార్యకర్తలను తన స్వంత పిల్లల్లాగా వారి అభివృద్ధి పట్ల శ్రద్ధ వహించేవారు. అటు తర్వాత యీ బాధ్యతలను పార్టీ నాకు అప్పగించింది.

పార్టీ శిక్షణా బాధ్యత కూడా వారే చూచుకునేవారు. వారి సారథ్యంలో వివిధ స్థాయిల్లో, వివిధ రంగాల్లో పనిచేస్తున్న కామ్రేడ్స్‌కు కేంద్ర, రాష్ట్ర స్థాయి తరగతులు నిర్వహించడమన్నది క్రమ పద్ధతిలో జరిగింది. పాఠ్యాంశాలు, వాటిని బోధించే పద్ధతినీ వారు స్వయంగా పర్యవేక్షించేవారు. వీరిలో నుండి కొందరిని ఎంపికచేసి, ఉన్నత సిద్ధాంత శిక్షణకు విదేశాలకు పంపే కర్తవ్యాన్ని కూడా నిర్వహించేవారు. ఈ విధంగా శిక్షణ పూర్తి చేసిన వారిలో కొందరు పార్టీలోనూ, ప్రజా సంఘాల్లోనూ బాధ్యతగల స్థానాల్లో వున్నారు.

పార్టీకి ఒక శాశ్వత రాజకీయ పాఠశాల వుండాలన్నది రాజశేఖరరెడ్డిగారి ఆ కాంక్ష. ప్రధానంగా వారి కృషి ఫలితంగానే ఢిల్లీకి సమీపంలో ఫరీదాబాద్ వద్ద ఇందుకొరకు ఒక భవనం నెలకొల్పబడింది.

క్రమశిక్షణ పట్ల ఆయన కఠినంగా వ్యవహరించేవారు. తన సహచరులకు కొంత యిబ్బంది కలగవచ్చు గాక, తన అభిప్రాయాలు, ప్రమాణాల పట్ల గట్టిగా నిలబడేవారు.

రాజశేఖరరెడ్డిగారు గొప్ప పార్టీ నాయకుడు, అంకితమైనటువంటి కమ్యూనిస్టు. నేను ఆయనను చూసిందీ, ఎరిగిందీ ఆ విధంగానే.

**ఏ.బి. బర్ధన్**

సి.పి.ఐ. జాతీయ సమితి

ప్రధాన కార్యదర్శి

# శ్రీ రాజశేఖరరెడ్డి ఆదర్శం చిరకాలం వర్థిల్లాలి!

శ్రీ నీలం రాజశేఖరరెడ్డి స్మృతులను గ్రంధస్తం చేస్తున్న సంకలన కర్తలకు నా హృదయ పూర్వక అభివందనాలు.

జాతీయోద్యమ ప్రభావంతో కమ్యూనిస్టు ఉద్యమంలో పెరిగి వున్నత శిఖరాలకు ఎదిగిన మహనీయుడు శ్రీ నీలం రాజశేఖరరెడ్డి.

మదనపల్లిలోనూ, బెనారస్ విశ్వవిద్యాలయంలోనూ విద్యార్థిగా జాతీయ భావాలను, ప్రగతి శీల దృక్పధాన్ని అలవర్చుకున్నారు. బెనారస్‌లో తన సహచరుల ప్రభావంతో కమ్యూనిస్టు ఉద్యమానికి అంకితమయ్యారు. నాటి నుండి తుది శ్వాస వరకు కమ్యూనిస్టు ఉద్యమ నేతగా తన జీవితాన్ని సార్థకం చేసుకున్నారు.

సిద్ధాంత నిబద్ధత, చెక్కు చెదరని అంకిత భావంతో సూత్ర బద్ధమైన జీవితాన్ని గడపి గొప్ప పేరు, ప్రతిష్ఠలను గడించిన మహనీయులు.

నేను రాజశేఖరరెడ్డి గారిని 1948 జనవరిలో బుద్ధవరంలో జరిగిన రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ మహాసభలో చూశాను. వారి ప్రసంగాన్ని విన్నాను. సెక్టేరియన్ పాలసీకి మూలమైన పార్టీ కేంద్రకమిటీ తీర్మానాన్ని వ్యతిరేకిస్తూ నిర్భయంగా మాట్లాడిన ధీశాలి.

1961వ సంవత్సరంలో రాజమండ్రి రాష్ట్రపార్టీ మహాసభలో ప్రదేశ్ కమ్యూనిస్టు సమితి కార్యదర్శిగా ఎన్నికైన తర్వాత అనతి కాలంలోనే పార్టీశ్రేణుల, వేలాది కార్యకర్తల అభిమానాన్ని అమితంగా చూరగొన్నారు. 60వ దశకంలో నేను కృష్ణాజిల్లా కమ్యూనిస్టు సమితి కార్యదర్శిగా పనిచేసిన దశలో వారికి సన్నిహితుడనయ్యాను.

శ్రీ రాజశేఖరరెడ్డి కమ్యూనిస్టు ఉద్యమ పురోగతికి యువ కార్యకర్తల ప్రాధాన్యతను గుర్తించి ప్రతి జిల్లాలో వందలాది మంది కార్యకర్తలు ఉద్యమ బాధ్యతలు స్వీకరించడానికి ఎంతగానో కృషి చేశారు. దీనికి తోడు సిద్ధాంత పరిజ్ఞాన వ్యాప్తికి బహుముఖంగా ప్రశంసనీయమైన కృషి చేశారు. పార్టీలో మార్క్సిస్టు మేధావివర్గ సముదాయం అభివృద్ధికి వారు చేసిన కృషి మరువలేనిది. నేటి చండ్ర రాజేశ్వరరావు ఫౌండేషన్ రూపకల్పన వారి కృషి ఫలితమే. శ్రీ రాజశేఖరరెడ్డి స్మృతికి ఉత్తమోత్తమ చిహ్నం నేడు నిర్మాణంలో వున్న పరిశోధనా కేంద్రం. ఇది భావి తరాలకు వెలుగుబాట. శ్రీ రాజశేఖరరెడ్డి ఆదర్శం చిరకాలం వర్థిల్లాలి.

న్యూఢిల్లీ
21.11.2000

దాసరి నాగభూషణరావు
సి.పి.ఐ. జాతీయ సమితి కార్యదర్శి.

# విషయసూచిక

పేజి నెం.

కమ్యూనిస్టు ఉద్యమంలో అహరహం కృషిచేసిన

# కామ్రేడ్ రాజశేఖరరెడ్డి జీవిత సంగ్రహం

1918లో కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డి అనంతపురం జిల్లా ఇల్లూరు గ్రామంలో జన్మించారు. మదనపల్లి తదితర చోట్ల హైస్కూల్ విద్యాభ్యాసం ముగిసిన తర్వాత బెనారస్ విశ్వవిద్యాలయంలో ఉన్నతవిద్య అభ్యసించారు. విశ్వవిద్యాలయంలో చదువు తున్న రోజుల్లోనే విప్లవకారులతోనూ, కమ్యూనిస్టులతోనూ ఆయనకు సంబంధాలు ఏర్పడ్డాయి. అక్కడే మార్క్సిజం వైపు ఆకర్షించబడి కమ్యూనిస్టుగా మారారు. అక్కడ బి.ఎ. ఫైనల్ చదువుతున్నప్పుడు అరెస్టు అయ్యారు. బెనారస్ విశ్వవిద్యాలయం నుండి తిరిగివచ్చిన తర్వాత జిల్లాలో విద్యార్థి, యువజన ఉద్యమాల నిర్మాణానికి పూను కున్నారు.

జిల్లాలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణానికి పునాదులు వేసిన వారిలో కామ్రేడ్ రాజశేఖర్ ఒకరు. 1938లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. మూడు సంవత్సరాల పాటు రహస్య జీవితం గడిపారు. 1941-42లో యుద్ధ వ్యతిరేక కార్యకలాపాల సందర్భంగానూ, ప్రకాశం ఆర్డినెన్స్ క్రింద రెండున్నర సంవత్సరాలు జైలు జీవితం గడిపారు. ఆగ్రా సెంట్రల్ జైలు, బెనారస్ జిల్లా జైలు, చెరైలీ సెంట్రల్ జైలు, రాజమండ్రి, ఆలీపూర్ సెంట్రల్ జైళ్లలో దాదాపు అయిదు సంవత్సరాలు గడిపారు.

1949-52 సంవత్సరాలలో ఆయన ఆస్తిని పోలీసులు జప్తు చేశారు. భూస్వామ్య కుటుంబంలో పుట్టిన రాజశేఖరరెడ్డి తన జీవితాన్ని కమ్యూనిస్టు ఉద్యమానికి అంకితం చేశారు. ఈ ఉద్యమానికి ఆయన ఎంతో త్యాగం చేసి ఆర్థికంగా తోడ్పడ్డారు.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి కొంతకాలం రైల్వే కార్మికులతోనూ, రైతు రంగంలోనూ పని చేశారు.

అనంతపురం జిల్లా పార్టీ కమిటికార్యదర్శిగా, రాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ సభ్యులుగా సుదీర్ఘకాలం పనిచేశారు.

1961 జూన్‌లో రాజమండ్రిలో జరిగిన రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ మహాసభలో ఆయన రాష్ట్ర కమిటీ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. 1971 సెప్టెంబరులో జరిగిన హైదరాబాదు మహాసభ వరకు ఆ బాధ్యతలను శక్తివంచన లేకుండా నిర్వహించారు. 1971లో కొచ్చిన్‌లో జరిగిన భారత కమ్యూనిస్టు పార్టీ మహాసభలో కేంద్ర కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. 1989వరకు ఆ బాధ్యతలు నిర్వహిస్తూ పార్టీ సిద్ధాంతం, కేడరు విద్య విషయాలలో ప్రత్యేక శ్రద్ధ వహించారు. 1992లో హైదరాబాదులో జరిగిన

---

*రాజశేఖర్ మరణానంతరం వెలువడిన 1995 జనవరి కమ్యూనిజమ్ సంచికలో సంపాదకవర్గం తరుపున కామ్రేడ్ రాజశేఖరరెడ్డిగారికి జోహార్లు తెలుపుతూ చేసిన ప్రకటన ఇది.*

పార్టీ మహాసభ వరకు కేంద్ర కార్యవర్గ సభ్యులుగా కొనసాగి, వయసు, ఆరోగ్యరీత్యా ఆ బాధ్యత నుండి స్వచ్ఛందంగా విరమించుకున్నారు.

రాష్ట్ర కమ్యూనిస్టు సమితి కార్యదర్శిగా రాష్ట్రంలో పార్టీ నిర్మాణ ఐక్యతకు ఎనలేని కృషి చేసిన కామ్రేడ్ రాజశేఖరరెడ్డి జాతీయ సమితి కార్యదర్శులలో ఒకరుగా దేశవ్యాపితంగా పార్టీ కార్యకర్తల శిక్షణకు, సైద్ధాంతిక పటిష్టతకు ఆదర్శప్రాయమైన సేవలు అందజేశారు. పార్టీ ఎడ్యుకేషన్ విభాగానికి అధిపతిగా సుదీర్ఘ కాలం వ్యవహరించారు. పార్టీ, ప్రజారంగాలలో వేలాదిమంది కార్యకర్తలను రాజకీయంగా, సైద్ధాంతికంగా తీర్చిదిద్ది ప్రజా ఉద్యమాల నిర్మాణానికి అమూల్యమైన సేవ చేశారు.

నాటి సోవియట్ యూనియన్, జి.డి.ఆర్., క్యూబా, వియత్నాం, చైనా తదితర దేశాలను సందర్శించిన సి.పి.ఐ. ప్రతినిధి వర్గాలకు పలుసార్లు ఆయన నాయకత్వం వహించారు.

కేంద్ర పార్టీ కార్యవర్గ సభ్యుడుగా కొంతకాలం పాటు కర్నాటక రాష్ట్ర పార్టీ నిర్మాణానికి, అభివృద్ధికి సహాయపడ్డారు.

గత రెండు మూడు సంవత్సరాలుగా హైదరాబాదులో వుంటూనే రాష్ట్ర పార్టీకి శక్తికొలదీ సహాయసహకారాలు అందజేశారు. కామ్రేడ్ చండ్ర రాజేశ్వరరావు ఫౌండేషన్ ప్రెసిడెంట్‌గా, కామ్రేడ్ తమ్మారెడ్డి సత్యనారాయణ ట్రస్టు అధ్యక్షులుగా ఉన్నారు.

రాజకీయంగాను, పార్టీ నిర్మాణం గురించి తన అభిప్రాయాలను నిర్మొహమాటంగా, నిక్కచ్చిగా తెలిపే స్వభావం ఆయనది. పార్టీ కార్యకర్తల అవసరాలను తెలుసుకుని స్పందించి, సహాయపడే విలక్షణ వ్యక్తిత్వం గల వ్యక్తి. వామపక్షాల ఐక్యత, కమ్యూనిస్టు ఐక్యత కొరకు చివరికంటా పరితపించిన కమ్యూనిస్టు నాయకుడు కామ్రేడ్ రాజశేఖర రెడ్డి. చిత్తశుద్ధి, నిస్వార్థత ఆయన గుణగణాలు.

**ఏ ఉద్యమానికైనా పునాదులు వేయటం కష్టం. ఉద్యమ నిర్మాతలు ఆదిలో ఎన్నో చిక్కులను, కష్టాలను ఎదుర్కొని నిలబడాల్సి వుంటుంది. అందులోనూ నికృష్ట జీవితం గడుపుతున్న కష్టజీవుల ఉద్యమమైన కమ్యూనిస్టు ఉద్యమానికి పునాదులు వేయటం మరీ కష్టం. అరణ్యాన్ని ఛేదించుకుంటూ మార్గం వేసినట్లుగానే రాజకీయరంగంలో పడుతూ లేస్తూ ముందుకు సాగవలసి వచ్చింది.**

– కంభంపాటిగారి కమ్యూనిస్టు పార్టీ చరిత్రకు
చండ్ర రాజేశ్వరరావుగారి పరిచయవాక్యాలనుండి

**అరుణోదయం ఊరుకోదు**
**కిరణాలను సారించనిదే**
**వసంతోదయం ఊరుకోదు**
**పరిమళాలను పారించనిదే**

*- సి.నా.రె.*
*విశ్వంభర*



**నీలం రాజశేఖరరెడ్డి, లీలావతమ్మ దంపతులు**

# కుమారులు



డా॥ నీలం విజయకుమార్



నీలం రవికుమార్



నీలం ప్రశాంత్



నీలం శ్రీకాంత్



ఇల్లూరులో వారి ఇల్లు

"మానవ జాతికి అత్యధికంగా మేలు చేయగల వృత్తిని మనం ఎంచుకున్నట్లయితే మనం దేనికీ తలవంచనవసరం లేదు. ఎందుచేతంటే అది అందరికోసం చేసే త్యాగం. అప్పుడు మనం పొందే ఆనందం అల్పమైనది కాదు. ఎందుచేతనంటే లక్షలాది ప్రజల సౌఖ్యము మన సౌఖ్యం అవుతుంది. మన కార్యాలు ప్రపంచంలో శాశ్వతంగా నిలిచి పోతాయి. మన అస్తికలు మహానుభావుల అశృధారలతో పునీతమవుతాయి"

- మార్క్స్

కమ్యూనిస్టు నీతి గ్రంథానికి కంభంపాటి ఉపోద్ఘాతం నుంచి

# ఒక దేశభక్తుల కుటుంబం

ఆంధ్రదేశపు ముఖ్య నదుల్లో పెన్నానది ఒకటి. దాని తీరాన వున్న గ్రామం ఇల్లూరు. ఆ గ్రామంలో పుట్టినవాడే మన రాజన్న.

ఇల్లూరు, తరిమెల రెండూ కూడా పెన్నానది దక్షిణ తీరాన ఉన్న గ్రామాలే. వాటి మధ్య దూరం పది కిలోమీటర్లే. రెండు కూడా జిల్లా కేంద్రం అనంతపురానికి 30 కి.మీ. దూరంలో వున్నాయి.

పెన్నానది కర్నాటకలో పుట్టి, అనంతపురం జిల్లాలో ప్రవేశించి అనంతపురం, కడప, నెల్లూరు జిల్లాల మధ్య ప్రవహించి బంగాళాఖాతం చేరుకుంటుంది. పెన్న అహోబిలం, మిడ్‌పెన్నారు, మైలవరం, సోమశిల రిజర్వాయర్లన్నీ పెన్నానది మీద నిర్మించినవే. ఇల్లూరు కొంచెం ఎగువన, తరిమెల కొంచెం దిగువన పెన్నానది ఒడ్డున వున్నాయి. తుంగభద్ర దిగువ కాల్వలో భాగమైన మిడ్‌పెన్నారు ప్రాజెక్టు నుండి ఇల్లూరు, తరిమెల పొలాలకు తుంగభద్ర నీరు అందుతుంది.

రాష్ట్రపతి పదవి అలంకరించిన నీలం సంజీవరెడ్డిగారూ, ఆయన సోదరుడు రాజశేఖరరెడ్డి గారు ఇల్లూరుకు చెందటం వల్లా, సుప్రసిద్ధ కమ్యూనిస్టు నాయకుడు నాగిరెడ్డిగారూ తరిమెలకు చెందటం వల్లా ఈ రెండు గ్రామాలు రాష్ట్ర రాజకీయ పటంలో ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నాయి.

స్వాతంత్ర్యోద్యమంలో పేరుగాంచిన కల్లూరు సుబ్బారావుగారి కృషి ఫలితంగా రాజశేఖరరెడ్డిగారి తండ్రి చిన్నపరెడ్డిగారు కాంగ్రెసు పార్టీలో చేరినారు. తరిమెల నాగిరెడ్డి గారి తండ్రి అయిన సుబ్బారెడ్డిగారి సోదరి సుబ్బమ్మగారిని చిన్నపరెడ్డిగారు వివాహం చేసుకున్నారు. అందువల్ల ఇల్లూరు, తరిమెల చేరువైనాయి. రాజకీయంగా జంట పదాలైనాయి. తదుపరి నీలం సంజీవరెడ్డిగారి సోదరి లక్ష్మీకాంతమ్మగారిని తరిమెల నాగిరెడ్డి వివాహం చేసుకోవటం రాజన్న, నాగిరెడ్డిగార్లు ప్రముఖ కమ్యూనిస్టులు కావటం చేత ఈ రెండు గ్రామాలు మరింత చేరువైనాయి.

చిన్నపరెడ్డి, సుబ్బమ్మగార్లకు నలుగురు కుమారులు, నలుగురు కుమార్తెలు కలిగారు. కుమారులు : నీలం సంజీవరెడ్డి, రాజశేఖరరెడ్డి, ప్రభాకరరెడ్డి, రామసుబ్బారెడ్డి. కుమార్తెలు : తులసమ్మ, రామలక్ష్మమ్మ, లక్ష్మీకాంతమ్మ, రామరత్నమ్మ. తన అక్కగారైన తులసమ్మగారి కూతురు లీలావతమ్మను రాజన్న వివాహం చేసుకున్నారు. సంజీవరెడ్డిగారి సోదరి లక్ష్మీకాంతమ్మగారిని తరిమెల నాగిరెడ్డిగారు వివాహం చేసుకున్నారు.

రాజశేఖరరెడ్డి, లీలావతమ్మగార్లకు కుమారులే గానీ, కుమార్తెలు కలుగలేదు వారి కుమారులు డా॥ నీలం విజయకుమార్ (కంటి వైద్య నిపుణులు), రవికుమార్, ప్రశాంత రెడ్డి, శ్రీకాంత రెడ్డి.

హిందూపురం పార్లమెంటు నియోజకవర్గానికి ప్రాతినిధ్యం వహించిన మాజీ పార్లమెంటు సభ్యుడు రామకృష్ణారెడ్డిగారు రాజన్నసోదరి రామరత్నమ్మను వివాహ మాడారు. కర్నూలు పార్లమెంటు మాజీ సభ్యుడు ఇ.అయ్యప్పరెడ్డిగారి సోదరి డా॥నారాయణమ్మను రాజన్న సోదరుడు ప్రభాకరరెడ్డి వివాహమాడారు.

ముగ్గురు సోదరులు, నలుగురు సోదరీలు, నలుగురు కుమారులు ఉండటం చేత రాజన్నకు విస్తారమైన బంధు వర్గం సంక్రమించింది.

అనంతపురం జిల్లాలోఆనాడు పాముదుర్తి, దొరిగిల్లు ఫ్యూడల్ నియంతృత్వానికి ప్రతీకలు కాగా, ఇల్లూరు, తరిమెల గ్రామాలు జాతీయోద్యమాన్నీ, కమ్యూనిస్టు ఉద్యమాన్నీ స్ఫురింపచేశాయి.

రాజన్నది దేశ భక్తుల కుటుంబం కమ్యూనిస్టు కావటానికి ఆయనకు లభించిన మంచి నేపథ్యం.

**ఈ రాణి ప్రేమ పురాణం**
**ఆ ముట్టడికైన ఖర్చులు**
**మతలబులూ, కైఫీయతులూ**
**ఇవి కావోయ్ చరిత్ర సారం**

**- శ్రీ. శ్రీ.**

**అనంతపురం జిల్లా**

**బడుగు జీవుల చీకటి బ్రతుకుల్లో**

**వెలుగు దీపాలు వెలిగించిన**

**మహనీయుల్లో**

**రాజన్న!**



సదాశివన్, రాజన్న, వి.కె.

# జీవిత చిత్రణ



- విద్వాన్ దస్తగిరి

అనంతపురం జిల్లాలో తరతరాలుగా పాతుకొని వున్న "ప్రశాంతతను" విచ్ఛిన్నం చేసింది కమ్యూనిస్టు పార్టీ. ఐదుకల్లు సదాశివన్, నీలం రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి, వి.కె. ఆదినారాయణరెడ్డి- వీరే ఆవిచ్ఛిన్న కారులు. అంతవరకు కష్టజీవులు 'మాట్లాడే పశువులు' గా, 'సొంతంగా నడిచే ఉత్పత్తి సాధనాలు' గానే వుండేవారు. తమ యజమానుల, షావుకార్ల, ధనీల, గొంచికాళ్ళ ఆనందాలకోసం, సుఖాలకోసం బతకటమే కష్టజీవుల బతుకుగా వుండేది. ఇందులో ఏమాత్రం ఏమారినా- అనారోగ్యంతోనైనా సరే స్త్రీ, పురుష భేదం లేకుండా పశువులతో పాటు బందెలదొడ్లో బంధించిన గొంచికాళ్ళు వున్నారు. ఆడకూలి పనికిరాకపోతే నిజంగా 'ముట్టు' అయిందా? లేదా? అని చీర వూడదీసి కనుక్కు రమ్మని చాకలిని పంపిన ధనీలున్నారు. అయినా పేదలు సహించినారు. అంతా ప్రశాంతంగానే వున్నది. "భారత క్షామ చరిత్రలో దక్కను ప్రాంతమొక నల్లని మచ్చ" అని బి.ఎన్. గంగూలి అనే చరిత్రకారుడు అన్నాడట. అనంతపురం జిల్లా ఈ నలుపులో కారు నలుపు. కరువు కాలంలో అనంతపురం జిల్లా ప్రజలు వనచరాల మాదిరి కాయకసురు, ఆకులలుములు తిని బతికినారు. చేత్తో ముట్టుకుంటే నుసి అయ్యే ఎండిన ఆకుల్ని సైతం ముల్లుతో గుచ్చి, సేకరించి, గంజి చేసుకొని బతికినారు. మైళ్ళు, మైళ్ళు నడుచుకుంటూ వలసలు పోయినారు. పసిపిల్లల ప్రాణాలు కాపాడుకోలేక వాళ్ళను అమ్మివేసిన తల్లులూ వున్నారు. తమ ఆడ సుఖాలు అమ్మి కుటుంబాలను బతికించిన మమతామూర్తులూ వున్నారు. బిడ్డలకన్నా ప్రీతిగా చూసే పశువులను కోసుక తిన్న రైతులూ వున్నారు. ఎత్తు తక్కువగా వుంటే కరువు పనిలో కూలి దొరకదని మట్టిని కుప్పగాపోసి, నిలబడి అవమానం పాలైన పిల్లలూ వున్నారు. ఇంత హీన, దీన పరిస్థితులలో కూడా కరువుక్యాంపును సొంత ఆదాయ వనరుగా మార్చుకొన్న అధమాధములూ వున్నారు. తమ బాధల్ని తమ కర్మఫలంగా సహించి, కష్టజీవులు ఆ "ప్రశాంతత"ను భగ్నం చేయలేదు. గ్రామ ధర్మాల పేరిటో, మత ధర్మాల పేరిటో, కుల ధర్మాల పేరిటో, కోటానుకోట్ల దేవతలపై నమ్మకముంచో బాధలు భరించి సహనముతో వున్నారు. కాని, కమ్యూనిస్టు భావజాలం వారిని ఆవహించి, భౌతిక శక్తిగా మారినపుడు జలజల శరీరాన్ని విదిలించి, తల పైకెత్తి, రుమాలు చుట్టి, నడుంకట్టు బిగించి, వున్న సత్తువంతా పొంగించి, అంత ఎత్తు నిక్కి, కళ్ళతో వాడిగా చూస్తూ, ఉక్కు పిడికిళ్ళు బిగించినపుడు "ప్రశాంతత" భగ్నమైంది.

అంతవరకు పీడించిన ధనీలు బందెలదొడ్లో బందీలైనారు. అవమానం పాలై సకల దౌష్ట్యాలు భరించిన స్త్రీ, దానికి కారకుడైన గొంచికాన్ని బండికి కట్టేసి, ఎడంచేత్తో అతని మీసాలను యిగ్గి, వాటితోనే అతని తలను పైకెత్తి, నోరు తెరిపించి అదే పనిగా వేసుకొచ్చిన వక్కాకెంగిలుమిసింది. దానితో విస్ఫోటనం చెందినట్లు "ప్రశాంతత" భగ్నమైంది.

## చిమ్మచీకటిలో దీపాలు

ఈ నలుగురూ ఉన్నత కులస్థులు. చివరి ముగ్గురూ భూస్వాముల బిడ్డలు. వీరు వారసత్వంగా లభించిన సుఖాలను, సౌకర్యాలను అసహ్యించుకొని వదలి పెట్టినారు. సదాశివన్ హరిజనులలో ఒకడుగా వుంటూ, వారి అభ్యున్నతికి గట్టి కృషి చేసినాడు. వీరు శ్రామిక వర్గనీతితో దైనందిన జీవితాలను గడిపినారు. పేదప్రజల పోరాటాలకు నాయకత్వం వహించినారు. వీరిని అగ్రకులస్థులుగా, భూస్వాములుగా కాక తమ ఆప్తులుగా పేదవారు చూసినారంటే వీరి ప్రవర్తన ఎట్లుందో వేరే చెప్పే పనిలేదు. తమ కులంవాడు మాత్రమే తమకు మేలు చేయగలడనే కుల, మత ఛాందస వూబిలో కూరుకు పోయిన నేటి మనిషి; ఎవరెట్లా నాశనమైతే నాకేం అని ఆబగా డబ్బులకుప్పలు నాక్కోవటమే జీవిత సిద్ధాంతంగా గల నేటి మనిషి యిటువంటి మహనీయుల జీవితాలను అధ్యయనం చేయాలి. చిమ్మచీకటిలో దీపాలై ఏ సమస్యను ఎట్లా స్పందించారు? ఎట్లా పరిష్కరించారు? అనే సవివరమైన జీవిత చిత్రణ చేయాలి నేటి యువతకు దానిని అందించాలి. వాటి అధ్యయనం ద్వారానే, ఆ వెలుతురులో మాత్రమే యువకులు మార్గనిర్దేశం చేసుకోగలరు. ఆ దిక్సూచి వల్లనే సరైన దారిలో పయనించగలరు.

**దారులు వేరైన తండ్రులూ, తనయులూ**

నీలం రాజశేఖరరెడ్డిది అనంతపురంజిల్లా యిల్లూరు గ్రామం. తండ్రి చిన్నపరెడ్డి. ఖద్దరు దారి. ఖద్దరు నడికేవాడు. కాంగ్రెసు ప్రచారానికి తోడ్పడేవాడు. నాగిరెడ్డిది తరిమెల. తండ్రి సుబ్బారెడ్డి. యిల్లూరు, తరిమెల పక్క పక్క గ్రామాలు. చిన్నపరెడ్డి, సుబ్బారెడ్డి యిద్దరూ అనంతపురంలో కల్లుతొట్టి, ఈతచెట్టును వూరేగించి, కల్లు, సారాయి అంగళ్ళ నిషేధానికి కృషి చేసినారు. తమ వూర్లలో అంగళ్ళు లేకుండా చేసినారు. ఇట్లా ఒకటి, రెండు గుణాలు తప్ప మిగతా అంతా భూస్వామిక, పెత్తందారీ లక్షణాలన్నీ సుబ్బారెడ్డిలో వున్నాయి. రాజశేఖరరెడ్డి చెప్పినట్లు "అన్న నీలం సంజీవరెడ్డి డైనమిక్ లీడరు. చదువు చాలించి యింటి బాధ్యతలు చేపట్టినాడు సంజీవరెడ్డి. 1934 జనవరి 3,4 తేదీలలో గాంధీ అనంతపురంలో 'హరిజన టూర్' చేసినాడు. అనంతపురంలో బహిరంగ సభకు జనం వేలాదిగా వచ్చినారు. మైకులు లేవు. గాంధీ చేప్పే, ఆ మాటలను అనుసరించి

మరొకరు బిగ్గరగా అరచి చెప్పారు. ఆ సభలో పెనుకొండ ఆర్ట్ టీచరు సి.ఎన్. వెంకటరావు తాను చిత్రించిన కొన్ని చిత్రాలను గాంధీకి బహూకరించినాడు. గాంధీ వాటిని వేలం వేసి, వచ్చిన డబ్బును జిల్లా హరిజనోద్యమానికి యిచ్చినాడు. వాటిలో కొన్ని నీలం సంజీవరెడ్డి కొన్నాడు. ఈ కాంగ్రెసు కుటుంబ వాతావరణంలో వున్నాడు రాజశేఖరరెడ్డి. జిల్లాలోని చాలా మంది భూస్వామిక రెడ్లు జస్టిస్ పార్టీలోనే తమ భవిష్యత్తు వుందని తేల్చినారు. అంతేకాదు తమ పిల్లల అభివృద్ధిని కాంగ్రెసులోనే చూడగలిగినారు. అందుకే తమ పిల్లల్ని కాంగ్రెసు రాజకీయాలలో చురుకుగా పాల్గొనేటట్లు ప్రోత్సహించినారు. కాని, నీలం రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి తమ భవిష్యత్తు కోసం కాక, పేదప్రజల ఉజ్జ్వల భవిష్యత్తు కోసం కమ్యూనిస్టులై తమ పెత్తందారీ తనాన్నే సవాల్ చేస్తారనేది వారు ఊహించని పరిణామం.

**కమ్యూనిస్టు రాజకీయ జీవితానికి శ్రీకారం చుట్టిన బెనారస్**

నీలం సంజీవరెడ్డి వివాహానికి పప్పూరి రామాచార్యులు, కల్లూరి సుబ్బారావు మొదలైన జిల్లా కాంగ్రెసు ప్రముఖులంతా వచ్చినారు. రాజశేఖరరెడ్డిని, నాగిరెడ్డిని బెనారస్ జాతీయ కళాశాలలో చదివిస్తే బాగుంటుందని కల్లూరి సుబ్బారావు సూచించినాడు. సూచించడమే గాక పెద్దలను ఒప్పించి, బెనారస్‌లో వారిద్దరినీ చేర్పించే బాధ్యతకూడా తీసుకున్నాడు.

రాజశేఖరరెడ్డిని, నాగిరెడ్డిని వెంటబెట్టుకొని కల్లూరు సుబ్బారావు రైల్లో బయలుదేరినాడు. మధ్యలో వార్ధాలో దిగి, గాంధీ ఆశ్రమానికి పోయినారు. వీరు పోయినపుడు గాంధీ చర్కా వడుకుతూ ఏదో ఆర్టికల్ డిక్టేట్ చేస్తున్నారు. వీరిని చూడగానే గాంధీ పలకరించినాడు. కల్లూరి సుబ్బారావు తాము వచ్చిన విషయం చెప్పినాడు. "జె.యం. కుమార్‌ను చూసినారా? "అన్నాడు గాంధీ." భోం చేస్తారా? అనీ అడిగినాడు. "లేదు, లేదు, బైట తింటాము"న్నాడు కల్లూరి సుబ్బారావు. కాని అక్కడ తినడమే మహా భాగ్యమని రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి భావించినారు. అవకాశం చేజారింది. బయటకు వచ్చిన తర్వాత "సప్పని కూడు ఎవడు తినేది?" అన్నాడు కల్లూరి సుబ్బారావు.

బెనారస్ జాతీయ కళాశాలకు మదన మోహన మాలవ్య వైస్-ఛాన్సలర్. అక్కడ సుభాసు చంద్రబోసు, యం.యన్. రాయ్, ఆర్.పి. భట్టాచార్య, బాట్లీవాలా మొదలైన ప్రముఖుల సమావేశాలు జరిగేవి. అట్లా వామపక్ష భావాలతో పరిచయం ఏర్పడింది.

**సదాశివన్ పర్యవేక్షణలో రాజకీయ రంగప్రవేశం**

రాజశేఖరరెడ్డి వేసవి శెలవులలో ఇంటికి వచ్చేటప్పుడు అనంతపురంలో పార్టీవారున్నారా? అని కమ్యూనిస్టు పార్టీ నాయకులు పి.సి.జోషీని అడిగినారు. ఎవరో యిద్దరున్నారు,

వివరాలకోసం పుచ్చలపల్లి సుందరయ్యను సంప్రదించమన్నారు జోషీ. సుందరయ్య ద్వారా ఆ యిద్దరూ ఐదుకల్లు సదాశివన్, జి. రామకృష్ణ అని తెలుసు కున్నాడు. అనంతపురం వచ్చి కేశవ విద్యానికేతన్‌లో సదాశివన్‌ను కలుసుకున్నాడు.

అప్పటికే సదాశివన్ జిల్లా కాంగ్రెసు నాయకునిగా, రాష్ట్ర కాంగ్రెసు కమిటీ సభ్యునిగా వున్నారు. ముఖ్యంగా హరిజనోద్యమ నాయకునిగా, నిజాయితీకి, పట్టుదలకు, కార్యసాధనకు మారుపేరుగా జిల్లాలో పాపులర్ అయివున్నారు. జిల్లాలో తొలి కమ్యూనిస్టు ఆయన. గ్రామాలు తిరిగి, ధాన్యము వసూలు చేసి, హరిజన హాస్టలు 'కేశవనికేతన్'ను ఆదర్శవంతంగా "ది బెస్ట్" గా నడుపుతున్నాడు. కాంగ్రెసు ప్రచారం సందర్భంగానూ, హరిజనోద్యమ సందర్భంగానూ జిల్లాలో సదాశివన్ తిరిగినన్ని గ్రామాలు అప్పటికీ, యిప్పటికీ ఏ పార్టీవారు కూడా తిరిగినవారు మరెవ్వరూలేరు. కేశవ విద్యానికేతన్‌ను హరిజన విద్యార్థుల వసతి గృహంగానే కాక, రాజకీయ శిక్షణా శిబిరంగా, పార్టీ రహస్య కార్యకలాపాల కేంద్రంగా నడుపుతున్నాడు.

శెలవులలో వచ్చినపుడు రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి, విద్వాన్‌విశ్వం, టాగూర్ లాడ్జిలోను, శివరాం బంగ్లాలోను నిర్వహించే స్టడీ క్లాసులకు హాజరై బోధించేవారు. ఆ క్లాసులకు కడప జిల్లా నుండి విద్యార్థులుగా వచ్చిన యన్. శివరామిరెడ్డి, జె వెంకటరామిరెడ్డి (ఈనాటి కమ్యూనిస్టు పార్టీ నాయకులు) యింకా ఎన్.సి.గంగిరెడ్డి, స్థానికంగా వి.కె. ఆదినారాయణరెడ్డి, తిరుమలరెడ్డి మొదలగు విద్యార్థులు హాజరయ్యేవారు. తరగతులు బోధించడమే కాకుండా మార్క్సిస్టు, లెనినిస్టు సాహిత్యాన్ని, ముఖ్యంగా ఆగ్రా నుండి వెలువడే సోషలిస్టు సాహిత్యాన్ని అమ్మేవారు. ఆ సాహిత్యంపై చర్చించేవారు.

1937లో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలు జరిగినాయి. ఆ ఎన్నికలలో జనం ఉప్పెనలా వచ్చి, జస్టిస్ పార్టీని చిత్తుచేసి, కాంగ్రెసుకు బ్రహ్మాండమయిన విజయం చేకూర్చినారు. ఈ ఎన్నికలు జిల్లా రాజకీయాల్లో ఒక మలుపును తెచ్చినాయి. ఈ ఎన్నికలతో యువకులలో రాజకీయ చైతన్యం బాగా పెరిగింది.

ఈ ఎన్నికలలో పరిచయం అయిన యువకులను సంఘటిత పరిచి, సోషలిస్టు భావాలవైపు మళ్ళించడానికి, యువజన సంఘం ఏర్పాటు చేయడానికి సదాశివన్ చొరవ తీసుకున్నాడు. ప్రపంచవ్యాప్తంగా జరుగుతున్న యువజనోద్యమాల గురించి తరిమెల నాగిరెడ్డి సాధన పత్రికలో వ్యాసాలు రాసినాడు. జిల్లా యువజన సంఘం ఏర్పాటు చేయడానికి 1.9.1937న కేశవ విద్యానికేతన్‌లో ఒక సమావేశం జరిగింది. జిల్లాలోని అన్ని ప్రాంతాలనుండి 130 మంది హాజరైనారు. కామ్రేడ్ కె.వి.రామకృష్ణారెడ్డి యం.ఎ., బి.యల్ (రాజశేఖరరెడ్డి సోదరి భర్త) అధ్యక్షత వహించినాడు. ఆ సమావేశం నీలం

సంజీవరెడ్డిని అధ్యక్షునిగాను, సదాశివన్‌ని ప్రధానకార్యదర్శిగాను, తరిమెల నాగిరెడ్డి, విద్వాన్‌విశ్వంలను కార్యదర్శులుగాను మొత్తం 14 మందితో కార్యవర్గాన్ని ఎన్నుకొంది. సమావేశం ఆరు తీర్మానాలను ఆమోదించింది. "దారిద్ర్యము, నిరుద్యోగము పారద్రోలి ప్రజలందరికీ సమాన స్వేచ్ఛ నివ్వగలిగిన స్వాతంత్ర్యము పొందుట" అనేది మొదటి తీర్మానము. యువజన సంఘము స్టడీ సర్కిల్స్‌ను విస్తారంగా నిర్వహించింది. వామపక్ష సాహిత్య ప్రచారానికి అన్ని అవకాశాలూ వుపయోగించింది. రాజశేఖర రెడ్డి స్టడీ సర్కిల్స్ కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొన్నాడు.

1938 మే 24,26,27 తేదీలలో మదనపల్లెలో రాయలసీమ యువజన, రైతు, రాజకీయ, మహాసభలు జరిగినాయి. 24న రైతు మహాసభ, 26న యువజన మహాసభ జరిగింది. యువజన మహాసభకు నీలం సంజీవరెడ్డి అధ్యక్షత వహించినారు. సంజీవరెడ్డిని ఆంధ్రరాష్ట్ర సంయుక్తకార్యదర్శిగా పట్టాభి పరిచయం చేసినాడు. సభను ఆచార్య ఎన్.జి. రంగా ప్రారంభించినారు, ఆ సభల గురించి రాజశేఖరరెడ్డి యిట్లా అన్నాడు- "ఈ సభకు నేనూ హాజరైనాను. బహిరంగసభలో ప్రసంగించడం అదే మొదలు. ఇందులాల్ యాజ్ఞిక్, బుఖారి ఉపన్యాసకులుగా వచ్చినారు. అక్కడి నుంచి యాజ్ఞిక్, బుఖారి కరువు ప్రాంతాలు చూడడానికి అనంతపురం వచ్చినారు. వారి వెంబడి నేను రావాల్సి వచ్చింది. సంజీవరెడ్డి, సదాశివన్ మహా సభల్లోనే నిల్చినారు."

1938 డిసెంబరులో బెనారస్‌లో పార్టీ సభ్యత్వం లభించింది రాజశేఖరరెడ్డికి. బెనారస్ యూనివర్సిటీ శాఖ కార్యదర్శిగా కూడా వున్నానన్నారు రాజశేఖరరెడ్డి.

అనంతపురం జిల్లా యువజన సంఘం స్టడీ సర్కిల్స్‌తో పాటు రాజకీయ శిక్షణా తరగతులు నిర్వహించింది. లేపాక్షి, పడమర ప్రాంతాలలో తక్కువ వ్యవధిగల పాఠశాలలూ నిర్వహించింది. ఆ క్లాసుల తరువాత జిల్లాలోని ముఖ్య కార్య కర్తలందరికీ నెలరోజుల పాఠశాల నడపాలనే డిమాండు వచ్చింది. నీలకంఠాపురం శ్రీరాములరెడ్డి అధ్యక్షులుగాను, ఐదుకల్లు సదాశివన్ కార్యదర్శిగానూ, 5-5-39 నుండి నెలరోజులపాటు 'వేసంగి రాజకీయ పాఠశాల' హిందూపురం హైస్కూలు బిల్డింగ్‌లో జరిగింది. మాల్యవంతం వెంకటరెడ్డి, పెడపల్లి చిదంబరరెడ్డి, జె.సి. నాగిరెడ్డి పాఠశాల నిర్వహణలో బాధ్యతలు తీసుకున్నారు. కల్లూరు సుబ్బారావు, పప్పూరు రామాచార్యులు తరచు వచ్చి పర్యవేక్షణ చేసినారు. ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ న్యాయపతి నారాయణమూర్తి రానందున నీలం సంజీవరెడ్డి పాఠశాలను ప్రారంభించినారు. ప్రతాపగిరి రామమూర్తి ప్రిన్సిపాల్‌గా వ్యవహరించినాడు. పి.సి.జోషి కార్డెకర్, పుచ్చలపల్లి సుందరయ్య, పి. రామమూర్తి, ఆచార్య రంగా, హరిసర్వోత్తమరావు, శనివారపు సుబ్బారావు, బెజవాడ గోపాలరెడ్డి, కాళేశ్వరరావు, నీలం రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి, ఐదుకల్లు సదాశివన్

తరగతులు బోధించినారు. భౌతికవాదం, సోషలిజం, సామ్రాజ్య వాదం, రష్యావిప్లవం, వివిధ వర్గాలు, వాటి మధ్య సంబంధాలు మొదలైనవి కొన్ని బోధనాంశాలు, వీటితో పాటు డ్రిల్లు, హిందూస్థాన్ సేవాదళ పద్ధతులు గ్రామాలలో సాంఘిక సేవ (ప్రాక్టికల్ కోర్సు) సదాశివన్ బోధించినాడు. పాఠశాలకు 50 మంది విద్యార్థులు హాజరైనారు. డి శాంతప్ప, బి.సి. నరసింహులు, కె బి నరసప్ప, డి. నరసింహులు అప్పటి విద్యార్థులలో కొందరు. ఈ పాఠశాల చివరిరోజున ఏర్పడిన నూతన కార్యవర్గం "యువజనోద్యమం" పై పుస్తకం రాయడానికి తరిమెల నాగిరెడ్డి, నీలం రాజశేఖరరెడ్డి, విద్వాన్‌విశ్వం, కె.వి. రామకృష్ణారెడ్డి గార్లతో ఒక కమిటీని ఏర్పరచింది. "సంజీవరెడ్డి అపుడు సోవియట్ వ్యతిరేకి. ఈ క్లాసుల్లో బోధించే అంశాలు, వచ్చిన టీచర్లను బట్టి సంజీవరెడ్డి గారికి అర్థం అయింది యువజన సంఘం కమ్యూనిస్టు గ్రూపులోకి పోతున్నదని. దాంతో ఆయన అలిగిపోయినాడు" అన్నాడు రాజశేఖరరెడ్డి.

1940 మొదట్లో నీలం రాజశేఖరరెడ్డిపై ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం అరెస్టు వారెంటు జారీ చేసింది. అందువల్ల ఆయన అజ్ఞాతవాసం చేయటానికి అనంతపురం వచ్చినాడు. పార్టీ ఆదేశం మేరకు టికెట్లుకొని రాజశేఖరరెడ్డిని రైలెక్కించినాడు మల్లాది రామమూర్తి. రాజశేఖరరెడ్డి అనంతపురం వచ్చి సదాశివన్‌ను కలిసినాడు. ఆయన పార్టీ ఆర్గనైజేషన్ కోసం మొదట బుక్కపట్నం ఏరియాకు పంపినాడు. ఆ మొదటి ప్రయాణం యిట్లా సాగింది. ఈ ప్రయాణం రాజశేఖరరెడ్డికి బాగా జ్ఞాపకం. రాజశేఖరరెడ్డి అనంతపురంలో రైలు ఎక్కడానికి వీలులేదు. అందువల్ల పక్కనవున్న జంగాలపల్లి రైల్వేస్టేషనులో వదిలిరమ్మని, హాస్టలులో చదువుకుంటున్న శిష్యుడు శివశంకర్‌కు చెప్పినాడు సదాశివన్. శివశంకర్ సైకిలుమీద రాజశేఖరరెడ్డిని తీసికొని పోతున్నాడు. నేరుగా జంగాలపల్లికి పోకుండ, రాప్తాడు దోవగుండా చుట్టుకొని పోతున్నారు. రాప్తాడు నుంచి జంగాలపల్లికి దోవ తెలీదు శివశంకర్‌కు. అవి పీర్ల పండగ రోజులు. చంద్రుడు మునిగి పోయినాడు. చీకటిగా వుంది. మేఘాలు వున్నందున మరింత చీకటిగా వుంది. రాప్తాడులో పీర్ల మెరవణి జరుగుతున్నది. రాజశేఖర రెడ్డిని ఊరిబయటే వదిలిపెట్టి, తనొక్కడే వూరిలోకిపోయి, నమ్మకస్థులైన బంధువుల దగ్గర జంగాలపల్లికి దోవ తెలుసుకొని వచ్చినాడు శివశంకర్. కొత్తదోవ, అడ్డదోవ, సైకిల్‌లైట్ ఆధారంగా ముందుకు పోతున్నాడు. ఒకచోట బురదలో సైకిలు దిగబడింది. అక్కడి నుండి బురద బురదగా వుంది. అందువల్ల సైకిలు తోసుకుంటూ పోతున్నారు. పెడల్‌ను చేత్తో తిప్పి, అపుడు వెలిగిన లైటు వెలుతురులో దోవ గుర్తించి పోతున్నారు. ఒక చోట బురదలో దిగబడి పోయినారు. చెప్పులు యిరుక్కొని పోయినాయి. అట్లా తిప్పలు పడుకుంటూ స్టేషను చేరినారు. రాజశేఖరరెడ్డిని అక్కడ వదిలివేసి, మామూలు దోవ గుండా వెనుతిరిగినాడు శివశంకర్. బాగా అలసిపోయి వున్నందున ఆదమరచి నిద్ర పోయినాడు రాజశేఖరరెడ్డి.

రైలు వచ్చింది, వెళ్ళింది. ఆయనకు మెలకువ రాలేదు. ఆ తరువాతి రైలుకు వెళ్ళినాడు. ఇట్లా 1940లో ప్రారంభమైన పార్టీ నిర్మాణము 1946 నాటికి ఒక రూపానికి వచ్చి, ఉరవకొండలో ప్రథమ మహాసభ జరిగి, నీలం రాజశేఖరరెడ్డి జిల్లా కార్యదర్శిగా ఎన్నికైనాడు.

ఐదుకల్లు సదాశివన్ జిల్లాలో తనకు వున్న కాంగ్రెసు పరిచయాలను కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి ఉపయోగించినారు. బుక్కపట్నం ఏరియాలో యం.కె.దాసప్ప, రామప్ప, వెంగళమ్మ చెర్వు లక్ష్మీ నారాయణరెడ్డి, లోచర్ల ఆదినారాయణరెడ్డి, పెడబల్లి రఘునాథరెడ్డి, ఘనేనాయక్, చింతలయ్య, కళ్యాణదుర్గం ఏరియాలో భంగి ఎర్రిస్వామి, భంగి రామప్ప; ఉరవకొండ ఏరియాలో బాబాసాహేబ్, చెంగల్వ సంజీవప్ప, నెట్టికల్లు; అనంతపురం ఏరియాలో పూలకుంట సంజీవులు, నాగిరెడ్డి, తరిమెలలో శ్రీరాములు రెడ్డి, రూపావతారం మొదలైన వారు పార్టీ నిర్మాణంలోకి వచ్చినారు. గుంతకల్లు రైల్వే వర్కర్స్ యూనియన్ పార్టీ నాయకత్వం కిందికి వచ్చింది. రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి, ఐదుకల్లు సదాశివన్ జిల్లాలో విస్తృతంగా తరగతులు నిర్వహించినారు. ఇద్దరు నుంచి పది, పదైదు మందిదాకా హాజరయ్యేవారు. అట్లా హాజరైనవారు మరికొంతమందికి చెప్పినారు. థియరీ బాగా చదువు కొన్నందున తన క్లాసులన్నీ విజయవంతమైనాయి అని అన్నారు రాజశేఖరరెడ్డి. తోటల్లో, గుట్టల్లో, స్మశానాల్లో, యిండ్లలో రహస్యంగా తరగతులు నిర్వహించినారు. రహస్య పత్రికలు, నేషనల్ ఫ్రంటు, నవశక్తి, స్వతంత్రభారత్, ప్రజాబంధు, వాహిని, ఢంకా పత్రికలు - పంపకం చేసేవారు.

బుక్కపట్నంలో యం.కె.దాసప్ప తన రెవెన్యూ ఉద్యోగానికి రాజీనామా చేసి, పార్టీలోకి వచ్చినారు. అందుకు కృషి చేసినవాడు సదాశివన్. ఆ ఏరియాలో దాసప్ప మంచి కార్యకర్త. పార్టీ అభివృద్ధికి బాగా కృషి చేసినవాడు. ప్రజా సమస్యలకు తక్షణం స్పందించి కార్యక్రమాలకు పూనుకొనేవాడు. కోమట్ల, నిరంకుశ భూస్వాముల, పెత్తందార్ల, పోలీసుల దౌర్జన్యాలను, జన సమీకరణతో తగ్గించినవాడు దాసప్ప. అందువల్ల యం.కె. దాసప్ప అంటే అందరికీ కోపం. బుక్కపట్నంలో ఎస్.ఐ.గా వెంకటేశ్వర్లు వుండేవాడు. ఈయన కోమట్ల బంటు. దాసప్పపై కక్ష కట్టినాడు. ఒక క్రిష్టియన్ లేడీ టీచరును రేప్ చేయబోయినట్లు దాసప్పపై కేసు బనాయించిన తరువాత ఆమెను ఎవరికంట పడకుండా కొన్నాళ్ళుండమని ఆదేశించినారు. ఆమె వూరు వదలిపోయింది. ఆమె భర్త ఉత్త పనికిమాలిన వాడు. తన భార్యను సదాశివన్ వుంచుకొని యెక్కడో దాచినాడని భర్త ప్రచారం మొదలు పెట్టినాడు. అప్పుడు జిల్లా బోర్డు అధ్యక్షులుగా పైడి లక్ష్మయ్య వున్నాడు. రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి బోర్డు అధ్యక్షులతో మాట్లాడి, ఆ టీచరు భర్తను తరిమెలకు బదిలీ చేయించినారు. రాజశేఖరరెడ్డి, వి.కె.

ఆదినారాయణరెడ్డి ఆ టీచరు చెల్లెల్ని కలసి, వాస్తవం తెలియజెప్పి, సహాయపడమని కోరినారు. ఆ చెల్లెలు విషయం అర్థం చేసుకొని సహాయ పడడానికి అంగీకరించింది అక్క గుంతకల్లు కొట్టాలులో వుందని చెప్పింది. వీళ్ళు గుంతకల్లు కొట్టాలకు పోయి, ఆ టీచరుకు నచ్చచెప్పి, ఆమెను పెనుకొండ కోర్టులో మెజిస్ట్రేట్ ముందర హాజరు పరచి కేసు కొట్టేయించినారు. ఆమెను తీసుకొని వచ్చేటప్పుడు రాజశేఖరరెడ్డి, వి.కె ఆదినారాయణ రెడ్డి, రావి వెంగటంపల్లి వెంకటనాయుడు'' ఆమెతో పాటు జట్కాలో కూర్చోవలసి వచ్చింది. "పట్టుబడతా మేమో అని ఓ పక్కా, ఆమె పక్కన కూర్చునట్లు యెవరైనా చూస్తారేమోనని సిగ్గుగా అనిపించింది''. అన్నాడు రాజశేఖరరెడ్డి.

1940లో జిల్లా యువజన సంఘం 'ఆకాశవాణి' అనే సైక్లోస్టైల్ పత్రికను ప్రారంభించింది. దీని ప్రధాన బాధ్యులు సదాశివన్ విద్వాన్ విశ్వం. రాజశేఖరరెడ్డి కొన్ని వ్యాసాలు రాయడంతో పాటు నిర్వహణలో, పంపకంలో సహాయపడినాడు. ప్రొక్యూర్ మెంటుకు, రిక్రూట్‌మెంటుకు, వార్‌ఫండ్ సేకరణకు వ్యతిరేకంగా యువకులను చైతన్య పరచింది ఆకాశవాణి పత్రిక, ఈ పత్రిక కోసం ఎపుడెపుడా అని ఎదురు చూసేవారు. మొత్తం13 సంచికలు వచ్చినాయి అపుడు కలెక్టరుగా భాస్కరరావు వుండేవారు. ఆయన తమిళియన్ ఆయన లంచగొండి తనాన్ని, అక్రమ ధనసంపాదనను తీవ్రంగా, వ్యంగ్యంగా విమర్శిస్తూ "బలెలె భాస్కరన్!'' అనే వ్యాసం వచ్చింది. ప్రభుత్వం సదాశివన్‌ను, జి. రామకృష్ణను, వెంకటనాయుణ్ణి అరెస్టు చేసి శిక్షలు చెప్పింది. రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి కోసం పోలీసులు ప్రయత్నించినారు. కాని కుదరలేదు.

**అరెస్టులు, కేసులు**

ఉత్తరప్రదేశ్ గవర్నమెంటు వారంటుపై రాజశేఖరరెడ్డిని 1941లో అరెస్టు చేసినారు పోలీసులు. రాజస్థాన్‌లోని దేవులికి తీసుకుపోతున్నారు. ఆ సమయంలో దేవులి జైలులో ఖైదీల నిరాహారదీక్ష జరుగుతున్నది. అందువల్ల పోలీసులు రాజశేఖర్‌ను ఆగ్రాలోనే నిలిపినారు. ఆగ్రా జైలులో కాన్పూరు కార్మిక నాయకులు సంతోష్‌కపూర్, కమ్యూనిస్టులు అశోక్‌బోసు, ఓంప్రకాశ్ సంగల్, గోపాల్ నారాయణశెట్టి, విజయ కుమార్ సిన్హా (కకోరికేసు), అజయ్‌ఘోష్ (భగత్‌సింగ్‌అనుయాయి) మాలవ్యా మొదలైన వారున్నారు. కొంతకాలం తరువాత ఆగ్రానుండి రాజమండ్రి జైలుకు మార్చినారు.

మలయాలోను, బర్మాలోను బ్రిటను పొందిన పరాజయం వల్ల బ్రిటీషు గవర్నమెంటు క్రిప్స్‌ను 1942 మార్చిలో రాయబారిగా మనదేశం పంపింది. 1942 జులైలో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం ఎత్తివేసింది గవర్నమెంటు. 1942 ఆగస్టులో విడుదలై వచ్చినాడు రాజశేఖరరెడ్డి. అదే సమయంలో ఆకాశవాణి కేసులో సంవత్సరం

మూడు నెలలు శిక్ష అనుభవించి సదాశివన్‌గారూ విడుదలై వచ్చినారు. ఈ సందర్భంగా పూలకుంటలో బహిరంగసభ ఏర్పాటు అయింది. ఆ సభలో రాజశేఖరరెడ్డి, సదాశివన్ ఇద్దరూ పాల్గొనాలని పార్టీ నిర్ణయించింది. అట్లాగే ఈ యిద్దరు పాల్గొన్నారు. 'ప్రజాయుద్ధం' అనే మాటతో ఉపన్యాసం మొదలు పెట్టినాడు రాజశేఖరరెడ్డి. యుద్ధం అనేమాట వినగానే 'అరెస్టు' అన్నాడు ఎస్.ఐ. రాజశేఖరరెడ్డి, సదాశివన్ ఎంత వివరించినా ఎస్.ఐ. పట్టించుకోలేదు. ఇద్దరి మీదా కేసు నమోదు చేసినాడు. 1942 సెప్టెంబరు 10న అనంతపురం కాలేజి కెమిస్ట్రీ ల్యాబ్‌ను ఎవరో కాల్చినారు. ఎవరు కాల్చింది యింత వరకు అంతు దొరకని రహస్యంగా వుండి పోయింది. లక్షల రూపాయిల నష్టం జరిగింది. ఈ ల్యాబ్ దహనకేసులో కాలేజి విద్యార్థులతో పాటు రాజశేఖరరెడ్డి, సదాశివన్‌లను కూడా యిరికించినారు పోలీసులు. మొత్తం పండ్రెండు మంది ముద్దాయిలు. కేసులో రాజశేఖరరెడ్డిని 24 సంవత్సరాల రైతుగాను, సదాశివన్‌ను హరిజన వర్కరుగాను పేర్కొన్నారు. విచారణ రోజు కోర్టు జనంతో కిటకిట లాడింది. నగరూరి నారాయణరావు, బళ్ళారి రాఘవాచార్యులు ముద్దాయిల తరపున వాదించినారు. బళ్ళారి రాఘవాచార్యులు బళ్ళారి నుంచి ఉత్సాహంగా ఆయనే వచ్చి వాదించినారు. "ఈ కేసు అనంతపురంలో పెద్ద సంచలనం కలిగించింది. పార్టీపై పెద్ద ఇమేజి కలిగించింది. సానుభూతి పెరిగింది'' అన్నాడు రాజశేఖరరెడ్డి. ఈ రెండు కేసుల్లో తిరిగేటప్పుడు, అవకాశం దొరికినప్పుడల్లా కోర్టు బయటా, తాలూకా ఆఫీసు చెట్టుకిందా తమను చూడటానికి వచ్చిన వారికి ఉపన్యాసం యిచ్చేవాడు రాజశేఖరరెడ్డి. "రాజశేఖరరెడ్డి బాగా మాట్లాడినాడు'' అనేవారు విన్నవాళ్ళు.

1940 జులై తరువాత రాయలసీమ జిల్లాలకు పార్టీ సాహిత్యాన్ని ఆయా జిల్లా ప్రతినిధులకు అందజేస్తూ సమన్వయం చేసే పనిని ఏటుకూరి బలరామమూర్తికి అప్పజెప్పింది పార్టీ. ఈ పనిమీద అనంతపురం వచ్చినపుడు ఒకసారి ఆయన రాజశేఖరరెడ్డిని కలుసుకున్నాడు. "రైల్వేలైను ప్రక్కన ఉన్న వారి మేడలో కలుసుకున్నాను. ఆయనను చూడటం అదే మొదలు. బెనారస్ నుండి విద్యాభ్యాసం ముగించుకొని రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి, విద్వాన్‌విశ్వం గారు అప్పుడే వచ్చారు. వారి యింట్లో ఒకపూట భోజనం చేశాను. మధ్యాహ్నం తీయని మామిడి ముక్కలు తింటుండగా, పక్కగదిలో నుండి సంజీవరెడ్డిగారు రావటం, మా యిద్దరిని కొరకొర చూసి వెళ్ళిపోవటం బాగా గుర్తు''- అని బలరామమూర్తి గారు ఒక ఉత్తరంలో నాటి జ్ఞాపకాలను గురించి రాశాడు.

**అనంతపురం జిల్లా ప్రథమ పార్టీ కార్యదర్శిగా ఎన్నిక**

1943 జనవరిలో కమలానగర్‌లోని ఎనుగొండ్ల మంగమ్మ యింట్లో పార్టీ ఆఫీసును ప్రారంభించినారు. రాజశేఖరరెడ్డి,

తరిమెల నాగిరెడ్డి, సదాశివన్, వి.కె. ఆదినారాయణ రెడ్డి, జి. రామకృష్ణలతో ఒక కమిటీ ఏర్పడింది. కమిటీకి రాజశేఖర్‌రెడ్డిని కార్యదర్శిగా ఎన్నుకున్నారు

సి. ముత్యాలప్ప తన ప్రాంతం గ్యాదిగకుంట ఏరియాలో పార్టీ నిర్మాణానికి పూనుకున్నారు. **1944**లో మేడే జరపాలని రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి, సదాశివన్‌లను ఆహ్వానించినారు. వారిని తీసుకొని రావటానికి కనగానపల్లికి బండి పంపినాడు ముత్యాలప్ప. బండితో వచ్చినతను బస్టాండు దగ్గర బండి విడుచుకొని నాయకులకోసం ఎదురు చూస్తున్నాడు. భూస్వాముల ఒత్తిడి మేరకు పోలీసులు బండివాణ్ణి లోపల వేసినారు. తరిమెల నాగిరెడ్డి రాలేదు. రాజశేఖరరెడ్డి, సదాశివన్ బస్సుదిగినారు బస్సుదిగగానే వారికి బండివాని విషయం తెలిసింది. చాలాకోపం వచ్చింది. స్టేషనులోకి దూసుకొని పోయి పోలీసులపై విరుచుకు పడినారు. చట్టాల గురించి నిలదీసినారు అప్పటి పోలీసులకు చట్టాల గురించి దాదాపు ఏమీ తెలీదు. ఐదవ తరగతి వారి చదువు. బొటనవేలు వష్టితం వేసేవారు కూడా వుండేవారని చెప్పారు. సదాశివన్ జిల్లాలో ప్రసిద్ధి పొందిన కమ్యూనిస్టు నాయకులు, గట్టివారు. సరైన సమాధానం చెప్పలేక పోలీసులు బండివాణ్ణి వదలి పెట్టినారు. ఈ సంఘటనతో బాగా జరుగుతుందనుకొన్న మేడే ఉత్సవం బ్రహ్మాండంగా జరిగింది.

**1946**లో ఉరవకొండలో జిల్లా కమ్యూనిస్టు పార్టీ ప్రథమ మహాసభ జరిగింది. కార్యదర్శిగా నీలం రాజశేఖరరెడ్డిని ఎన్నుకొన్నారు.

**1946** ఏప్రిల్‌లో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలు జరిగినాయి. ఈ ఎన్నికల నాటికి పార్టీపైన నిందా ప్రచారం ఉధృతం చేసింది కాంగ్రెసు పార్టీ. అందువల్ల వీటికి సమాధానం రాయవలసిందని పార్టీ రాజశేఖరరెడ్డికి బాధ్యత వప్పజెప్పింది. ఆయన "అనంతపురం జిల్లా కమ్యూనిస్టు పార్టీ చరిత్ర" అనే చిన్న పుస్తకం రాసినాడు. **4-3-1946**న పినాకిని ప్రెస్‌లో ముద్రించి విడుదల చేసింది పార్టీ.

"ఉన్నది దాచి, లేనిది, కల్పించి కమ్యూనిస్టులు అంటే కత్తులు నూరుతున్నారు. కమ్యూనిస్టులను అనని మాటలు లేవు. దేశద్రోహులన్నారు, రౌడీలన్నారు, మోసగాళ్ళన్నారు, పచ్చి పోకిరీలన్నారు, కమ్యూనిస్టు పార్టీ అత్యాచారాలవల్ల పాడైపోని ఏ పవిత్ర వస్తువూ లేదన్నారు'' అంటూ ప్రారంభించి **1930** నుండి **1946** వరకు కాంగ్రెసులో వున్నప్పుడూ, కాంగ్రెసునుండి బయటికి వచ్చి కమ్యూనిస్టులు నిర్వహించిన బాధ్యతలను సవివరంగా రాసినారు. కాంగ్రెసువారి వాదనలను గాంధీ, నెహ్రూల ఉటంకింపులతోనే తిప్పి కొట్టినారు. సత్తా లేనివిగా నిరూపించినారు. విద్యార్థులను, రైతులను సంఘాలలోకి

సమీకరించి దేశ స్వాతంత్ర్యం కోసమే కాక జిల్లా అభివృద్ధికై సాగునీటి ప్రాజెక్టు కోసం, గిట్టుబాటు ధరలకోసం, ఘోరమైన కరువు కాలంలో రిలీఫ్ క్యాంపులలో బీద సాదలకు వ్యతిరేకంగా పార్టీ ఎట్లా పోరాడిందో వివరించినాడు. ప్రజాసేవ పునాదిగా పార్టీ ఎట్లా అభివృద్ధి అయిందీ వివరించినాడు. ఈ విధంగా వచ్చిన ఆరోపణలను సునాయాసంగా, సమర్ధవంతంగా తిప్పికొట్టినాడు. స్వతంత్ర భారత్‌లో, రాష్ట్రాల స్వపరిపాలన కోసం సుఖ సంపద లతో కళకళలాడే పట్టణాలకోసం అందరూ చేతులు కలిపి పోరాటంలో పాల్గొనమని ఆహ్వానించినాడు.

1946లో పరిమిత ఓటింగు పద్ధతిలో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థి అయిన సంజీవరెడ్డిపై తరిమెల నాగిరెడ్డిని పోటీ పెట్టింది పార్టీ. ప్రచారం కోసం తొమ్మిది వందలు పెట్టి ఒక కారు కొన్నారు రాజశేఖరరెడ్డి. సంజీవరెడ్డి గెలిచారు. పార్టీ అభ్యర్థికి డిపాజిట్టు రాలేదు.

1947 ప్రజారక్షణ ఆర్డినెన్సు క్రింద కమ్యూనిస్టు నాయకులను అరెస్టు చేశారు. ఆ సమయంలో రాజశేఖరరెడ్డిని అరెస్టు చేసి వెల్లూరు జైలులో పెట్టినారు. అక్కడ నంబూద్రిపాద్, ఎ.కె.గోపాలన్, ఎన్.కె. కృష్ణన్, తరిమెల నాగిరెడ్డి, సదాశివన్ మొదలగు వారున్నారు, ఆ జైలులో మూడు వందలకు పైగా తెలుగువారున్నారు. జైలులో 12 అణాలు (దాదాపు 75 పైసలు) అలవెన్సు యిచ్చేవారు. జైలులో టెన్నీసు, హాకీ ఆడేవారు. రాజశేఖరరెడ్డి మంచి హాకీ ప్లేయరు. జైలులో నిత్యమూ తరగతులు జరిగేవి. రాజశేఖరరెడ్డి తెలుగులో తరగతులు తీసుకునేవారు. ఎక్కడున్నా డ్రిల్లు, ఆహారం యిన్‌చార్జి సదాశివన్ గారిదే. 8 నెలలు వెల్లూరు జైలులో వున్నారు.

1948లో కలకత్తాలో పార్టీ కాంగ్రెస్ జరిగింది. పి.సి. జోషి స్థానంలో బి.టి.రణదివే పార్టీ కార్యదర్శిగా ఎన్నికైనాడు. ఇండియాకు స్వాతంత్ర్యం రాలేదనే తీర్మానంతో పాటు సాయుధ పోరాటాన్ని ఆమోదించింది ఆ మహాసభ. ఈ కాన్ఫరెన్సుకు రాజశేఖరరెడ్డి పోలేదు. తీర్మానాలను బట్టి రాబోయే పరిణామం ఊహించి ముఖ్యులంతా అజ్ఞాతం లోకి వెళ్ళినారు. ఈ అజ్ఞాతవాస కాలంలో రాజశేఖరరెడ్డి లోచర్లలో పెదపల్లి చిదంబరరెడ్డి (కాంగ్రెసు నాయకులు) యింట్లోనూ, కళ్యాణదుర్గంలో భంగి యెర్రిస్వామి యింట్లో వున్నాడు. ఉరవ కొండలోనూ వున్నాడు. జిల్లా బయట ఆదోనిలో లింగన్నబావి వీధిలో రహస్యస్థావరం వుండేది. అక్కడ రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి, తూమాటి దొణప్ప వుండేవారు. వీరికి తోడ్పటానికి అపుడపుడు బి. పార్వతమ్మ పోయి వస్తుండేది. అటు తర్వాత రాజశేఖరరెడ్డి రహస్య స్థావరం మద్రాసుకు మారింది. మద్రాసులోని పరశువాకం డెన్నులో రాజశేఖరరెడ్డి, కంభంపాటి సీనియర్ కలసి వున్నారు.

**హృదయాన్ని కలచివేసిన ఒక దుస్సంఘటన**

1951 మే 18 సాయంకాలం ఏడుగంటలకు రాజశేఖరరెడ్డి తన స్థావరం నుండి చంగల్పట్టులో వున్న డెన్నుకు పోతున్నాడు. ఎస్.డబ్ల్యూ. నరసయ్య, డి. రామకృష్ణ యీ డెన్నులో వున్నారు. డెన్నుతో సంబంధం వున్న కొరియర్ ఆరోగ్యస్వామి (ఇతనిది గుంతకల్లు. ఇతన్ని ఆచా అనిఅంటారు) ఆ దినమే పోలీసులకు చిక్కిన విషయమూ, చంగల్పట్టి డెన్ను పోలీసుల వశమైన విషయమూ రాజశేఖరరెడ్డికి తెలీదు. రాజశేఖరరెడ్డి ఆ ప్రాంతాన్ని సమీపించగానే ఆరోగ్యస్వామి అన్న మాన్యుయల్ వచ్చినాడు. చెంగల్పట్టు డెన్ను, పరశువాకం డెన్నూ పోలీసులకు తెలిసిందనీ, అందుచేత రాజశేఖర్‌రెడ్డిని రక్షించడానికి తాను కాచుకొని వున్నట్లు చెప్పినాడు. ఆ విషయం చెబుతూ ఇండ్లకు దూరంగా వున్న మైదాన ప్రాంతానికి తీసుకొని వచ్చినాడు. ప్లాను ప్రకారం అక్కడ కాచుకొని వున్న యిద్దరు సి.ఐ.డి. లూ, మాన్యుయల్ అకస్మాత్తుగా రాజశేఖరరెడ్డి మీదపడి, గప్‌చిప్‌గా ఎత్తుకొని పోవడానికి ప్రయత్నించినారు. వారితో ఎంత పెనుగులాడినా, తప్పించుక పోవడానికి సాధ్యం కాక, పెద్దగా కేకలు వేసినాడు. ఆ కేకలు విని కొంత దూరంలో వున్న ఇండ్ల నుండి జనం పరుగెత్తుకొని వచ్చినారు. "నేను ఆంధ్ర కమ్యూనిస్టును, ఈ సి.ఐ.డి.లు నన్ను కాల్చివేయడానికి రహస్యంగా ఎత్తుకొని పోతున్నారు. కాపాడండి'' అని అపీలు చేసినాడు ప్రజలు సి.ఐ.డి లను పట్టుకొని చావబాదినారు, అపుడు సమయం చూసుకొని రాజశేఖరరెడ్డి అక్కడి నుండి తప్పించుకున్నాడు. ఆ పెనుగులాటలో ఆయన ధోవతి వూడిపోయింది చొక్కా, బనియన్లు పీలికలు అయినాయి. డ్రాయరు మాత్రం మిగిలింది. ఈ స్థితిలో సరీ రోడ్డు మీదికి వెళ్ళడానికి సాధ్యంకాక కొంతదూరం నిర్జనమైన చేలలో నడచినాడు. ఆ తరువాత అడ్డం వచ్చిన రోడ్డెక్కి నడుస్తున్నాడు. ఆ సమయంలో అటుగా బస్సు వచ్చింది. బస్సులో వున్న సబ్ ఇన్స్‌పెక్టరు ఈయన వేషాన్ని చూసి, అనుమానించి, బస్సు ఆపి, బస్సెక్కించినాడు. స్టేషనుకు తీసుకవెళ్ళి లాకప్‌లో వుంచినాడు. పోలీసులు ఎంత ప్రయత్నించినా సరైనా సమాధానం చెప్పలేదు. ఎంక్వైరీ ద్వారా పోలీసులు ఆయన చెప్పిన విషయాలు సరైనవి కావని తెల్సుకున్నారు. అయితే ఒక ప్రమాదం పొంచి వున్నది. కొద్ది రోజుల లోపల కేంద్ర, రాష్ట్ర ప్రముఖుల సమావేశం మద్రాసులో జరగ బోతున్నది. ఈ సమావేశ సంధానకర్త రాజశేఖరరెడ్డి. ఈయన అరెస్టు అయిన విషయం వారికి ఏదో రూపంలో తెలియకపోతే వారందరూ పట్టుబడే అవకాశాలున్నాయి.

అందువల్ల ఏ విధంగా నైనా కేంద్ర నాయకులను మద్రాసుకు రాకుండా, అరెస్టు నుండి వారిని తప్పించడానికి తాను పార్టీకి రాజీనామా యిస్తున్నట్లు పత్రికల్లో ప్రకటిస్తే తప్ప సాధ్యం కాదని భావించి ఆ విధంగా రాజీనామా ప్రకటించాడు. ఇది **24.5.51**న

ఆంధ్రప్రభలో వచ్చింది. ఈ ప్రకటన తీవ్రమైన మనస్తాపాలకు, అపార్థాలకు దారి తీసింది. ఈ ప్రకటనను అపార్థం చేసుకున్న అనంతపురం జిల్లా కమిటి రాజశేఖర్‌ను పార్టీ నుండి బహిష్కరించి శాఖల వరకు తెలియజేసింది. అయితే ఏ పరిస్థితుల్లో రాజశేఖరరెడ్డి ఆ విధంగా చేయవలసివచ్చిందో వివరిస్తూ ఏ.కె. గోపాలన్, తాపీ మోహనరావు ఒక మనిషి ద్వారా జిల్లా కమిటీకి వర్తమానం పంపారు. దానితో కథ మరో మలుపు తిరిగింది. గ్రహణం తొలగిపోయి తిరస్కరించిన వారి చేతనే మరలా ఉన్నత స్థానానికి ఎన్నుకోబడినారు.

1952 ప్రథమ సార్వత్రిక ఎన్నికలలో మరోమారు సంజీవరెడ్డిపై తరిమెల నాగిరెడ్డిని నిలిపింది పార్టీ. నాగిరెడ్డి అపుడు కడలూరు జైలులో వున్నాడు. బిట్రగుంట రామచంద్రరావును (తాడిపత్రి తాలూకా సి.పి.ఐ. కార్యదర్శి) పంపి, నాగిరెడ్డి సంతకం తెప్పించినారు. ఆరువేలకు ఒకకారు కొన్నాడు రాజశేఖరరెడ్డి. ధరల పెరుగుదలకు, అవినీతికి, వాగ్దాన భంగానికి వ్యతిరేకంగా ప్రజలు చైతన్యవంతులై కమ్యూనిస్టు పార్టీవైపు మొగ్గినారు. కాంగ్రెసు తరపున నెహ్రూ ప్రచారానికి వచ్చినాడు. ఆయనకు కొన్ని ప్రశ్నలు వేస్తూ, కరపత్రం వేసింది పార్టీ. వాటికి నెహ్రూ సరైన సమాధానం చెప్పలేక పోయినాడు. నాగిరెడ్డి 13వేల మెజారిటీతో ఎన్నికైనాడు. కౌంటింగ్ మధ్యలోనే సంజీవరెడ్డి లేచి వెళ్ళి పోయినాడు.

**దుందుడుకు విధానానికి వ్యతిరేకం**

1953లో బళ్ళారి జిల్లాను ఆంధ్రలో చేర్చాలనే ఉద్యమం మొదలైంది. బళ్ళారి, రూపనగుడి, మోక తాలూకాలు ఆంధ్రలో చేర్చాలనేది కమ్యూనిస్టు పార్టీ వైఖరి. కోర్కెల సాధనకు కామిరెడ్డి అనే ఆయన ఉపవాస దీక్షకు కూర్చున్నారు. ఇరవై రోజులు జరిగినా ప్రభుత్వంలో చలనం లేదు. ఉద్యమానికి నాయకత్వం వహించిన ఆంధ్రసమితి ఆ తరువాత అరాచక దుందుడుకు వైఖరి తీసుకున్నది. బళ్ళారి, రూపనగుడి, మోక తాలూకాలే కాకుండా హోస్పేట వరకు ఆంధ్రలో కలపాలని, మోకలో జరిగిన ఆంధ్ర కాన్ఫరెన్సులో పైడి లక్ష్మయ్య చెప్పినాడు. దానికి కమ్యూనిస్టు పార్టీ ఒప్పుకోలేదు. ఈ పోకడలు చూసి, సమస్య సాధన దిశగా ఉద్యమం లేదని ఉపవాస దీక్ష విరమింప చేయాలని రాజశేఖరరెడ్డి, సదాశివన్ బళ్ళారికి పోయినారు. బళ్ళారిలో ఈ సమస్యపై ఎపుడు సభ జరిగినా వేలాది జనంతో బ్రహ్మాండమైన ఊరేగింపు జరిగేది. ఆ జనాన్ని చూసి విరమించే విషయం చెప్పలేక పోయినారు.

చివరకు ఏదో ఒక విధ్వంస కార్యక్రమం ద్వారా ప్రభుత్వంపై తీవ్రమైన వత్తిడి తీసుకురావాలని ఉద్యమకారులు తలంచినారు. వంతెనలు పడగొట్టాలని నిర్ణయించి, ధైర్యం చాలక, చివరి దశలో మానుకున్నారు. తక్కువ నష్టంతో ఎక్కువ లాభం

పొందడానికి నిర్ణయించినారు ఉపవాసం చేస్తున్న కామిరెడ్డిని యింజక్షన్ యిచ్చి చంపి, దాని ద్వారా అలజడి సృష్టించాలని నిర్ణయించినారు. ఈ పథకాన్ని ఉపవాస దీక్ష శిబిరంలోనే పన్నినారు. దీక్షకు కూర్చున్న కామిరెడ్డి అపస్మారక స్థితిలో వున్నాడు. ఆయన మాటలు వినలేని స్థితిలో వున్నాడనుకొని ఆయన దగ్గర కూర్చునే మాట్లాడుకున్నారు. మగతగా వున్నప్పటికీ కామిరెడ్డి ఈ మాటలు విని కామ్రేడ్ టి రంగన్నకు చెప్పినాడు. రంగన్న అప్పుడు పార్టీ సానుభూతి పరుడుగా, విద్యార్థి నాయకుడుగా వుంటూ, ఈ ఉద్యమంలో చురుకుగా పాల్గొంటున్న కార్యకర్త. రంగన్న సమయస్ఫూర్తితో వ్యవహరించినాడు. నల్లషర్టు, నల్లనిక్కరు ధరించిన వాలంటీర్లను రాత్రంతా చుట్టూ కాపలా వుంచి రాజశేఖరరెడ్డిని కలసినాడు. రాజశేఖరరెడ్డి ఆలోచించి కడప కోటిరెడ్డిని రప్పించి, ఆయన చేత దీక్ష విరమింప జేసినాడు.

**చరిత్రాత్మకమైన కర్నూలు ఆకలియాత్ర**

1954 మార్చి 24న రాజధాని కర్నూలుకు రైతుకూలి యాత్ర నిర్వహించింది కమ్యూనిస్టు పార్టీ. దీన్నే జిల్లా వాసులు 'ఆకలి యాత్ర' 'కరువుయాత్ర' అంటారు. అనంతపురం జిల్లా నుంచి పెద్ద సంఖ్యలో రెండు వేల మందికి పైగా పాల్గొన్నారు. కళ్యాణదుర్గం తాలూకా నుండి పెద్ద సంఖ్యలో 500 మంది పాల్గొన్నారు. జిల్లా దాటి యాత్ర నడపడం జిల్లా పార్టీకి అదే మొదలు. చాలా తిప్పలు పడినారు వందల మైళ్ళు ఎర్రటి ఎండలో నడచినారు. చెప్పులు కూడా లేనివాళ్ళు చాలామంది. అయినా ఆ బాధను తీయగా, ఉల్లాసంగా, ఉత్సాహంగా అనుభవించినారు. ప్రజల హితం కోసం కష్టాలు అనుభవించినామన్న గర్వాతిశయమూ కలిగింది పార్టీకి.

జిల్లా నుండి జనం గ్రూపులుగా బయలుదేరినారు. వాహనంలో పోతే ఒకరోజు పట్టే ప్రయాణానికి ఎనిమిది, పది రోజులు పట్టింది. ప్రతిపక్ష నాయకుడు కాబట్టి తరిమెల నాగిరెడ్డి ముందుగా రాజధాని కర్నూలుకు పోయినారు. నీలం రాజశేఖరరెడ్డి, ఐదుకల్లు సదాశివన్, వి.కె. ఆదినారాయణరెడ్డి జనం వెంబడి వున్నారు. గుంతకల్లు వరకు ప్రయాణం బాగానే సాగింది. భుజం మీద సద్దిమూట వుండి చేతులు అడ్డు పెట్టి, ఎద్దులబండి మాదిరి ఎద్దులు లేని బండిని ఆపినాముని జనం గొప్పగా చెప్పుకున్నారు. చేతిలో ఎర్రజండా వుంటే రైలు అవస్థ చెప్పే పనిలేదు. అధికారులు రైలును గుంతకల్లులో ఆపినారు. రైలు దిగాలని రిజర్వ్‌డ్ డి.వై.ఎస్.పి. చెప్పినాడు. తలుపులు వేసుకొని రైలులోపలే వుండి పొమ్మన్నాడు రాజశేఖరరెడ్డి. పోలీసులు ఇంజన్ను తొలగించినారు. ఆ తరువాత చర్చలు జరిగినాయి. ఆరువందల టికెట్లు తీసుకోమన్నారు. రెండు వందలు తీసుకుంటానన్నాడు రాజశేఖరరెడ్డి. ఆ డబ్బులు

కూడా నగదు లేదని, బాండు రాయించినాడు రాజశేఖరరెడ్డి. రైలు కదిలింది. కర్నూలుకు మూడు మైళ్ళ దూరంలో చింతతోపు దగ్గర బ్రహ్మాండమైన సభ జరిగింది. ముఖ్యమంత్రి ప్రకాశం పంతులుకు కమ్యూనిస్టు పార్టీ మెమొరాండం సమర్పించింది. ప్రకాశం పంతులు హామీ యిచ్చినాడు. "చాలా కష్టపడి వచ్చినారు అని హేళన చేసినాడు సంజీవరెడ్డి" అన్నాడు రాజశేఖరరెడ్డి.

తిరిగి వచ్చేటప్పుడు జనం రైల్లో కొంతదూరం, గూడ్సులో కొంతదూరం, నడచి, నడచి చాలాదూరం ప్రయాణం సాగించాడు. ప్రభుత్వం రైళ్ళు రద్దు చేసింది. జనంతో పాటే రాజశేఖరరెడ్డి, సదాశివన్, వి.కె. ఆదినారాయణరెడ్డి నడచినారు. ఒకూర్లో జొన్నలు కొని అప్పటికప్పుడు విసరి ముద్దలు చేసికొని తిన్నారు. జనంతో పాటు సదాశివన్ విసరినాడు. కొన్ని చోట్ల ప్రజలు కొర్రన్నం, చింతతొక్కు, గట్టి పెరుగుతో ఆతిథ్యం యిచ్చినారు. ఎట్లాగో అవస్థలు పడి గుంతకల్లు చేరుకున్నారు. అక్కడ రైల్వే వర్కర్ల యూనియన్ పార్టీ నాయకత్వం క్రింద వుంది. యూనియన్ సభ్యులు జనానికి ఆతిథ్యం యివ్వడానికి కాచుకొని వున్నారు. జనాల్ని కార్మికుల యిండ్లకు పంచినారు. వర్కర్లు పోటీలు పడి విందు భోజనాలు పెట్టినారు. అక్కడి నుంచి నడుచుకుంటూ వూర్లకు చేరుకున్నారు జనం. ఈ ప్రదర్శన అనంతరం శివాయిజమా భూ పంపక ప్రకటన చేసింది ప్రభుత్వం.

**ముదిగుబ్బ బహిరంగ సభలో ఫ్యూడలిస్టులకు హెచ్చరిక**

పాముదుర్తి, దొరిగిల్లు రెడ్లు జిల్లాలోనే పెద్ద దౌర్జన్య పరులు. ప్రజానీకంపై వీరు, వీరి అనుచరులు చేయని దోపిడీ, పీడనా అత్యాచారాలూ కిరాతకాలూ ఏవీ లేవు. జన సమీకరణ చేసి, పోరాటాలు నిర్వహించి, వీరి గుప్పెట్లో నలుగుతున్న గ్రామాలకు విముక్తి కలిగించింది పార్టీ. ఈ పోరాటానికి నాయకత్వం వహించింది ఐదుకల్లు సదాశివన్. ఒకసారి దొరిగల్లు రంగారెడ్డికి వ్యతిరేకంగా ముదిగుబ్బలో బహిరంగసభ ఏర్పాటు చేసింది తాలూకా పార్టీ. జిల్లా పార్టీ నాయకునిగా రాజశేఖరరెడ్డి హాజరైనాడు. ఆ సభ గురించి రాజశేఖరరెడ్డి యిట్లా చెప్పినాడు- "వేలాదిగా జనం వచ్చినారు. పార్టీ వారితో మాట్లాడడమే నేరంగా భావించే ఆ దశలో రెడ్ల ఆంక్షలు ధిక్కరించి జనం రావడం గొప్ప విశేషం. ఉత్తేజ భరితం. ఇంకో విశేషం ఆడవాళ్ళు పెద్ద సంఖ్యలో రావటం. చుట్టుపక్కల శాఖల నుండి పార్టీ కార్యకర్తలు దాడిని ఎదుర్కోవటానికి సిద్ధంగా బాణాకట్టెలతో వచ్చినారు. పోలీసులూ పెద్ద సంఖ్యలో వచ్చినారు. సభను భగ్నం చేయాలని వచ్చిన రెడ్డి అనుచరులు ఆ జన సమూహాన్ని చూసి వెనుకంజ వేసినారు. అయినా ఆక్రోశం పట్టలేక, చీకటి పడగానే రాళ్ళు విసిరినారు. అప్పుడు రాజశేఖరరెడ్డి మాట్లాడుతున్నాడు. "ఎక్కడి నుండి రాళ్ళు పడినాయో, ఈ

రాత్రి సమయంలో కనిపెట్టలేం కాని, అవి వేయిస్తున్న దెవ్వరో తెలుసు. దాన్ని ఎట్లా ఆపాలో కూడా కమ్యూనిస్టు పార్టీకి తెలుసు" అన్నాడు రాజశేఖరరెడ్డి. ఆ మాట అనేటప్పటికి గొడవ సద్దు మణిగింది.

ఒకసారి సంజీవరెడ్డితో పాటు రెవెన్యూమంత్రి కళా వెంకటరావు జిల్లా పర్యటనకు వచ్చినారు. రైతు సంఘం తరపున సి. ముత్యాలప్ప మెమొరాండం యిచ్చినాడు "యిగో! రైతు నాయకులు వచ్చినారు. జొన్నలియ్యండి, పారలు తియ్యండి". అని సంజీవరెడ్డి ఎగతాళి చేసినాడు. వెంటనే రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి కలసి "వినదగు నెవ్వరు చెప్పిన" అని కరపత్రం వేసినారు.

**సదాశివన్ పట్ల గురుతుల్యమైన గౌరవం**

నీలం రాజశేఖరరెడ్డికి ఐదుకల్లు సదాశివన్ అంటే చాలా గౌరవం, ఆత్మీయత, ఆప్యాయత, చనువు వున్నాయి. సదాశివన్ వ్యక్తిగత విషయాలలో కూడా సహాయకునిగా, స్నేహితునిగా వున్నాడు రాజశేఖరరెడ్డి. వ్యక్తిగత విషయాలలో ఒత్తిడి చేయగల స్వేచ్ఛ, చనువు రాజశేఖరరెడ్డికి వున్నాయి. సదాశివన్, రాజమ్మల పెండ్లి కుదిర్చింది రాజశేఖరరెడ్డి. సదాశివన్ గురించి రాజశేఖరరెడ్డి యిట్ల చెప్పినాడు- "తరిమెల నాగిరెడ్డి టూర్లకు పరిమితము. గ్రౌండు వర్క్ లేదు, గ్రౌండు వర్కు అంతా సదాశివానిదే. అసలు మేము గ్రామాల గురించి సదాశివన్ ద్వారానే తెలుసుకున్నాము ప్రజలలో పని చేయాలంటే మనకు ఎటువంటి నమ్రత వుండాలో, ఎటువంటి వైఖరి వుండాలో అనే విషయంలో ఆయన నాకు గురువుగా పనిచేసినారు. సదాశివన్ ప్రజానాయుకుడు. క్రమశిక్షణకు మారుపేరు. గాంధీ పద్ధతులు కలవాడు. అంకితభావం కలవాడు. త్యాగానికి మారుపేరు. సదాశివన్ తనకు ఎంతో యితర్లకూ అంతే. సదాశివన్, రాజమ్మలది ఆదర్శవంతమైన దాంపత్యం. రాజమ్మ ఎంత మైల్డ్ లేడీనో, సదాశివన్ అంత రెట్టమతం, మహా మొండి!"

**ఇంద్రధనుస్సు లాంటి విశిష్ట వ్యక్తిత్వం**

రాజశేఖరరెడ్డి ఖచ్చితమైన సమయ పాలన చేస్తాడు. నిర్ణయించిన టైంకు ఖచ్చితంగా సమావేశం కావాలి. అట్ల లేకపోతే ఆయన వాపసు పోతాడు. అట్ల రెండు అనుభవాలు జరిగినంక రాజశేఖరరెడ్డి మీటింగు అంటే ఖచ్చితంగా టైంకు ప్రారంభిస్తారు అనంతపురం కామ్రేడ్స్.

రాజశేఖరరెడ్డికి సంగీతం అంటే చాలా యిష్టం. సదాశివన్‌కూ అంతే. అనంతపురంలో త్యాగరాజ ఉత్సవాలు కానీ, యితర కర్ణాటక సంగీత కచేరిలు గానీ జరిగితే హాజరయ్యే మొదటి శ్రోతలు వీరే.

అంతర్జాతీయ సమస్యగానీ, జాతీయ సమస్యగానీ, రాష్ట్ర సమస్యగానీ ఏదైనా

గానీ అది ఎంత క్లిష్టమైనదైనా సరే చాలా సరళంగా, చదువురాని వారికి కూడా అర్థం అయ్యే విధంగా వివరించగల గొప్ప మేధావి రాజశేఖరరెడ్డి. ఉభయ కమ్యూనిస్టు పార్టీలు తొలిసారిగా విజయవాడ నగర పాలనాధికారానికి ఎన్నికైనారు. ఆ సమయంలోనే విశాఖలో బి.జె.పి. అధికారంలోకి వచ్చింది. ఆ సమయంలో జరిగిన అనంతపురం జిల్లా సమితి సమావేశంలో రాజకీయ రిపోర్టు యిస్తూ "మార్గం స్పష్టం. మనం (ఉభయ కమ్యూనిస్టు పార్టీలు) కలిస్తే విజయవాడ లేకుంటే విశాఖ" అన్నారు. ఆయన భావ ప్రకటన దాపరికం లేకుండా సూటిగా, స్పష్టంగా వుంటుంది. అందుకే రాజశేఖరరెడ్డి గురించి అడిగితే ఎవరైనా చెప్పే మొదటి వాక్యం "ఆయన మంచి టీచర్" అని.

రాజశేఖరరెడ్డి అనంతపురం జిల్లా పార్టీ కార్యదర్శిగా వున్నప్పుడు, పార్టీ శైశవదశలో వుంది. అటువంటి దశలోనే పార్టీ అనేక ఆటుపోట్లకు గురయింది. భూస్వాముల, పెత్తందార్ల దౌర్జన్యాలు, పోలీసుల జులుం, అజ్ఞాత వాసం, జైళ్ళు- వీటిని తట్టుకొని విప్లవ పార్టీగా, ఉక్కు క్రమశిక్షణగల పార్టీగా మంచి పునాదిగల పార్టీగా నిర్మాణం చేయవలసిన కర్తవ్యం ఆయన ముందున్నది. వీరు నలుగురు నాయకులు వీరి వెనక వున్నది. 'వుడ్డా' ముగ్గురు సభ్యులు, లక్షల జనాభాలో వీరి శాతం ఎంత? కాని, వీరి ప్రభావం లక్షల ప్రజలందరి మీదా పడింది. అంతబలం సంపాదించటానికి కారణం రాజశేఖరరెడ్డి యిట్లా రాసినాడు- "కమ్యూనిస్టుపార్టీ అభివృద్ధి కావాలంటే పాలసీకి, పంథాకు, పనికీ ప్రజలే పునాదులు కావాలి. ప్రజాసేవ, ప్రజలకు చేదోడు వాదోడుగా పాటుపడటంలో వుంది పార్టీ బలం".

ప్రతి కార్యకర్తకూ అతని శక్తి సామర్థ్యాలు గుర్తించి పని యివ్వాలనీ, అత్యవసర పరిస్థితులలో తప్ప సభ్యులు తమ వృత్తులు చేసుకుంటూ పార్టీ కార్యకలాపాలలో పాల్గొనే విధంగా పని యివ్వాలేకాని, జీవనాధారమైన పనులు మానుకొని, పార్టీపని చేయమని పోరుపెట్టడం తప్పని చెప్పినారు రాజశేఖరరెడ్డి. పార్టీ క్రమశిక్షణను కార్యకర్త ఉల్లంఘించడం తీవ్రమైన తప్పిదంగా భావించేవారు. ఒంటెత్తు పోకడలు, అన్యవర్గ ధోరణులు, క్రమశిక్షణా రాహిత్యమూ తొలగించడానికి సభ్యులలో విమర్శ-ఆత్మవిమర్శ ప్రోత్సహించినారు. సజీవమైన, శక్తివంతమైన పార్టీకి ఆత్మ విమర్శ ప్రాణప్రదమైనది. అరాచక ధోరణులు, ఒంటెత్తు పోకడలు, ఆయనకు గిట్టవు. ఒకసారి కళ్యాణదుర్గం ఏరియాలో పెత్తందార్లను తగ్గించడానికి, వారిని ఆర్థికంగా దెబ్బతీయటానికి, వారి తోటలు ధ్వంసం చేయాలనీ, యింజన్లు పగలగొట్టాలని కొందరు కార్యకర్తలు నిర్ణయించినారు. అది సరైనది కాదని అనేక కోణాల నుండి వివరిస్తూ గంటసేపు బోధించినారు రాజశేఖర్‌రెడ్డి, సదాశివన్. కార్యకర్తలు సిద్ధాంత రాజకీయ వ్యవహార జ్ఞానం సంపాదించుకోవటానికి కేవలం నాయకులిచ్చే రాజకీయ రిపోర్టులే గాక,

స్వంతంగా సిద్ధాంత, రాజకీయ గ్రంధాల అధ్యయనం చేసేటట్లు ప్రోత్సహించినారు. స్వీయ అధ్యయనానికి ఆయన ప్రత్యేక శ్రద్ధ కనబరచినారు. ప్రతి సర్క్యులర్‌లోను ఈ అంశం ప్రస్తావించినారు. గ్రామాల్లో స్టడీ సెంటర్లు, గ్రంధాలయాలు ఏర్పాటు చేయడం, రాత్రి పాఠశాలలు ఏర్పాటు, చదువు వచ్చిన ప్రతివొక్కరు మరొకరికి చదువు నేర్పాలి, అనే విషయాలను ప్రతి సర్క్యులర్‌లోను ప్రస్తావించినారు. సాహిత్య అధ్యయన విషయం చూడటానికే ప్రత్యేకంగా ఒక కామ్రేడును కేటాయించాలని కమిటీ ముందు ప్రతిపాదించినారు. పాతవారి అనుభవం, కొత్తవారి ఉత్సాహం జోడించడం వల్లనే కమిటీలకు బలం చేకూరుతుంది ఆ కమిటీలు ఒక ప్లాను ప్రకారం అంటే ఎప్పుడు, ఏ ప్రాంతంలో, ఏ సమస్యపై కేంద్రీకరించి పనిచేయాలో నిర్ణయించుకోవాలనీ సూచించినారు.

ఇటువంటి మహనీయులు తమ కొచ్చిన జబ్బులకన్నా ఎన్నో రెట్లుగా సమాజానికొచ్చిన జబ్బుల గురించే బాధ పడతారు. గుట్టలుగా పెరుగుతున్న క్రమశిక్షణా రాహిత్యమూ, స్వార్థమూ, అవినీతి వంటివానితో పాప పంకిలం అయిన రాజకీయం, ఏకం కాని కమ్యూనిస్టు బలం, యిన్నాళ్ళు గడచినా కడుపునిండా తిండి అనేది పేదవానికి స్వప్నంగానే వుండటం, ఆయనకు తీవ్రమైన మానసిక ఆవేదనను కలిగించినాయి. అయినా శాంతి, సుఖమయ జీవితం ధరిత్రి నిండా వెల్లి విరుస్తుందని, సర్వతోముఖ వికాసం చెందిన మానవుడు రూపొందుతాడనే ధృఢమైన ఆశ ఆయనతో మాట్లాడిన, ప్రతి సందర్భంలో ఆయనలో నాకు కనబడింది.

**ఒక్క నిరుపేద వున్నంత వరకు**
**ఒక్క మలినాశ్రు బిందు దొరిలినంత వరకు**
**ఒక్క ప్రేగు ఆకలి కనలినంత వరకు**
**ఒక్క శుష్క స్తన్య సన్నిధిని**
**క్షుధార్తి నేడ్చు పసిపాప ఉన్నంతవరకు**
**నాకుశాంతి కలగదింక నేస్తం**
**నేను నిగర్వినైనాను**
**ఈ సిగ్గు లేని ముఖాన్ని చూపించలేను**

**- తిలక్**



# అతని మతము

విద్య నెరగని కర్మ గుడ్డిది కర్మనెరుగని విద్య గొడ్డుది
కర్మ విద్యలు కలిసినపుడే కార్యమీడేరు
నవయుగావిష్కరణ కోసం నడుము కట్టిన యువజనావళి
చదువు కోసం కాలమంతా కలవరించాడు
బుద్ధి జీవికి విశేషణములు అద్దకుండా గౌరవిస్తూ
పనుల ఫలితం పొంద జూచుట అతని కలవాటు
సోషలిస్టుల దేశమే ఒక స్వర్గ భూమని ఎంచుకుంటే
మాతృదేశం అంతకన్నా మంచిదంటాడు
తనకు రాగల కష్టనష్టాలెంచి ఎరగడు మచ్చుకైనా
పరుల మేలుకు పాటుపడుటే ఆతనికి మతము
తెలుగు కమ్యూనిస్టు నేతలకందరికి అభినందనీయుడు
అతడు నీలం రాజశేఖరరెడ్డి కామ్రేడు

- రాంభట్ల కృష్ణమూర్తి

# మార్క్సిస్టు సిద్ధాంత నిబద్ధతకు నిలబడి కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తల అభివృద్ధికి

# నిరంతరం కృషి చేసిన ప్రముఖుడు కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డి



వై.వి. కృష్ణారావు

మానవ జీవితం ఉత్కృష్టమైనది. మానవసేవే మాధవసేవ అన్నారు పెద్దలు. మానవసేవకు అంకితమైనపుడే జీవితం సార్థకమవుతుంది. లేనిచో అది అడవిగాచిన వెన్నెలలాగా నిరర్థకమవుతుంది. కామ్రేడ్ రాజశేఖరరెడ్డి త్యాగధనుడు, ధన్యజీవి.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు. తాను నమ్మిన మార్క్సిస్టు సిద్ధాంతాల కోసం, సోషలిస్టు సమసమాజ స్థాపనకోసం, దీనజన సముద్ధరణ కోసం, దేశాభివృద్ధికోసం జీవితాంతం పోరాడిన కమ్యూనిస్టు యోధ.

1918లో అనంతపురం జిల్లా ఇల్లూరు లో దేశభక్తిగల భూస్వామ్య కుటుంబంలో జన్మించిన కామ్రేడ్ రాజశేఖరరెడ్డి బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా వున్నప్పుడే విప్లవకారుల సహచర్యంతో సోషలిస్టు సిద్ధాంతం వైపు ఆకర్షించబడి 1938లో భారత కమ్యూనిస్టు పార్టీలో చేరటం జరిగింది. రెండవ ప్రపంచయుద్ధ కాలంలో యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలలో పాల్గొన్నారు. ఆ సందర్భంలోనే అరెస్టుకాబడి, జైలు జీవితం అనుభవించారు.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి ప్రారంభం నుండి కమ్యూనిస్టు పార్టీ విస్తరణకు పాటుపడ్డారు. అనంతపురం జిల్లాలో వున్నప్పుడు, 1961 తరువాత రాష్ట్ర బాధ్యతలు చేపట్టిన సమయంలోను, 1971 నుండి పార్టీ కేంద్ర బాధ్యతలు నిర్వహించిన కాలంలో కూడా పార్టీ నిర్మాణ బాధ్యతలనే ప్రధానంగా చేపట్టడం జరిగింది. పార్టీ కార్యకర్తలకు సిద్ధాంత, రాజకీయ నిర్మాణ శిక్షణయిచ్చి, సుశిక్షితులైన కార్యకర్తలను తయారు చేయడంలో కామ్రేడ్ రాజశేఖరరెడ్డి ప్రముఖపాత్ర నిర్వహించారు. తాను కేంద్ర బాధ్యతలతో తలమునకలుగా వుంటున్నా, రాష్ట్ర కేంద్రములో నిర్వహించిన పార్టీ శిక్షణా తరగతులకు కొన్ని సందర్భాలలో జిల్లా శిక్షణా తరగతులకు కూడా హాజరయ్యేవారు. విద్యార్థులను, యువకులను, పార్టీలోకి తీసుకురావడానికి, వారికి సిద్ధాంత శిక్షణ యివ్వడానికి కామ్రేడ్ రాజశేఖరరెడ్డి ప్రత్యేక శ్రద్ధ వహించారు. ఈ రెండు రంగాలు పార్టీ సభ్యుల, కార్యకర్తల రిక్రూట్‌మెంటుకు మంచి ప్రాతిపదిక అని పలు పర్యాయాలు వక్కాణిస్తూ వుండేవారు. పార్టీలో కార్యకర్తల పాత్ర, ప్రాముఖ్యత

గురించి కేడరే పార్టీసంపద అని, కేడర్లే సర్వస్వం అని అంతర్జాతీయ కమ్యూనిస్టు మహానాయకుడు కామ్రేడ్ డిమిట్రావ్ చెప్పిన విషయాలను ఎప్పుడూ పార్టీ కమిటీలలో, శిక్షణాలయాలలో చెపుతూ వుండేవారు.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి రాష్ట్ర కార్యదర్శిగా వున్న కాలంలో విద్యార్థులకు, యువజనులకు వందలమందితో వేసవి శిక్షణా శిబిరాలు నిర్వహించడం ఈయన ప్రత్యేకత అని చెప్పవచ్చు. అందులో 10 రోజులపాటు, 700 మందితో తాడేపల్లి గూడెంలో జరిగినది వేసవి శిబిరాలలోకెల్లా పెద్దది.

భారత కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ కార్యదర్శి వర్గంలో నున్న కాలంలో- "సిద్ధాంత విషయాలపై తరగతులు నిర్వహించడం ఒక్కటే చాలదు. మనది వ్యవసాయక దేశం. గ్రామీణ ప్రాంతాలలో రైతు, వ్యవసాయకార్మిక సంఘాలు బలవత్తరంగా, పటిష్టంగా వుండి, విప్లవాత్మక పోరాటాలు చేయకుండా, ఈ వర్గాల ప్రజలను ఎదుర్కొనే దైనందిన సమస్యలపై క్రియాశీల ఉద్యమాలు నిర్వహించకుండా, మన ప్రజాస్వామ్య విప్లవ పురోగమనం అసాధ్యమ"ని తరుచు చెబుతుండేవారు. చెప్పడమే కాదు ఆ రంగాల కార్యకర్తలకు ప్రత్యేక శిక్షణ యివ్వాలని, సిద్ధాంతాలే గాక, రోజువారి సమస్యల పరిష్కారంలో వారికి నైపుణ్యం కలిగించాలని సూచిస్తూ వుండేవారు.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి కేంద్ర కార్యదర్శులలో ఒకరుగా, పార్టీ ఎడ్యుకేషన్ డిపార్టు మెంటుకు అధిపతిగా వుండే సమయంలోనే నేను అఖిల భారత రైతు సంఘ ప్రధాన కార్యదర్శిగా పనిచేశాను. నాతో సంప్రదించిన తరువాత కేంద్ర పార్టీ ఎడ్యుకేషన్ డిపార్టుమెంటు తరపున వ్యవసాయ రంగంలో వస్తున్న నూతన పోకడలపైన ఒక జాతీయ సెమినార్ నిర్వహించడం జరిగింది. ఈ సెమినార్ పార్టీ నాయకులకు, రైతు, వ్యవసాయ రంగ కార్యకర్తలకు ఎంతగానో తోడ్పడింది.

అటు తరువాత సెమినార్ పత్రాలు, చర్చలు ఆధారంగా ఒక ప్రచురణగా తీసుకువచ్చే బాధ్యతను నాకప్పగించడం జరిగింది. నా సంపాదకత్వంలో వెలువడిన "ట్రెండ్స్ ఇన్ అగ్రేరియన్ ఎకానమీ" అనే పుస్తకంలో కామ్రేడ్ రాజశేఖరరెడ్డి సెమినార్ విశేషాలను సమీక్షిస్తూ దానివల్ల కలిగిన సత్ఫలితాలను పేర్కొన్నారు.

అంతే కాదు, నాతోను, కామ్రేడ్ జి. యల్లమందారెడ్డి గారితోను, రైతు, వ్యవసాయ కార్మిక ముఖ్య కార్యకర్తలకు ప్రత్యేక శిక్షణా తరగతులు నిర్వహించమని సూచిస్తూ వుండేవాడు.

ఆ విధంగానే రైతు, వ్యవసాయ కార్మిక సంఘ ముఖ్య నాయకులకు ఆంగ్లంలోను, హిందీలోను రెండు జాతీయ స్థాయి శిక్షణా తరగతులు ఆయన కృషితో ఢిల్లీ సమీపంలోని ఫరిదాబాద్ లో నిర్మించిన భవనంలో నేను నిర్వహించాను.

పార్టీ కార్యకర్తల నిరంతర శిక్షణ కొరకు, పార్టీ తరపున మారుతున్న ఆర్థిక, సామాజిక విషయాలపై పరిశోధన, అధ్యయనం చేయడానికి, సెమినార్లు, గోష్టులను నిర్వహించడానికి ఒక ప్రత్యేక భవనం అవసరమని భావించి, ఢిల్లీకి దగ్గరలో నున్న ఫరిదాబాద్‌లో నాలుగు ఎకరాల భూమికొని, అందులో భవన నిర్మాణం చేయడంలో కామ్రేడ్ రాజశేఖర రెడ్డికి ప్రధాన పాత్ర వుంది. ఈ సంస్థకు పార్టీ ప్రముఖులైన "పి.సి. జోషి, గంగాధర అధికారి జాతీయ సామాజిక విషయాల అధ్యయన సంస్థ" అని నామకరణం చేసారు. ఈ భవనానికి శంఖుస్థాపన జరిగిన సందర్భంలో అనేక మంది పార్టీ ప్రముఖులు, సోషలిస్టు దేశాల రాయబారులు హాజరైయ్యారు. నేను కూడా ఈ శుభకార్యక్రమానికి హాజరయ్యాను.

## పార్టీని విస్తరింప చేయాలన్న తపన! అందుకు మార్గాన్వేషణ :

1964లో భారత కమ్యూనిస్టు పార్టీ నుండి ఒక వర్గం చీలిపోయి భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు) పేరుతో ప్రత్యేక పార్టీని ఏర్పాటు చేశారు. ఆనాటికి పశ్చిమ బెంగాలు, కేరళ, త్రిపుర రాష్ట్రాలను మినహాయిస్తే మిగతా రాష్ట్రాలలో మార్క్సిస్టు పార్టీకన్న, భారత కమ్యూనిస్టు పార్టీయే ఎక్కువ బలం కలిగివుంది. ఆంధ్రప్రదేశ్‌లో ఈ రెండు పార్టీల మధ్య బలాబలాలు 60:40 దామాషాలో వుంది. అఖిల భారత ట్రేడ్ యునియన్ కాంగ్రేసులోను, అఖిల భారత రైతు సంఘం లోనూ భారత కమ్యూనిస్టు పార్టీకే అత్యధిక మెజారిటీ వుంది. కాని 1990 దశకం వచ్చేటప్పటికి మొత్తము మీద చూస్తే మార్క్సిస్టు పార్టీ పశ్చిమ బెంగాలు, కేరళ, త్రిపుర రాష్ట్రాలలో బలమైన పార్టీగా రూపొంది ప్రభుత్వాధికారాన్ని, తన బలాన్ని నిలబెట్టుకున్నది.

భారత కమ్యూనిస్టు పార్టీ కొంత బలహీన పడింది. హిందీ భాషా ప్రాంతాలలో ఒక్క బీహారును మినహాయిస్తే రెండు పార్టీలు ఏ మాత్రం బలాన్ని సంపాదించ లేకపోయాయి.

ట్రేడ్ యూనియన్లలోను, అఖిల భారత రైతు సంఘంలోనూ, మార్క్సిస్టు పార్టీ బలాన్ని పెంచుకోగలిగింది. కాగా ఈ సంఘాలలో భారత కమ్యూనిస్టు పార్టీ బలహీనపడింది. భారత కమ్యూనిస్టు పార్టీ తన బలాన్ని పెంచుకోలేక పోవడమే గాక, దేశం మొత్తం మీద చూచినపుడు బలహీనపడింది. ఈ పరిస్థితిని గురించి అప్పుడప్పుడు

కేంద్రస్థాయిలో చర్చించి తీసుకున్న నిర్ణయాలు కాగితాలకే పరిమితమవుతున్నాయి. అమలు జరుగడం లేదు. ఈ పరిస్థితిని గురించి రాజశేఖరరెడ్డి తన చివరి రోజులలో చాల ఆందోళన చెందేవారు. రాజశేఖరరెడ్డి, నేను, మరికొందరు నాయకులు తరచూ ఈ విషయాన్ని గురించి చర్చించే వాళ్లం.

దేశ వ్యాపిత బలం కలిగిన జాతీయ పార్టీగా భారత కమ్యూనిస్టు పార్టీ ఎదగటం లేదు. దీనికి గల కారణాలేమిటి? ఆ స్థాయికి పెరిగి, బలం కలిగిన జాతీయ పార్టీగా రూపొందడానికి పార్టీ కార్యక్రమంలో రావలసిన మార్పు లేమిటి అనే విషయం మా మధ్య చర్చలలోని ముఖ్యాంశాలు. పార్టీ జాతీయ సమితిలో ఈ విషయాన్ని ప్రస్తావించే వాళ్ళం.

దేశంలో నున్న వైరుధ్యాలలో వెనుకబాటుతనమే ప్రధాన వైరుధ్యమని, దేశాభివృద్ధి, యావత్తు ప్రజలముందున్న ప్రధాన కర్తవ్యమని వివిధ వర్గాల ప్రజానీకం దేశ సర్వతాభి వృద్దిని కాంక్షిస్తున్నారని, ఈ ప్రబలమైన ప్రజల కోర్కెకు రూపురేఖలు కల్పించి, బూర్జువా అభివృద్ధి పథకానికి, ప్రత్యామ్నాయ అభివృద్ధి పథకాన్ని తయారుచేసి, దానిని భారత ప్రజానీకం ముందువుంచాలని, దాని అమలుకు గాను ప్రజలను సమీకరించి, అట్టి ఉద్యమానికి నాయకత్వం వహించిన నాడే, భారత కమ్యూనిస్టు పార్టీ బలమైన దేశ వ్యాపిత జాతీయ పార్టీగా పెంపొంద గలుగుతుందని, అట్టి మార్పు పార్టీ కార్యక్రమంలో రావాలనే భావం మాలో బలపడింది. కార్మిక వర్గ పార్టీ అనే భావనతో కొన్ని సెక్షన్లకు సంబంధించిన కోర్కెలపై పనిచేయడానికి పరిమితం కారాదనే స్థూల నిర్ణయానికి మేము వచ్చాం. ఈ మా అభిప్రాయాలను వ్రాతమూలకంగా పార్టీ కేంద్ర నాయకత్వం ముందుంచటం ఎక్కువ ప్రయోజనకరంగా వుంటుందని భావించాము. ఆ విధంగానే రెండు, మూడు పత్రాలను రాజశేఖర రెడ్డి, కె.యల్. మహేంద్ర, నేను కలిసి తయారు చేసి కేంద్ర నాయకత్వానికి అందచేసాము.

## కరువుకు కాణాచియైన అనంతపురం జిల్లా అభివృద్ధి దిశలో ఆలోచన:

ప్రభుత్వ గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలలో పార్టీ ఎక్కువగా జోక్యం చేసుకొని ఆ కార్యక్రమాలలో జరుగుతున్న అవినీతిని అరికట్టి, వాటి ఫలితాలు అట్టడుగు ప్రజలకు చేరేలా చూడాలనే విషయంపైన కూడా రాజశేఖరరెడ్డి, నేను ఒకే అభిప్రాయంతో వుండేవాళ్ళం. రాజశేఖరరెడ్డి కేంద్ర బాధ్యతలు నుండి తప్పుకొని, హైదరాబాదులో మకాంపెట్టిన తరువాత నేను ఆయనకు ఒక సలహాయిచ్చాను. అనంతపురం జిల్లా చాల వెనకబడివుంది. కరువు కాటకాలతో సతమతమవుతోంది. ఆ జిల్లా సత్వరాభివృద్ధికి

ఒక ప్రణాళికను తయారుచేసి, దానిపై జన సమీకరణ చేయడం, దాని అమలుకై కృషి చేయడం అవసరమని, అందుకు ఆయన నాయకత్వం వహించటం బాగుంటుం దని నేను రాజశేఖర రెడ్డికి సూచించాను. అందుకు ఆయన అంగీకరించాడు. ఈ పథకంలో తొలి చర్యగా జిల్లా అభివృద్ధి సదస్సు ఒకటి జరపాలని కూడా మేమిద్దరం అభిప్రాయపడ్డాం. దురదృష్టకరమేమంటే అనుకోకుండా ఆయన ఆరోగ్యం 1994 మధ్యలో దెబ్బతినడంతో మా పథకం కార్యరూపం దాల్చలేదు.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డితో నాకు ఒక అర్ధ శతాబ్దానికి పైగా పరిచయం వుంది. ఆయన రాష్ట్ర కార్యదర్శిగా వుండగా, నేను రాష్ట్ర పార్టీ కార్యదర్శి వర్గంలో వుండి పని చేశాను. అలాగే అనేక ఉద్యమాలలో, పోరాటాలలో మేము కలిసి పనిచేశాం. ఆంధ్రప్రదేశ్ సమగ్రతకు నిలబడి పనిచేసాం. జై ఆంధ్ర ఉద్యమాల వల్ల ప్రమాదం ఏర్పడ్డప్పుడు మేము కలసి వేర్పాటువాదులకు వ్యతిరేకంగా పోరాడటం జరిగింది.

1948 ఫిబ్రవరి చివరిలో జరిగిన భారత కమ్యూనిస్టు పార్టీ రెండవ మహాసభ నాటికి తెలంగాణాలో నిజాం నవాబు, అతని రజాకారు మూకల దౌర్జన్యాలకు వ్యతిరేకంగా జరుగుతున్న సాయుధపోరాటం ఉవ్వెత్తుగా సాగుతోంది. అనేక ప్రాంతాలనుండి దేశముఖులు, ప్రజా వ్యతిరేకులు పారిపోయి పట్టణాలలో, ముఖ్యంగా హైదరాబాదులో తలదాచు కొంటున్నారు. వందల గ్రామాలలో గ్రామ రాజ్యాలు ఏర్పడ్డాయి. భూస్వాముల కౌలు భూములు, మిగులు భూములు పేదలకు పంచబడ్డాయి. రెండవ పార్టీ మహాసభలో తెలంగాణా మార్గమేమన మార్గమని పిలుపు నివ్వబడింది. తెలంగాణాను ఒక విముక్తి ప్రాంతంగా చేసుకోవాలని పార్టీ నిర్ణయించింది. ఇది పూర్తిగా ఒంటెత్తు పొరబాటు నిర్ణయం అనడంలో సందేహం లేదు. తరువాత పరిణామాలు ఈ విషయాన్ని నిరూపించాయి.

అయితే కలకత్తా కాంగ్రేసు తరువాత వివిధ స్థాయిలలోని పార్టీ నాయకత్వం అంతా అజ్ఞాత వాసంలోకి పోయింది. బుద్దవరం మహాసభలో 40 మందితో ఎన్నుకోబడ్డ రాష్ట్ర కమిటీ, నిర్బంధ పరిస్థితుల కారణంగా 5 గురికి కుదించబడింది. దానిలో కామ్రేడ్ రాజశేఖర రెడ్డి ఒకరు.

తెలంగాణా పోరాటాన్ని ఆంధ్రప్రాంతానికి విస్తరించాలని నిర్ణయించిన తరువాత పార్టీ నిర్మాణాన్ని ఆంధ్ర ప్రాంతములో కూడా రీజినల్, ఏరియా, జోనల్ కమిటీలుగా ఏర్పాటు చేయడం జరిగింది.

ఆ కాలంలో రాష్ట్ర కమిటీ నన్ను రాయలసీమకు పంపింది. రాయలసీమ జిల్లాలకు ఏర్పడిన రీజినల్ కమిటీలో కామ్రేడ్స్ తరిమెల నాగిరెడ్డి, చంద్ర పుల్లారెడ్డి, నేను వుండేవాళ్ళం. నేను ఆ కమిటికి కార్యదర్శిని. ఆ కాలంలో రాష్ట్ర నాయకత్వంలో ఒక భాగం మద్రాసులోనూ, మరొక భాగం కొంతకాలం హైదరాబాదులోను, అటు తరువాత బొంబాయిలోనూ వుండేది. మద్రాసు కేంద్రములో కామ్రేడ్ రాజశేఖరరెడ్డి వుండేవారు. నేను మద్రాసు కేంద్రానికి, హైదరాబాదు, బొంబాయి కేంద్రాలకు పార్టీ కార్యక్రమాల సమన్వయం కోసం వెళ్ళేవాడిని.1950లో రాయలసీమ రీజనల్ కమిటీ రహస్య కేంద్రాన్ని బెంగుళూరులో ఏర్పాటు చేశాం. అక్కడికి రాజశేఖర్ వస్తూవుండేవాడు.

1948 సెప్టెంబరులో హైదరాబాదు సంస్థానంలోకి యూనియన్ సైన్యం ప్రవేశించింది. నైజాం నవాబు లొంగిపోవడం, హైదరాబాదు సంస్థానం ఇండియన్ యూనియన్‌లో చేరడం, జనరల్ చౌదరి నాయకత్వాన హైదరాబాదులో ప్రభుత్వం ఏర్పడటం జరిగింది. ఈ కథ అంతా 4 రోజులలో ముగిసింది. నూతన పరిస్థితులకు అనుగుణమైన విధానాలను, ఎత్తుగడలను పార్టీ రూపొందించుకోలేక పోయింది. యూనియన్ సైన్యం చేసిన దాడులతో పార్టీ తీవ్రంగా నష్టపోయింది. దళాలు అటవీ ప్రాంతాలకు పోయి, ఆత్మరక్షణ చేసుకోవలసి వచ్చింది.

ఇక ఆంధ్ర ప్రాంతములో పార్టీ పూర్తిగా దెబ్బతిన్నది. గుంటూరు, నెల్లూరు జిల్లాల నాయకత్వం దెబ్బతిన్నది. బెంగుళూరులో ఆ జిల్లాల నాయకత్వమున్న రహస్య కేంద్రాలపై పళనియప్పన్ రిజర్వు పోలీసు దళాలు దాడిచేయడంతో అవి దెబ్బతిన్నాయి. ఈ పరిస్థితులలో ఒకనాటి రాత్రి కామ్రేడ్ రాజశేఖర్, ప్రస్తుతం మార్క్సిస్టు పార్టీ పోలిట్‌బ్యూరో సభ్యుడుగానున్న యల్.బి. గంగాధరరావు, తరిమెల నాగిరెడ్డి, నేను బెంగుళూరులో నేను వుంటున్న ఇంటిలో సమావేశమై ఉద్యమ పరిస్థితిని సమీక్షిస్తున్నాం.

అప్పటికే నా రహస్యస్థావరంపై పళనియప్పన్ ప్రత్యేక పోలీసుల నిఘా వుంది. మేము సమావేశంలో వుండగానే మాపై పోలీసుల దాడి జరగనున్నట్లు మాకు తెలిసింది. వెంటనే నేను, రాజశేఖరరెడ్డి ఒకవైపు, నాగిరెడ్డి, గంగాధరరావు ఒకవైపు వెళ్ళాము. ఆ రాత్రంతా పోలీసులు మా వెంటబడుతూనే వున్నారు. మరుసటిరోజు ఉదయం మేము నలుగురం తిరిగి కలుసుకొని, ఇక అక్కడ వుండడం క్షేమంకాదని, తలా ఒక ప్రాంతానికి వెళ్ళాము. ఈ విధంగా కామ్రేడ్ రాజశేఖరరెడ్డి, నేను అత్యంత క్లిష్ట సమయంలో కలిసి పనిచేశాం. పోలీసుల వలయంలో పడకుండా తప్పించుకున్నాం.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి పుట్టినది భూస్వామ్య కుటుంబంలో. కాని ఆయన పోరాడింది భూస్వాములతోనే. పీడిత, తాడిత అణగారిన ప్రజలకోసం, దేశ శ్రేయస్సుకు ఆయన తన జీవితాన్ని అంకితం చేశారు.

1994 డిసెంబరు 13న కామ్రేడ్ రాజశేఖరరెడ్డి మృతి చెందడం కమ్యూనిస్టు ఉద్యమానికి తీరని లోటు. ఆయన మృతితో దేశం ఒక ప్రముఖ దేశభక్తుణ్ణి కోల్పోయింది.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి తన జీవిత కాలంలో ఏ మహోన్నత ఆశయాల కోసం సోషలిస్టు సమాజ నిర్మాణ కోసం, పీడిత తాడిత ప్రజల విముక్తికోసం పోరాడారో ఆ ఆశయ సాధనకు మనం పునరంకితం కావడం ద్వారానే ఆ కమ్యూనిస్టు నాయకునికి, దేశ సేవకునికి ఘనమైన నివాళి అర్పించగలుగుతాము.

కామ్రేడ్ రాజశేఖర రెడ్డికి జోహార్లు.

- వై.వి. కృష్ణారావు

**సోషలిస్టు విప్లవం కోసం సన్నద్ధం చేయడంలో ఒక ముఖ్య అంశం రైతుల్నీ, సన్నకారు కృషీవలుల్నీ పారిశ్రామిక కార్మికుల వైపు తీసుకు రావడం. ఎందుకంటే కార్మిక కర్షక సంఘటన రాజకీయాధికార విజయంలో తప్పనిసరియైన అంశం.**

**- ఏంగెల్స్**



కామ్రేడ్ రాజశేఖరరెడ్డి విప్లవకారుడిగా ఎదిగినతీరు

# నాటి విద్యార్థి జీవితంలో ఒక చారిత్రాత్మక ఘట్టం

- పరకాల పట్టాభిరామారావు

బెనారస్‌లో చదువుతూ 1938లో కమ్యూనిస్టు పార్టీలో చేరిన కామ్రేడ్ రాజశేఖర రెడ్డి, కామ్రేడ్ తరిమెల నాగిరెడ్డి సెలవులలో ఇళ్ళకు వచ్చినప్పుడు జిల్లాలో యువజన సంఘాధ్వర్యాన జరిగే రాజకీయ పాఠశాలలో మార్క్సిజం గురించి పాఠాలు చెబుతూ ఉండేవారు. బెనారస్ విద్యార్థి ఉద్యమంలో, విప్లవోద్యమంలో రాజశేఖరరెడ్డి కార్యకలాపాలపై నిఘావేసిన బ్రిటిష్ ప్రభుత్వం ఆయనపై అరెస్టు వారెంటు జారీ చేసింది. కామ్రేడ్ రాజశేఖరరెడ్డి అరెస్టును తప్పించుకొని రహస్యంగా అనంతపురం చేరారు గ్రామాలలో మరింత చురుకుగా యువకులకు రాజకీయ పాఠాలు చెప్పేవారు.

1941లో అనంతపురంలో విద్యార్థి ఫెడరేషన్ స్థాపించబడింది. కామ్రేడ్ వి.కె. ఆదినారాయణరెడ్డి కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. రహస్య జీవితం గడుపుతున్న కామ్రేడ్ రాజశేఖరరెడ్డి వీరితో సంబంధాలు పెట్టుకొని వారికి రాజకీయ పాఠాలు చెప్పేవారు. తిరిగి బెనారస్‌కు వెళ్ళగానే అక్కడ ఆయనను ప్రభుత్వం అరెస్టు చేసి ఆగ్రా జైలులో, మరికొన్ని జైళ్ళలోను నిర్బంధించింది 1942 ఆగస్టులో జైలు నుండి విడుదలైన రాజశేఖర రెడ్డి అనంతపురం వచ్చారు.

## లేబొరేటరీ దహనం కుట్ర కేసు

1942 ఆగస్టు ప్రాంతంలో రాజశేఖరరెడ్డి, సదాశివన్‌గార్లు ఫాసిస్ట్ వ్యతిరేక ప్రజాయుద్ధ నినాదాల్ని వివరిస్తూ పూలకుంట్లలో ఒక బహిరంగసభ జరిపారు. కమ్యూనిస్టు పార్టీ పాలసీలో వచ్చిన మార్పును గుర్తించని పోలీసులు వీరిరువురినీ అరెస్టు చేసి కేసు పెట్టారు.

ఈ కేసు ఇలా నడుస్తుండగానే అనంతపురం జిల్లా విద్యార్థి ఉద్యమంలోను, రాష్ట్ర విద్యార్థి ఉద్యమంలోను చరిత్ర ప్రసిద్ధికెక్కిన ఒక కుట్ర కేసును ప్రభుత్వం విద్యార్థి నాయకులపై బనాయించింది.

అదే అనంతపురం కాలేజి లాబొరేటరీ దహనం కుట్రకేసు.

క్విట్ ఇండియా ఉద్యమం అప్పుడు జరుగుతూవుంది. రైల్వేలైన్లు, టెలిఫోన్, టెలిగ్రాఫ్ తీగలు తెగకొట్టడం, స్టేషన్లు తగులబెట్టడం మున్నగు విధ్వంసక కార్యక్రమాలు దేశమంతటా జరిపి ప్రజలు బ్రిటిష్ ప్రభుత్వంపై ఆగ్రహావేశాలు ప్రదర్శిస్తున్నారు. ఈ సందర్భంగానే అనంతపురం కాలేజీ లేబొరేటరీని లక్ష రూపాయల విలువచేసే

సైన్సు పరికరాలతో సహా ఒక రోజు అర్ధరాత్రి తగుల బెట్టారు.

ఈ తగులబెట్టింది ఎవరో కనుగొనకుండానే పోలీసులు మూకుమ్మడిగా జిల్లా విద్యార్థి నాయకత్వాన్నంతా అరెస్టు చేసింది. అందులో కామ్రేడ్ రాజశేఖరరెడ్డిని కూడా పోలీసులు యిరికించారు. ఆయన అప్పటికి యింకా బెనారస్ విద్యార్థిగానే ఉన్నప్పటికీ అనంతపురం విద్యార్థి ఉద్యమాన్ని వెనుకనుండి నడిపిస్తున్నది ఆయనే అని పోలీసులు పసికట్టారు.

1942 సెప్టెంబరు 10వ తేదీన జరిగిన ఈ అరెస్టులలో కామ్రేడ్ రాజశేఖరరెడ్డితో పాటు కామ్రేడ్ వి. కె. ఆదినారాయణరెడ్డి, కామ్రేడ్ తిరుమలరెడ్డి మొదలైన వారు 8 మంది ఉన్నారు.

అనంతపురం జిల్లా రాజకీయ రంగంలో సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులలో ఒక ప్రధానశక్తిగా విద్యార్థి ఉద్యమం ముందుకు వస్తున్నదని గమనించిన బ్రిటిష్ ప్రభుత్వం దీనిని దెబ్బకొట్టడానికే ఈ కుట్రకేసును బనాయించింది. కామ్రేడ్ రాజశేఖర రెడ్డి ఈ ఉద్యమానికి ప్రధాన నాయకుడుగా ఉన్నాడనే దృష్టితోనే ఆయన స్థానిక కాలేజి విద్యార్థి కాకపోయినా ఆయనను ఇందులో యిరికించారు.

## ఈ కుట్రకేసు పూర్వరంగం ఏమిటి?

క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంలో జాతీయ నాయకులను నిర్బంధించి నందుకు తీవ్ర ఆగ్రహావేశాలు పెల్లుబికాయి. వారు ప్రతీకార విధ్వంసక కార్యక్రమాలకు దిగే ఉద్రిక్త పరిస్థితులలో ఉన్నారు. ఇటువంటి సందర్భంలో కామ్రేడ్ రాజశేఖరరెడ్డి నాయకత్వాన కామ్రేడ్ వి. కె. ఆదినారాయణరెడ్డి తదితరులు విద్యార్థుల అసంతృప్తి జ్వాలలను నిరసన సమ్మెలు, ప్రదర్శనల రూపంలోకి మళ్ళించి, విధ్వంసక కార్యక్రమలకు దిగకుండా చాలా ఓర్పుతో, నేర్పుతో సంఘటితంగా విద్యార్థి ఉద్యమాన్ని సంరక్షించు కుంటూ నాయకత్వం వహించారు. విద్యార్థి జనసామాన్యం నుండి విద్యార్థి ఫెడరేషన్ నాయకులు విడివడి వారికి దూరం కాకుండా వారితో ఉంటూ వారు తీవ్రవాద చర్యలకు దిగకుండా ఉద్యమాన్ని జయప్రదంగా కాపాడారు.

విద్యార్థి నిరసన ప్రదర్శనలపై ఒక పర్యాయం రిజర్వు పోలీసులు తుపాకులతో కాలుస్తామని దాడికి వచ్చినపుడు, తుపాకి మడమలతో తీవ్రంగా కొట్టినప్పుడు విద్యార్థి నాయకులు ధైర్యంతో విద్యార్థుల మధ్య ఉండి ఆ దెబ్బలు తింటూ నిర్మాణయుతంగా విద్యార్థులు నిలబడేటట్లు చేయగల్గారు. ఆ రోజున రక్తపాతాన్ని నివారించారు. ఆర్గురు విద్యార్థులకు గాయాలు తగిలినప్పటికీ రెచ్చిపోకుండా నిర్మాణయుతంగా విద్యార్థులు చెదిరిపోయేటట్లు చేశారు.

నిరవధిక సమ్మె చేయాలని కొంతమంది విద్యార్థులు పట్టుపట్టినప్పుడు అన్ని అభిప్రాయాలు కల్గిన విద్యార్థులందరం కలిసి నిర్ణయించుకుందామని నచ్చచెప్పి, అత్యధిక సంఖ్యాక విద్యార్థులు నిరవధిక సమ్మెకు వ్యతిరేకంగా ఉన్నారని తేటతెల్లం కావటంతో విద్యార్థి ఐక్యతను కాపాడుటకు నిరవధిక సమ్మె ప్రతిపాదనను విరమింప చేశారు. అరాచక చర్యల ఆరోపణతో విద్యార్థి ఉద్యమాన్ని అణచివేద్దామని చూస్తున్న పోలీసు అధికారుల పన్నాగాలు విఫలమై విద్యార్థి సమ్మెలు, నిరసన ప్రదర్శనల ఉధృతం తగ్గుతున్న స్థితిలో ఉన్నట్టుండి కాలేజీ లేబొరేటరీ తగులబెట్టబడింది. ఈ తగులబెట్టింది విద్యార్థి ఫెడరేషన్ నాయకులు కాదని ఒక వైపున కనబడుతున్నప్పటికీ, వారు ఇటువంటి విధ్వంసక చర్యలకు వ్యతిరేకులు అని ధృవపడుతున్నప్పటికీ, అనంతపురం జిల్లా విద్యార్థి ఉద్యమాన్ని, దాని నాయకత్వాన్ని తుడిచి పెట్టాలనే ఉద్దేశ్యంతోనే ఈ దహనకాండ కేసును బ్రిటిష్ ప్రభుత్వం కామ్రేడ్స్ రాజశేఖరరెడ్డి, వి.కె. తదితరులపై బనాయించింది.

ఈ కేసు విచారణకు స్పెషల్ కోర్టు నెలకొల్పాలని పోలీసు అధికారులు తీవ్ర ప్రయత్నాలు చేశారు. స్పెషల్ కోర్టు విచారణ అంటే దానిపై అప్పీలుకు అవకాశం లేదు. దీర్ఘకాల శిక్షలు విధించే అవకాశం ఉంది. ౫౭

ఇట్టి పరిస్థితుల్లో ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్, అనంతపూర్ విద్యార్థి ఉద్యమాన్ని రక్షించుకోవాలని, వారిపై దమనకాండను తిప్పికొట్టాలనీ రాష్ట్ర వ్యాపిత ఆందోళనకు పిలుపు యిచ్చింది. ఆనాటి రాష్ట్ర విద్యార్థి ఉద్యమ ప్రముఖులు కామ్రేడ్ ఎస్.వి.కె. ప్రసాద్ ప్రజాశక్తి వారపత్రికలో విపులంగా వ్యాసం వ్రాస్తూ ఒక సంఘటిత శక్తిగా స్వాతంత్ర్య పోరాటంలో విద్యార్థి ఉద్యమం లేకుండా చేయడానికే అనంతపురం విద్యార్థి కామ్రేడ్స్‌పై ఈ కుట్రకేసు బనాయించారని బహిర్గతం చేసారు అఖిలభారత విద్యార్థి ఫెడరేషన్ ఆ రోజున తీసుకున్న పాలసీకి విధ్వంసక కార్యక్రమాలు విరుద్ధమనీ, అందుచేత అనంతపురం కాలేజీ లేబొరేటరీని తగులబెట్టింది విద్యార్థి ఫెడరేషన్ కార్యకర్తలు కాదని తెలిపారు.

దీనితో రాష్ట్రమంతటా అనంతపురం విద్యార్థి నాయకులను విడుదల చేయాలన్న తీవ్రాందోళన జరిగింది. రాష్ట్రం నలుమూలలా విద్యార్థి సంఘాలు సభలు, సమావేశాలు జరిపి తీర్మానాలు చేసి ప్రభుత్వంపై వత్తిడి తెచ్చారు.

అనంతపురం విద్యార్థులపై పెట్టిన కుట్రకేసులను పలువురు కాంగ్రెస్ నాయకులు ఖండించారు. సుప్రసిద్ధ నటకులు, న్యాయవాదులు, దేశభక్తులు అయిన బళ్లారి రాఘవాచార్య వచ్చి ఈ కేసులో వాదించి విద్యార్థుల పక్షాన నిలబడ్డారు. విద్యార్థుల ఆందోళన, ప్రజాందోళన ఫలితంగా చివరకు ఈ కేసు కొట్టి వేయబడింది. విద్యార్థి నాయకులందరూ విడుదల చేయబడ్డారు. అప్పుడు పశ్చిమ గోదావరి జిల్లా

విద్యార్థి సంఘం ఆర్గనైజరుగా ఉన్న నేను కూడా అనంతపురం విద్యార్థి నాయకుల విడుదల కోసం జిల్లా అంతటా జరిగిన ఆందోళనలో పాలు పంచుకొన్నాను.

అనంతపురం కాలేజీ లేబొరేటరీని తగులబెట్టింది ఒక దుందుడుకువాది అనీ, విద్యార్థి ఫెడరేషన్ నాయకులు కాదని ఆ తరువాత వెల్లడైంది.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి తదితరులపై బనాయించిన ఈ కుట్రకేసు రాష్ట్ర విద్యార్థి ఉద్యమ చరిత్రలో ఒక ప్రముఖ ఘట్టంగా నిలిచి వుంటుంది.

- పరకాల పట్టాభిరామారావు




విశాలాంధ్ర 30వ వార్షికోత్సవం సందర్భంగా 1982 జూన్22న కంభంపాటిగారిని సన్మానిస్తున్న నాటి పార్టీ జాతీయ కార్యదర్శి కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డిగారు.

**"లక్ష్యరహిత, గమ్యరహితమైన బ్రతుకు వద్దు మనకు**

**నిస్సారపు, నిర్జీవపు కాకి బ్రతుకు వద్దు మనకు**

**పద, పద, పద పోదాం, పద ముమ్ముందుకు వేగంగా**

**కష్టాలను, క్లేశాలను లెక్కించక పోదాం పద"**

***- తన జీవిత పరమార్థాన్ని యువకుడైన మార్క్స్ ఒక గేయంలో తెలిపిన తీరు***

# పార్టీ నిర్మాణ నైపుణ్య దక్షుడు నీలం రాజశేఖరరెడ్డి

- డా॥ రాజబహదూర్

ఎంతో ప్రజాభిమానం చూరగొన్న నాయకుడు, పార్టీ నిర్మాణనైపుణ్య దక్షుడు నీలం రాజశేఖరరెడ్డి. ఆయన ఆప్యాయతాపూర్వక స్మృతికి సంబంధించిన కొన్ని జ్ఞాపకాలే ఇవి. ఆయన నేతృత్వం కిందా, ఆయనతో కలిసి పని చేయడమే ఒక మధురాను భూతి. నాకు ఆ రెండు విధాల గౌరవము దక్కింది.

మొదటి సారి ఆయన్ని ఆదోనిలో కలుసుకున్నాను. ఆయన అప్పుడు అనంతపురం జిల్లా పార్టీ కార్యదర్శిగా వున్నారు. హైద్రాబాద్ రాష్ట్ర ప్రజలకు సంఘీభావం తెలియజేసే బహిరంగ సభ జరిగింది. నైజామ్‌కు వ్యతిరేకంగా హైద్రాబాద్ రాష్ట్రం భారత యూనియన్‌లో చేరాలి అని నిర్వహించిన సభ అది. ఆయన నిరాడంబరత్వం నన్ను చకితుణ్ణి చేసింది. తెలంగాణా ప్రజల గురించి ఆయనకు లోతైన అవగాహన వుంది, అదీ నన్ను చకితుణ్ణి చేసింది.

తెలంగాణా ప్రజలు త్రిముఖ యుద్ధం చేస్తూ వున్నారు. ఒకటి: ఫ్యూడల్ పీడనకు వ్యతిరేకంగా జాగీర్దారీ, జమిందారీ వ్యవస్థల్ని రద్దు చెయ్యడం ద్వారా భూముల్ని రైతులు తిరిగి పొందడానికీ; రెండు: సభలు నిర్వహించుకునే పౌరహక్కుల కోసం; మూడు: తెలుగు భూబాగాన్ని ఏకం చెయ్యడం కోసం. విదేశీయులకు సేవ చేస్తూ, ఫ్రెంచివాళ్లకు ఉత్తర సర్కారు జిల్లాలను ధారాదత్తం చేసింది అసిఫ్ జాహీ వంశం. అందుకుగాను ఫ్రెంచివాళ్ళు హైద్రాబాద్‌లో తమ సేనల్ని వుంచుతారు; "రక్షణ" కల్పిస్తారు నైజామ్‌కి. ఫ్రెంచివాళ్ళ నుంచే బ్రిటీషువారు ఆ ప్రాంతాన్ని కైవసం చేసుకున్నారు. తర్వాత నైజామ్ రాయలసీమను బ్రిటీషు వాళ్ళకు దత్తం చేశాడు టిప్పు సుల్తాన్‌కు చేసిన ద్రోహానికి చిహ్నంగా.

స్వాతంత్ర్యానికి అర్థం అంటూ యేమన్నావుంటే యీ గాయం మానాలి. ఆంధ్రప్రాంతంలో వున్న పార్టీ కంఠ దఘ్నంగా యీ పోరులో వుంది. ఈ పోరాటంలోనే నేను ఈ కామ్రేడ్స్‌కు సన్నిహితం అయ్యాను. నేను వాళ్ళ నుంచి ఎంతో నేర్చుకున్నాను.

రాజశేఖరరెడ్డి రాజకీయంగా తనకున్న ప్రత్యేక అలవాట్లతోనన్ను ముగ్ధుణ్ణి చేశారు. ఏం చెప్పినా జాగ్రత్తగా వినేవారు. ఆయన నిర్మాణ దక్షత చాలా గొప్పది. సమస్యను అన్ని కోణాల నుంచీ అవగాహన చేసుకునేవారు. అప్పుడు దాన్ని పరిష్కరించడానికి ప్రజాపంథా రూపొందించేవారు. అందుకనే ఓ ఫలానా పరిస్థితిని ఎదుర్కొనేందుకు ఆయన ప్రతిపాదించిన పంథాని, నాకు గుర్తున్నంతవరకు, పార్టీ, ప్రజలు ఆమోదించడం సర్వదా జరిగేది. ఆయన నిర్మాణ నైపుణ్యం వున్నది యిక్కడనే.

పార్టీ తీవ్రమైన విభేదాలతో నలిగిపోతూ వున్నప్పుడు ఆయన అగ్రస్థానంలో వున్నారు. ఆ విభేదాలవల్ల ప్రజాహిత కార్యక్రమాలు దెబ్బతింటూ వున్నాయి. కామ్రేడ్స్‌కు నమ్మకం సన్నగిల్లుతూ వుంది. స్తబ్దత చోటు చేసుకుంటూవుంది.

శాఖలు విభేదాలలో కూరుకుపోయి, ప్రజలు ఎదుర్కొనే సమస్యల్ని పట్టించుకోకుండా వాటి పరిష్కార మార్గాలు అన్వేషించకుండా శక్తి హీనం అయిపోయిన సందర్భాలున్నాయి.

అదుగో ఆ సమయంలో పార్టీ "ప్రత్యక్ష నాయకత్వం" పంధాని అందుకుంది. పై స్థాయి కమిటి సంబంధిత శాఖతో కలిసి సంయుక్తంగా దాన్ని రూపొందించాలి. అప్పుడు ఆ శాఖను ప్రజా కార్యక్రమాల దిశలో పై స్థాయి కమిటి నేరుగా నడిపించాలి.

నన్నూ ఆయన్నీ ఆదిలాబాద్‌లో పని చెయ్యడం కోసం పంపడం నాకు గుర్తు వుంది. అక్కడ భూమి లేని పేదలు భూమిని ఆక్రమించుకుని సాగు చేసుకుందుకు ఆయన ఒక కార్యక్రమాన్ని తయారు చేశారు.

ఆయనలో మరో గొప్ప గుణం వుంది. కామ్రేడ్స్ వాళ్లల్లో వాళ్ళు విభేదిస్తూ శాఖను కుంటు సరిచేశారు. అలాంటి కామ్రేడ్స్‌తో ఆయన వ్యవహరించేతీరు అది. మొత్తం ఆ నాయకులందర్నీ పై స్థాయి నాయకులతో సమావేశానికి రమ్మని పిలిచేవారు. విభేదాల్ని ఆసాంతం చర్చించేవారు. పరిష్కారం కనిపెట్టేవారు. ఆయనతో అలాంటి అనుభవం నాకు కలిగింది.

ఒక ఉదంతం చెప్పి ముగిస్తాను. మా కుటుంబంలో దీర్ఘాయుష్షు ఆచారంగా వస్తూ వుందని ఓ సారి ఆయనతో అన్నాను. మా తాత పోయేనాటికి ఆయన వయస్సు90 ఏండ్లు. మా తండ్రి గారికి (యిప్పటికి) 105 ఏళ్లు.

ఆయనా, సత్యనారాయణరెడ్డి యిద్దరూ ఒక్క ఉదుట్న మరి నీవు బ్రతికినంత కాలం మేము బ్రతుకుతామా అన్నారు. యివాళ వాళ్ళిద్దరూ వెళ్ళి పోయారు. నేను యీడ్చుకొస్తున్నాను. పార్టీకి ఉపయోగపడని పార్టీ ఆస్తిగా (a non-performing Asset).

**"మానవజాతికి అత్యధికంగా మేలు చేయగల వృత్తిని మనం ఎంచుకున్నట్లయితే మనం దేనికీ తలవంచనవసరం లేదు. ఎందుకంటే అది అందరి కోసం చేసేత్యాగం. అప్పుడు మనం పొందే ఆనందం అల్పమైనది కాదు. ఎందుచేతనంటే లక్షలాది ప్రజల సౌఖ్యమే మన సౌఖ్యం అవుతుంది. మన కార్యాలు ప్రపంచంలో శాశ్వతంగా నిలిచి పోతాయి. మన అస్తికలు మహానుభావుల అశ్రుధారలతో పునీతమవుతాయి."**

**- మార్క్స్**

**(కమ్యూనిస్టు నీతి గ్రంధానికి కంభంపాటి గారి ఉపోద్ఘాతం నుండి)**



# రాజశేఖర్
# ఒక నిరంతర మార్క్సిస్టు విద్యార్థి!
# అధ్యయనం ఆయన ఊపిరి

- సురవరం సుధాకర్‌రెడ్డి

కామ్రేడ్ రాజశేఖరరెడ్డిగారితో నాకు దాదాపు 3 దశాబ్దాల సాన్నిహిత్యం వుందని చెప్పుకోగలను. కర్నూలులో విద్యార్థిగా వుండగా విద్యార్థుల రాజకీయ పాఠశాలలో ఆయన ఉపాధ్యాయుడిగా, నేను విద్యార్థిగా ఆయనతో నా మొదటి పరిచయం. ఆ తర్వాత కొద్దికాలంలోనే పార్టీలో చీలికవచ్చింది. అప్పటికి నేను విద్యార్థి పార్టీ యూనిట్ కార్యదర్శిగా వుండి, రాష్ట్ర సమితి కార్యదర్శిగా వున్న కామ్రేడ్ రాజశేఖర్‌ను పార్టీలో ప్రధాన విభేదాల గురించి విద్యార్థులకు వివరించేందుకు ఆహ్వానించాను. జిల్లా పార్టీ నాయకత్వానికి ఈ చర్య రుచించక పోయినా, రాష్ట్ర కార్యదర్శి స్వయంగా వస్తున్నందున ఆగ్రహాన్ని దిగమింగుకున్నారు. కర్నూలు జిల్లా పార్టీ కార్యదర్శిగా అప్పుడు కామ్రేడ్ చంద్ర పుల్లారెడ్డిగారు వుండేవారు. మా పై వారి ప్రభావం ప్రగాఢంగా వుండేది

వాస్తవానికి కమ్యూనిస్టు పార్టీలో చీలిక వచ్చిన ఆ సమయంలో కామ్రేడ్ రాజశేఖర్ తన హేతుబద్ధమైన వాదనా పటిమతో విషయాలు వివరించిన తీరు, నన్ను నాలాంటి అనేక మంది ఆనాటి యువకులను సిపిఐ యొక్క సరైన వైఖరితో నిలబడేటట్లు చేసింది.

౬౧

కామ్రేడ్ రాజశేఖర్ బహుముఖ ప్రజ్ఞాశాలి. ఆయన మార్క్సిస్టు మేధావి. జీవిత కాలమంతా నిరంతర మార్క్సిస్టు విద్యార్థి. మార్క్సిజాన్ని విడమరిచి వివరించిన ఉపాధ్యాయుడు. పార్టీ నిర్మాణాన్ని ఓపికతో సాగించిన ఆర్గనైజర్.

కామ్రేడ్ రాజశేఖర్‌కు పార్టీ నిర్మాణంలో దూరపు చూపు ఎక్కువ. విద్యార్థి ఉద్యమంపై ఆయన ఎక్కువ కేంద్రీకరించేవారు. అభివృద్ధి చెందుతున్న దేశాల్లో కమ్యూనిస్టు పార్టీకి, ప్రజా సంఘాలకు నాయకులుగా త్యాగబుద్ధితో జీవిత సుఖాలను వదులుకొని విప్లవకారులుగా, పూర్తి కాలం పార్టీకి అంకితమై పనిచేసే హోల్‌టైమర్లు విద్యార్థి రంగం నుండే రావాలని భావించేవారు.

యూనివర్సిటీ కేంద్రాల నుండి సమర్థులైన విద్యార్థులను ముందుగానే ఎంపిక చేసి పంపమని మాకు సూచించి అవసరమైన సహాయం చేసేవారు. రాష్ట్రంలో ఏఐఎస్ఎఫ్

ను బలమైన సంఘంగా రూపొందించుకునేందుకు ఆయన మార్గదర్శకత్వం తోడ్పడింది. అనేక మంది విద్యార్థి నాయకులు పార్టీ హోల్‌టైమర్లుగా వచ్చారు. విద్యార్థులకు రాజకీయ శిక్షణా శిబిరాలు, రాజకీయ పాఠశాలలు రాజశేఖర్ ప్రోత్సహించారు. రాష్ట్రస్థాయి పాఠశాలల్లో కొన్ని పర్యాయాలు ఏడెనిమిది వందల వరకు కూడా విద్యార్థులు వచ్చేవారు. ఈ క్యాంపులు గొప్ప స్ఫూర్తినిచ్చాయి. విద్యార్థి ఉద్యమం కొత్త ఊపునందుకుంది.

అలాగే పార్టీ ఎడ్యుకేషన్‌పై ఆయనకు ప్రత్యేక ఆసక్తి వుండేది. రాష్ట్రంలో నిరంతరం వివిధస్థాయిల కార్యకర్తల కోసం పాఠశాలలు పెట్టించేవారు. ఇందులో బోధించాల్సిన అంశాలు ఎప్పటికప్పుడు చర్చించి అవసరమైన మార్పులు తెచ్చేపద్ధతి ప్రవేశపెట్టారు. సిలబస్‌తోపాటు వాటిని బోధించే నాయకులకు ప్రత్యేక క్లాసులు పెట్టించారు.

పార్టీ రాష్ట్ర కార్యదర్శి బాధ్యతల నుండి రిలీవయి కేంద్ర కార్యదర్శివర్గ సభ్యులు ఐన తర్వాత ఢిల్లీలో పార్టీ ఎడ్యుకేషన్ విస్తరణపై ఆయన తన ముద్ర బలంగా వేసారు. దేశంలో ప్రతి పార్టీ సభ్యుడి నుండి ఎడ్యుకేషన్ లేవీ వసూలు చేయించారు. బలహీనమైన రాష్ట్రాలలో పార్టీ ఎడ్యుకేషన్‌కు సబ్సిడి యిచ్చారు. పార్టీ సిలబస్ ఇంగ్లీషులో, హిందీలో ప్రింటు చేయించారు. కొన్ని లక్షల రూపాయలు వసూలు చేసి, ఢిల్లీకి దాదాపు 20కి.మీ. దూరంలో వున్న హర్యానాలోని ఫరీదాబాద్ సమీపంలో ఐదెకరాల స్థలం కొని, పార్టీ స్కూల్ కోసం శాశ్వత భవనాన్ని నిర్మించారు. ఇప్పుడది కోట్ల రూపాయల ఖరీదు చేస్తుంది. పార్టీ ఎడ్యుకేషన్ పార్టీ సభ్యుల సైద్ధాంతిక స్పష్టతను, రాజకీయ నిబద్ధతను కలిగిస్తుంది. రాజశేఖర్ ఆ దిశగా తీవ్రమైన కృషి సాగించారు. విద్యార్థి రంగంలో పార్టీ ఎడ్యుకేషన్‌లో ఆయన కృషి పార్టీకి దీర్ఘకాలం పెట్టుబడిగా ఉపయోగపడింది. కామ్రేడ్ రాజశేఖర్ స్వయంగా మంచి టీచర్. ఓపికగా, పార్టీ సభ్యుల స్థాయిని బట్టి తేలిక భాషలో వివరించి బోధించేవారు. బహిరంగసభలో కూడా, రెచ్చగొట్టే ఆందోళనకారుడి కంటే, వివరించి బోధించే ఉపన్యాసకుడిగానే ఆయనకు గుర్తింపు వచ్చింది.

రాజశేఖర్‌కు పార్టీ నిర్మాణంపై మంచి పట్టు వుండేది. వివిధ జిల్లాల సమస్యలను లోతుగా, నిశితంగా అధ్యయనం చేసి, అర్థం చేసుకునేందుకు ప్రయత్నించేవారు. ఆ నాయకులతో వివరంగా చర్చించి సలహాలిచ్చేవారు.

ఆయన తనకు నచ్చని విషయాలను నిర్మొహమాటంగా విమర్శించేవారు. విమర్శలో చాలా కరకుగా వుండేవారు. కొన్ని పర్యాయాలు ఇబ్బందిగా, బాధాకరంగా వుండేది. అయితే ఆయన ఆ విషయాలను మనసులో వుంచుకునే వారు కారు.

మార్క్సిజం-లెనినిజంలో అనేక మంది కమ్యూనిస్టు నాయకులులాగే రాజశేఖర్ ఒక నిరతంతర విద్యార్థి. సైద్ధాంతిక గ్రంధాలను నిరంతరం అధ్యయనం చేసేవాడు. ఆ విషయాలు సహచర కామ్రేడ్స్‌తో చర్చించేవారు.

పార్టీ కేంద్రంలో ఒకసారి చర్చ వచ్చింది. సీనియర్ నాయకులు కొందరు రిటైర్ కావాలని, యువకులకు, కొత్తవారికి ప్రమోషన్‌కు అవకాశం కల్పించాలని ఒక సూచన వచ్చింది. యువతకు ప్రమోషన్ విషయంలో ఎప్పుడు ముందుండే కామ్రేడ్ రాజశేఖర్ ఆ సూచనను బలపరచి, తనంతకు తానే బాధ్యతల నుండి రిటైర్ అవుతున్నట్లు ప్రకటించి అందరిని ఆశ్చర్యచకితులను చేసారు. కానీ హైదరాబాదులో వుండి, రెగ్యులర్‌గా ఆఫీసుకు వస్తూ పార్టీ నాయకత్వానికి అవసరమైన సూచనలిస్తూ సహాయపడ్డారు.

అరుదైన వ్యక్తిత్వంతో ఆదర్శ కమ్యూనిస్టుగా జీవితాంతం కృషిచేసిన ధన్యజీవి కామ్రేడ్ రాజశేఖర్.

**ప్రపంచ కార్మికుల విముక్తి కోసం మార్క్సు అనుభవించని కష్టాలు లేవు. భరించని బాధలు లేవు. లండన్‌లో నివసిస్తున్నప్పుడు మార్క్సు కుటుంబం అనుభవించిన దారిద్ర్యాన్ని వర్ణిస్తూ ఆయన భార్య ఒక మిత్రునికి రాసిన జాబు చదువుతూ వుంటే కంట తడి పెట్టకుండా వుండలేం. ఆయన జీవితమే కమ్యూనిస్టు నీతికి దర్పణం.**

***- కంభంపాటి "కమ్యూనిస్టు నీతి" నుండి.***



మహేంద్ర, గిరిప్రసాద్, సుధాకర్‌రెడ్డిగార్లతో



మొహిన్‌సేన్, పెరిన్, జడ్.పి. అహ్మద్ గార్లతో



ఇంద్రజిత్‌గుప్తాతో



సి.ఆర్., తమ్మారెడ్డి కృష్ణమూర్తిగార్లతో

# నిక్కమైన నీలం



\- సి. రాఘవాచారి

అర్థ శతాబ్దం పాటు అవిశ్రాంత ప్రజాసేవలో ఎర్రని పదునెక్కిన జీవితం కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డిది; సిద్ధాంతవేత్తగా, తర్కబద్ధమైన జిజ్ఞాసాపరునిగా, కార్మిక, కర్షక ఐక్యతా నిబద్ధత నిండైన విప్లవమూర్తిగా, ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు ఉద్యమంలో తనదైన విశిష్ట స్థానాన్ని స్ఫూర్తివంతమైన వారసత్వంగా, శ్రామిక ప్రజోద్యమ విశాల పరివారానికి విడిచి వెళ్లారు. కొన్ని నెలలు అనారోగ్యంతో బాధపడుతూనే చివరి శ్వాస విడిచేవరకు కమ్యూనిస్టు ఉద్యమ సమైక్యతకై పరితపించి పోయిన ఆదర్శజీవి. ధనికరైతు కుటుంబంలో పుట్టి పెరిగినా జాతీయోద్యమ సాంప్రదాయాల్ని, దేశసేవా పరాయణతను పుణికి పుచ్చుకున్న నేపథ్యంలో విద్యార్థి దశనుండే విప్లవ సిద్ధాంతాలవైపు ఆకర్శితులై నిండు జీవితం ఆ లక్ష్య సాధనకై ధారవోసిన అకుంఠిత దీక్షా తపస్వి. స్వాతంత్ర్యోద్యమంలో చురుకుగా పాల్గొని బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో చదువుతున్న రోజుల్లోనే సహవిద్యార్థులుగా వున్న కమ్యూనిస్టు విప్లవ కారులతో సాన్నిహిత్యం ఏర్పరచుకొని అజేయమైన మార్క్సిజం మూల సూత్రాల్లో అభేద్యమైన విశ్వాసం సంతరించుకున్నది కామ్రేడ్ రాజశేఖరరెడ్డి సమరశీల పోరాటాల జీవితం. జాతీయోద్యమానికీ, కమ్యూనిస్టు విప్లవోద్యమానికీ గల ఉమ్మడి విలక్షణాలు కలబోసిన ధీరోదాత్త వ్యక్తిత్వం ఆ మహనీయునిది. పార్టీలో ఎప్పుడే పదవుల్లో వున్నా పీడిత ప్రజల సమీకరణ, సంక్షేమానికి జరిపిన కృషే ఊపిరిగా ఉత్తేజకరమైన విప్లవకారునిగా భావితరాలకు అనన్యసాధ్యమైన ఆదర్శాన్ని మిగిల్చి మొన్న వెళ్లిపోయారు.

ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు ఉద్యమేతిహాసంలో రాష్ట్ర పార్టీ కార్యదర్శిగా దీర్ఘకాలం ఒక దశాబ్దం పాటు బాధ్యతలు నిర్వహించిన ప్రముఖుల్లో రాజశేఖరరెడ్డిదో ప్రత్యేకస్థానం. ఆ కాలంలో కమ్యూనిస్టు ఉద్యమం రాష్ట్రంలోనే కాక దేశంలో, ప్రపంచంలో క్లిష్టమైన సిద్ధాంత రాజకీయ నిర్మాణ సమస్యలతో సతమతమవుతున్న సున్నిత పరిస్థితుల్లో ఉమ్మడి పార్టీని ఎడాపెడా రెచ్చిన విచ్ఛిన్నకర ధోరణుల నుండి పరిరక్షించడంలో అమోఘమైన కృషికి ఆయన సీనియర్ కమ్యూనిస్టు కార్యకర్తల శ్రేణుల్లో సర్వదా సంస్మరణీయుడిగా శాశ్వతత్వం సంతరించుకున్నారు. తెలుగునాట జాతీయోద్యమం ఉవ్వెత్తున సాగి అగణిత సంఖ్యలో యువత దేశ దాస్య విమోచనకై దీక్షాధారులై కొదమసింగాల్లా విజృంభించిన తరుణంలో అనంతపురం జిల్లాలో ఆ ఉద్వేగ భరితమైన సన్నివేశంలో రాజశేఖరరెడ్డి ప్రాపంచిక దృక్పథం కరకు తేలింది; కల్లూరి సుబ్బారావు, పప్పూరి రామాచార్యులు, అగ్రజులు నీలం సంజీవరెడ్డి ప్రభృతుల సాహచర్యంలో ఆ

**1994** డిశంబరు **15** తేదీ విశాలాంధ్ర సంపాదకీయం. నాటి సంపాదకులు కామ్రేడ్ చక్రవర్తుల రాఘవాచారి గారి కలం నుండి పరవళ్ళు త్రొక్కి ప్రవహించిన సాహితీ వాహిని.

దేశభక్త ఉద్యమంలో స్నాతకుడై సమాజం అనాదిగా ఎదుర్కొంటున్న మౌలిక సమస్యలకు హేతుబద్ధ పరిష్కారాలు క్రాంతదర్శులయిన కారల్ మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌ల దార్శనిక ప్రభావంలో రూపుదిద్దుకున్న శాస్త్రీయ సోషలిజంలోనే సుసాధ్యమని నమ్మి ఆ దిశగా పదునైన తన ఆలోచనలను మళ్లించిన జిజ్ఞాసువు కామ్రేడ్ రాజశేఖరరెడ్డి; ఇక తదాది ఆ సిద్ధాంతపు వెలుగులో విశ్వ పరివ్యాప్త పరిణామాలను, దేశ, రాష్ట్ర సంఘటనలను సునిశితమైన విశ్లేషనాత్మక ధోరణిలో పరిశీలించే విప్లవ తత్వం అలవరచుకొన్న భారత కమ్యూనిస్టు శ్రేణుల్లోనూ పొడసూపిన విభేదాలు, అస్తవ్యస్త ధోరణులన్నీ తాత్కాలికంగా మౌలిక మార్గం నుండి వైదొలగిన మినహాయింపులేననీ, అంతిమంగా పునరేకీకరణ సంఘటన అనివార్యమైన గమ్యమన్న వజ్ర సన్నిభమైన విశ్వాసంతో, ఆశాభావంతో కన్ను మూసిన క్రాంత తపస్వి కామ్రేడ్ రాజశేఖరరెడ్డి; ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమశ్రేణులకు ఎనలేని ఉత్తేజం కలిగించిన అక్టోబరు మహావిప్లవ సద్యః ఫలమైన సోవియట్ యూనియన్ సహా కొన్ని దేశాల్లో ఆటుపోట్లు ఎదురైనా శాస్త్రీయ సోషలిజమే పీడిత జన విముక్తికి అనన్యమైన ఆలోచన ధారగా అనుష్టించిన ఆదర్శ విప్లవ సేనాని కామ్రేడ్ రాజశేఖరరెడ్డి. భారత కమ్యూనిస్టు ఉద్యమంలో విభేదాల దశ తుడిచిపెట్టుకొని పోయి సమైక్య కార్యాచరణల దిశగా ఆవిష్కృతమైన సానుకూల పరిణామాల పట్ల సంతృప్తితో రాజశేఖరరెడ్డి కన్నుమూశారు.

తెలుగు ప్రజల్లో సామ్యవాద భావాల ఉద్దీపనానికీ, శ్రామికుల్ని సంఘటిత సామాజిక శక్తిగా సమీకరించడానికీ, కార్మిక కర్షక వర్గ సంఘాల నిర్మాణంలో కమ్యూనిస్టు పార్టీ నిర్వహించిన పోరాటాల చరిత్రలో ప్రాతః స్మరణీయులైన విప్లవయోధులు పుచ్చలపల్లి సుందరయ్య, చండ్ర రాజేశ్వరరావు, మద్దుకూరి చంద్రశేఖరరావు, తరిమెల నాగిరెడ్డి, రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, మగ్దుం మొహియుద్దీన్ ప్రభృతుల సరసనే దానికి పుష్టి చేకూర్చిన కామ్రేడ్ రాజశేఖరరెడ్డి పాత్ర; అది అవిస్మరణీయం. కష్టకాలంలో రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శిగా, జాతీయ కార్యవర్గ, కార్యదర్శివర్గ సభ్యునిగా ఉమ్మడి పార్టీలోనూ, ఆ తర్వాత నిర్వహించిన పాత్ర భావితరాల కమ్యూనిస్టు శ్రేణులకు అనుసరణీయమైన ఆదర్శమన్నది వక్కాణించాల్సి వుంది. తాత్కాలిక ప్రభంజనాలకూ, ప్రకోపనాలకూ, మకిలి ఆలోచనలకు తళుకు బెళుకులకు భ్రమసి నిసర్గమైన వర్గ దృక్పధాన్ని నీరసానికి గురి చేయకుండా హేతువు, భౌతిక వాస్తవికతలపై ఆధారపడిన మేధో సృజన, ఉద్యమ నిబద్ధత, వ్యక్తిగత జీవితంలో నీతి నిజాయితీలను ఆసాంతం అంకిత దీక్షతో అనుష్ఠించడమే ఆ మహనీయుని విప్లవ స్మృతికి మనం అర్పించగల శ్రద్ధాంజలి; నివాళి. తర్కబద్ధమైన ఆలోచనా సరళి, అందుకు ఫలితమైన స్పష్టత, దానికి దీటైన క్లుప్తతా, పదునైన భాషలో కామ్రేడ్ రాజశేఖరరెడ్డి మేధస్సు, మనస్సు ఆవిష్కరింపజేసే తీరు శ్రోతలపై చెరగని ముద్రవేసి తీరుతుంది; అది సిద్ధాంత

రాద్ధాంతాలైనా, సమకాలీన రాజకీయ పరిణామాలపై వివాదాలైనా ఆయన అనవసరమైన శబ్దలౌల్యక్షుద్ర ఉల్బణాలకు ఆస్కార మివ్వకుండా పూర్వాపర వివేచనతో విశ్లేషించే విధానం అనేక సందర్భాల్లో గందరగోళం నివారింప బడేందుకెంతైనా దోహదకరంగా వుండేది. ఆలోచనలు ఎంత నిశితంగా వుండేవో వాటిని ప్రకటించే విలక్షణమైన ఆయన శైలీ విన్యాసం కూడా సమస్యల లోతుపాతుల్ని చక్కగా అవగాహన చేసుకోడాని కుపకారిగా వుండేది. ఎంతటి తీవ్రమైన సమస్యలపై గర్జనలు, గాండ్రింపుల ఉద్రేక ప్రసంగాలతో ఉరుకెక్కిన సందర్భాల్లో నైనా రాజశేఖరరెడ్డి గారి ప్రసంగం కొరకు అందరూ ఉత్కంఠులై నిరీక్షించడంలో పరమార్థం, ప్రయోజనం అది.

మార్క్సిస్టు సిద్ధాంత అధ్యయన విద్యారంగాల్లోనూ, ప్రచురణల విభాగంలోనూ జాతీయ కార్యదర్శిగా దేశంలోని కమ్యూనిస్టు కార్యకర్తలకు, పదులు వందల సంఖ్యలో మెదడు పదును ఎక్కడానికి వీలైన బృహత్తర కార్యక్రమాల్ని చాలా సమర్థవంతంగా నిర్వహించి పార్టీ విద్యావ్యవస్థ విస్తరణ క్రమంలో కులపతిగా రాణించారు. వీటితోబాటు అందరికీ అంతగా తెలియని అంశం మన సాహిత్య సంగీతాల్లో రాజశేఖరరెడ్డి గారి కున్న ఆసక్తీ ఆదరణలు, తీరికలేని రాజకీయ వ్యవహారాల్లో ఏ కొంచెం అవకాశం చిక్కినా సాహిత్య సంగీతాల్లో పురోగామి సంస్కార విలసితమైన పార్శ్వాల మధురిమల ఆస్వాదనలో పొద్దు పుచ్చేవారు; జి.జె.రామారావు వంటి మిత్రుల వద్ద యం.యస్. (సుబ్బలక్ష్మి), యం.యల్.వి. (వసంత కుమారి) పాటల కాసెట్లు పెట్టించుకొని ఆనందించేవారు. నిర్మోహమాటం, నిష్కాపట్యం, నిజాయితీ, నిప్పులాంటి నిజానికి తప్ప మరెందుకూ ఆయన జీవితంలో విలువ యివ్వలేదు. అందుకే ఎన్నో అవకాశాలున్నా అన్నీ తృణప్రాయంగా త్యజించి కమ్యూనిస్టు యోధుల్లో ఈ గణనకు పాత్రులయ్యారు. నిక్కమైన మంచి నీలమొక్కటి చాలని జీవితం కాచి వడపోసిన వేమన సూక్తి అస్తమయంతో శోక సంతప్తులైన సహధర్మచరి మాతృమూర్తి లీలావతి గారికీ, కుటుంబ సభ్యులకు, అసంఖ్యాక కమ్యూనిస్టు పరివారానికీ మా ప్రగాఢ సానుతాపం, కామ్రేడ్ రాజశేఖరరెడ్డీ - నీవెప్పుడూ అమరుడివే. నీకివే మా లాల్‌సలాం.
విలాపాశ్రువుల విప్లవ జోహార్లు!
వేవేలు జేజేలు!!

**మార్క్సు ఒక సందర్భంలో తన కతి ప్రియమైన సద్గుణం నిరాడంబరత అనీ, ప్రధాన లక్షణం ఏకాగ్రత అనీ, సౌఖ్యమనగా తన భావం పోరాడ్డమనీ తెలియజేశారు. అన్నిటికంటే తను ఎక్కువగా అసహ్యించుకొనే దుర్గుణం దాస్యగుణం అన్నారు.**

***- కంభంపాటి గారి కమ్యూనిస్టు నీతి అన్న గ్రంథం నుండి***




నీలం రాజశేఖరరెడ్డి రీసెర్చి సెంటర్ భవనం స్కెచ్,



రీసెర్చి సెంటర్ నెలకొల్ప నిర్ణయించడం
రాజశేఖర్‌కు సముచితమైన నివాళి

# రాజశేఖర్ గురించి నా జ్ఞాపకాలు

**- వేములపల్లి శ్రీకృష్ణ**

కామ్రేడ్ సి.ఆర్. అనారోగ్యంతో నిమ్స్ హాస్పిటల్‌లో చికిత్స పొందుతున్న రోజుల్లో కామ్రేడ్ రాజశేఖర్, నేనూ తరచు కలుస్తూ వుండేవాళ్లం. మా యిద్దరి యిళ్లూ చాలా దగ్గరలో వుండేవి. తాను మా యింటికి రావటమో, నేను వాళ్ళ యింటికి వెళ్లటమో జరిగేది. అప్పుడప్పుడూ సాయంకాలం మధురానగర్‌వైపు వాక్‌కు వెళ్తుండేవాళ్లం. మేముండేది యూసఫ్‌గూడా. సి.ఆర్. వైద్యం, ఆరోగ్యం గురించి ఒక చర్చనీయాంశం. రోజు విడిచి రోజు - ఒకొకప్పుడు రోజూ - వంతులు వేసుకునైనా వెళ్లేవాళ్లం. ఆయనకు కూడా కొంత కాలక్షేపంగా వుంటుందనిగూడా ఆ పని చేసేవాళ్లం.

పార్టీ నిత్య కార్యకలాపాలు తగ్గించుకుని విశ్రాంతి పొందుతున్న సమయం కావటం వల్ల పార్టీ జీవితంలో అనుభవాలను విధానాలను, జయాపజయాలను, నిర్మాణ సమస్యలను, నాయకులూ, కేడరుకు సంబంధించిన అభిప్రాయాలను నిర్మొహమాటంగా దాపరికం లేకుండా మాట్లాడుకోవటం జరిగేది. సమకాలీనులం కావటం - నా కన్నా రెండేళ్లు చిన్న కావడం వల్ల మా మధ్య అదివరకెప్పుడూ లేనంత సాన్నిహిత్యం పెరిగింది.

"వి.యస్.కె.! గుడ్డి కాంగ్రెస్ వ్యతిరేకత నష్టం కలిగించిందని అనుభవం వల్ల గుర్తించాను. కాని, నీ అంత దూరం రాలేకపోతున్నాను'' అన్నాడు. నేను వాళ్ల వాకిట్లో అడుగు పెడుతుండగానే, "నేను ఎంత దూరం వెళ్లాను? నీవు అనుకున్నంత దూరం వెళ్లి వుంటే యు.సి.పి.ఐ.లో వుండేవాణ్ణి. డాంగే మీద నాకున్న అభిమానం, భటిండాలోనే అటు లాగేది. నేను డాంగే ప్రత్యామ్నాయ పత్రానికి ఓటు చేయలేదు'' అన్నాను. ఆ చర్చ కొనసాగకుండా ఇంతలో ఎవరో రావటం వల్ల అంతరాయం కలిగింది.

ఈ సంఘటన కామ్రేడ్ రాజశేఖర్ మీద, నా అభిమానాన్ని మరింత పెంచింది. రాజశేఖర్ రాష్ట్ర పార్టీ కార్యదర్శిగా వున్నపుడు నేను రాష్ట్ర కార్యదర్శివర్గంలో వున్నాను. (గుంటూరు జిల్లా కార్యదర్శిగా వున్నాను) ఆయనగారు కేంద్రనాయకత్వంలో వున్నపుడు రెండు పర్యాయాలు జాతీయ సమితి సభ్యుడుగా వున్నాను. అభిప్రాయాల సారూప్యత వున్న రోజులూ వున్నాయి. భిన్న దృక్పధాలున్న సమయాలూ వున్నాయి. పరిస్థితుల్లో వచ్చే మార్పును గమనించి తన అభిప్రాయాలను సాహసంతో మార్చుకోవటమే గాక దానిని నిర్మొహమాటంగా ప్రకటించటమనేది ఒక గొప్ప లక్షణం.

పార్టీలో సిద్ధాంత, రాజకీయ విభేదాలు తలెత్తి తీవ్రరూపం ధరించి రెండు ముఠాలుగా వ్యవహరిస్తున్న రోజుల్లో కామ్రేడ్ రాజశేఖర్ పోటీలో నెగ్గి రాష్ట్ర కమిటీ కార్యదర్శి అయ్యాడు. అప్పుడే 1962 సాధారణ ఎన్నికలు వచ్చాయి. గుంటూరు జిల్లాలో

కమ్యూనిస్టు పార్టీకి, కృషికార్ లోక్‌పార్టీకి ఎన్నికల ఒప్పందం కుదిరిందనీ, కమ్యూనిస్టు పార్టీకి 11 సీట్లు, కె.యల్.పి.కి 14 సీట్లూ వాటా గూడా కుదిరినట్లు ప్రతికలలో వచ్చింది. నేను జిల్లా కార్యదర్శిగా వుండి ఈ వార్త నిజమైతే జిల్లాలో పార్టీకి చాలా నష్టం జరుగుతుందనీ, ఈ ఒప్పందం కె యల్.పి కీ, కాంగ్రెస్‌కీ ఉపయోగపడుతుందనీ, ఈ వార్తను వెంటనే ఖండించాలనీ చెప్పాను. రాష్ట్ర కార్యదర్శిగా రాజశేఖర్ గుంటూరు వచ్చి పత్రికాగోష్ఠిలో దీనిని ఖండించాడు. తదుపరి అసెంబ్లీ ఎన్నికలు జరిగాయి. కమ్యూనిస్టు పార్టీకి 12, పార్టీ బలపరచిన స్వతంత్రులకు 2 కలిపి మొత్తం 14సీట్లు దక్కాయి. కాంగ్రెసుకు 11సీట్లు వచ్చాయి రాష్ట్రం మొత్తంలో మనకు వచ్చిన 60 సీట్లలో 14 సీట్లు ఒక్క గుంటూరు జిల్లా నుండే వచ్చాయి. ఈ ఫలితాలకు నన్ను అభినందించాడు. కామ్రేడ్ సి.ఆర్. గూడా ఈ విషయంలో పాత్రధారి. ఆసుపత్రిలో మాతో పాటు ఇతర కామ్రేడ్స్ గూడ ఉండగానే ఒక మాట అన్నాడు "దేశాన్ని బి.జె పి.కి కట్టబెట్టాలనా ఢిల్లీలో కూర్చుని చేస్తున్న నిర్ణయాలు" అన్నాడు

1952 నుండి తరిమెల నాగిరెడ్డితో సాన్నిహిత్యం వుండేది. ఇరువురం మద్రాసు అసెంబ్లీలో సభ్యులం. అప్పటి నుండి శాసనసభలోనేగాక బహిరంగసభల సందర్భం లోనూ, రాష్ట్ర కమిటీ సమావేశాలలోనూ తరచు కలుస్తుండేవాళ్లం. రాజశేఖర్‌తో మాత్రం రాష్ట్ర కమిటీ సమావేశాల్లోనే కలిసేవాడిని రాజశేఖర్ రాష్ట్ర కార్యదర్శిగా ఎన్నికైన తర్వాత నాగిరెడ్డికన్నా రాజశేఖర్‌తోనే దగ్గర సంబంధం యేర్పడింది. మా ఇరువురి ఆలోచనల్లో సారూప్యత వుండేది. తాను కార్యదర్శిగా వున్నపుడు నేను కార్యదర్శి వర్గంలో వుండి విశాలాంధ్ర దినపత్రిక ప్రధాన సంపాదకుని బాధ్యత వహించాను. పత్రికను క్షుణ్ణంగా చదువుతూ అభిప్రాయాలు పంపించేవాడు.

నేను శాసనసభలో ప్రధాన ప్రతిపక్ష నాయకుడుగా వ్యవహరిస్తున్నపుడు నాకు గుండెపోటు వస్తే ఉస్మానియా ఆసుపత్రిలో చేర్చారు. డాక్టర్ల సలహా మేరకు అమెరికాలో ఆపరేషన్ నిమిత్తం రాష్ట్ర ప్రభుత్వం 2లక్షల యాభైవేల రూపాయలు శాంక్షన్ చేసి హూస్టన్‌లో ఆపరేషన్ షెడ్యూలు ఖాయపరిచింది. ఆ సమయంలో రాష్ట్రముఖ్యులు ఆ సహాయం తీసుకోవటం మంచిది కాదని అంటే ఆ డబ్బు వాపసు చేశాం. ఈ నిర్ణయం తీసుకోవటంలో కామ్రేడ్ రాజశేఖర్ సలహా గూడా సహాయపడింది. ఈ వార్త తెలిసి కామ్రేడ్ వానమామలై నన్ను అభినందిస్తూ లేఖలు రాశారు. పార్టీ ప్రతిష్ఠను నిలబెట్టేం దుకు సూత్రబద్ధంగా, నిస్వార్థంగా వుండాలన్న ధ్యేయం ప్రధానంగా భావించిన వారిలో రాజశేఖర్ ఒకరు.

బెనారస్ యూనివర్సిటీ విద్యార్థిగా వున్నప్పుడు రాజశేఖర్‌కు పార్టీతో పరిచయం కలిగింది. ఒకే వ్యక్తి సర్వవిజ్ఞాన సంపన్నుడని, అన్ని రంగాలలో ఆరితేరినదిట్ట అని నమ్మేవాడిని కాదు. అది అతిశయోక్తి అవుతుంది. స్టాలిన్‌లాంటి వాడినే అతిగా పొగిడి

కమ్యూనిస్టు ఉద్యమానికే హాని తెచ్చుకున్నాం. నాగిరెడ్డి ఒక ప్రజానాయకుడుగా ఖ్యాతి గడించాడు. ఒక పార్లమెంటేరియన్‌గా పేరు తెచ్చుకున్నాడు. కామ్రేడ్ సుందరయ్య, సి.ఆర్.లు త్యాగానికి మారుపేరుగా, కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలుగా కీర్తి గడించారు. కామ్రేడ్ రాజశేఖర్‌కు కమ్యూనిస్టు కార్యకర్తలకు సిద్ధాంత, రాజకీయ శిక్షణ యిచ్చే బాధ్యతను అప్పగించింది. అంతమాత్రంచేత ఇతర కార్యకలాపాలకు దూరంగా వున్నాడని గాదు. రైతు కూలీ పోరాటాలలో విద్యార్థి ఉద్యమాలలో ప్రత్యక్షపాత్ర వహించక పోలేదు. కాని ఆయన కృషి సిద్ధాంత అధ్యయనం, ఇతర నాయకులకు, కార్యకర్తలకు అందించటం ఆయన ప్రధాన బాధ్యత. కేంద్ర నాయకత్వంలో భాగస్వామి ఐన అనంతరం వివిధ రాష్ట్రాల నుండి అర్హులైన వారిని ఎంపిక చేసి ఇతర దేశాలకు సిద్ధాంత రాజకీయ శిక్షణకై పంపేవాడు. ఎంపిక నుండి వారు శిక్షణ పూర్తి చేసుకుని తిరిగి వచ్చేవరకు వారి యోగక్షేమాలు తెలుసుకుంటూ సలహా సహకారాలనిస్తూ ఒక గార్డియన్‌లాగా వ్యవహరించేవాడు. అప్పుడప్పుడూ ఆ దేశాలకు వెళ్ళి వారి కృషిని స్వయంగా పరిశీలించేవాడు. వివిధ రాష్ట్రాలలోనూ, కేంద్రంలోనూ జరిగే శిక్షణా తరగతు లకు సిలబస్ తయారు చేయటంలో అవసరమైన అందరి సహాయం తీసుకుని తయారు చేసేవాడు. ఏ బాధ్యత తీసుకున్నా పకడ్బందీగా 'ఎ టు జడ్' ప్లాను చేసుకునేవాడు.

చనిపోయే ముందు హైద్రాబాద్‌లో అధ్యాపకుల శిక్షణా శిబిరంలో పునః పరిశీలన తో సిలబస్ తయారుచేయటానికి నాతో గూడా చర్చిం చాడు. నేను కమిటీలో సభ్యుణ్ణి కాకపోయినా నా సలహా సహకారం గూడా కావాలన్నాడు. ఈ సమస్య మీద నిర్విరామ కృషి చేశాడు. ఫలితం పొందే అవకాశం లేకపోయింది. నూతన అవగాహనతో పరిస్థితు లను అంచనా గట్టి రాజకీయ శిక్షణ యివ్వాలన్న సంకల్పం కలిగింది. తాను సిద్ధాంత గ్రంధాలతో పాటు ఇతర సాహిత్యం కూడా ఎంతగానో అధ్యయనం చేసేవాడు. సచిత్ర వారపత్రికలలో వచ్చే కథానికలు, సీరియల్స్, నవలలు, సాహిత్య చర్చలేగాక ఇతర అనేక ప్రామాణిక గ్రంథాలు చదివేవాడు. యం.యస్.సుబ్బలక్ష్మి సంగీతమంటే ఎంతో ఆసక్తి. కర్నాటక సంగీత విద్యాంసులు, ఇతర శాస్త్రీయ, వాయిద్య విద్వాంసుల సంగీతం టి.వి.లో వినే అలవాటు. చదవటం, వినటమేగాక నిశిత పరిశీలన, విమర్శనా దృష్టి వుండేవి.

పార్టీ కేంద్ర కార్యాలయంలో జోషీ, అధికార్ల పేరుతో రిసెర్చి సెంటరు నెలకొల్ప టంలోగానీ, ఈ రిసెర్చి సెంటరు అధ్యయన శిక్షణా కేంద్రానికి స్థలం సేకరించి పునాదులు వేయటంలో గాని రాజశేఖర్ పాత్ర ఎంతగానో వుంది.

జనరల్ బాడీ సమావేశాల్లో మాట్లాడినా, బహిరంగసభల్లో మాట్లాడినా పొందికగా, ఒక్క వ్యర్థ పదం గూడా లేకుండా, చెప్పిందే రెండుమూడుసార్లు చెప్పకుండా సరళశైలిలో పండు వలిచిపెట్టినట్లు అర్థమయ్యేలా మాట్లాడే నైపుణ్యం ఆయన సొత్తు.

మంగళగిరిలో ఒక పెద్ద బహిరంగసభలో మేమిద్దరం ఉపన్యాసకులం. ముందు నన్ను మాట్లాడమన్నాడు. యన్.టి.ఆర్. అప్పటికి బ్రతికేవున్నాడు. మాకు మిత్రత్వం వుంది. విమర్శకు యింకా దిగలేదు. నా ఉపన్యాసంలో సమస్యల మీద స్నేహపూర్వక విమర్శ చేశాను. నా ఉపన్యాసం ముగిసిన తర్వాత ఇలాంటి విమర్శ అవసరమే అన్నాడు. ప్రతి విషయాన్నీ ఆలోచించి నిర్ణయానికి వచ్చే స్వభావం ఆయనిది.

చెన్నారెడ్డిగారి నాయకత్వాన ప్రత్యేక తెలంగాణా ఉద్యమం తర్వాత శాసనసభ ఎన్నికలు వచ్చాయి. రాష్ట్ర ఎన్నికలలో పార్టీ వైఖరిపై రాష్ట్ర కార్యవర్గంలో చర్చ జరుగుతోంది. ప్రత్యేక తెలంగాణా సమితితో ఎన్నికల సర్దుబాటు చేసుకోవాలని రాజశేఖర్ అభిప్రాయం. తమ్మారెడ్డి దానికి వ్యతిరేకం. నేను విశాలాంధ్రలో వేర్పాటు ఉద్యమాన్ని విమర్శిస్తూ మూడు వ్యాసాలు వ్రాశాను. కార్యవర్గంలో ఎక్కువమంది సర్దుబాట్లకు వ్యతిరేకం. "భిన్నమైన అభిప్రాయంతో నేను ప్రచారానికి నాయకత్వం వహించటం కష్టం గనుక కార్యదర్శిగా తప్పుకుంటా"నన్నాడు. భిన్నాభిప్రాయం వున్నంత మాత్రాన బాధ్యత నిర్వహించడం కష్టంగాదనీ, ఆ సమయంలో రాజీనామా అపోహలకు దారి తీస్తుందనీ అందరం చెప్పిన మీదట అంగీకరించాడు. ఎన్నికల నిర్వహణ శక్తి వంచన లేకుండా కొనసాగించాడు. వ్యక్తిగత ప్రతిష్ఠకు పెనుగులాడకుండా పార్టీ ప్రయోజనాన్ని పరిరక్షించటం ముఖ్యంగా చూచేవాడు.

"ఈ నూతన పరిణామాలు ప్రారంభమైన చారిత్రక అంశాలను, సిద్ధాంత పరమైన సూత్రీకరణలను, ఎత్తుగడలో దొర్లిన తప్పులను, తదితర విషయాలన్నింటి మీద నిశితమైన పరిశీలన చేసుకుని, దాని గుణపాఠాలను గుర్తించి తమ కార్యక్రమాలను, కార్యకలాపాలను పునర్వ్యవస్థీకరించుకోగలిగితే కమ్యూనిస్టు ఉద్యమం పునరుజ్జీవం పొంది, తిరిగి పురోగమించగలదని గట్టిగా విశ్వసించవచ్చు".

"ఒక సోషలిస్టు వ్యవస్థ అమాంతంగా కూలిపోవటం కేవలం దానికి నాయకత్వం వహిస్తున్న వ్యక్తుల తప్పుల వలనే జరిగిందని అనుకోవటం మార్క్సిస్టు చారిత్రక అవగాహన కాదు. ఈ మార్పులకు సరైన పరిశీలన భవిష్యత్తులో మరింత లోతుగా వస్తుగతంగా జరుగుతుంది".

"గతంలో కమ్యూనిస్టు పార్టీలు ఉమ్మడిగా చేసుకున్న సూత్రీకరణలు కొన్ని విసర్జించవలసి ఉంటుంది. ఉదాహరణకు పెట్టుబడిదారీ వ్యవస్థ యొక్క సాధారణ సంక్షోభం ఆ వ్యవస్థ కూలిపోవటానికి దారి తీస్తుందని విశ్వసించారు. అలాగే సోషలిస్టు శిబిరం ప్రధానమైన పారిశ్రామిక, వ్యవసాయక ఉత్పత్తి రంగాలలో పెట్టుబడిదారీ ప్రపంచాన్ని సమీప భవిష్యత్తులోనే అధిగమించుతుందని కూడా ఆశించాం. శాస్త్ర సాంకేతిక విప్లవం సాధించిన సాంకేతిక పరిజ్ఞానాన్ని పెట్టుబడిదారీ వ్యవస్థ ఉపయోగించుకోలేదని సూత్రీకరించాం" ఇటువంటి సూత్రీకరణలన్నింటినీ ఇటీవల చారిత్రక

అనుభవం వమ్ముచేసింది. అందుచేత కమ్యూనిస్టు పార్టీలు ఈ సమస్యల మీద ఆత్మ విమర్శనా వైఖరితో పరిశీలన చేసి, వాస్తవిక పునాదుల మీద నూతన అవగాహన రూపొందించుకోవలసి వుంటుంది''.

''కమ్యూనిస్టు పార్టీలు - ముఖ్యంగా వర్ధమాన దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలు ఈ నేపథ్యంలో తమ కార్యకలాపాలను రూపొందించుకోవలసి వస్తుంది. తమ దేశాలలో అసంపూర్ణంగా మిగిలిపోయిన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం ఈ నూతన పరిస్థితులలో నిర్వహించవలసి వుంటుంది''.

పై వాక్యాలు విశాలాంధ్ర 40వ వార్షికోత్సవం సందర్భంగా 1992 జూన్ 22న ప్రచురించిన ప్రత్యేక సంచికలోనివి.

కొందరు నాయకులు చనిపోయిన అనంతరం బయటబడ్డ లేఖలు, పత్రాల ద్వారా వారి ఆలోచనలో కలిగిన మార్పులు తెలియవచ్చాయి. రాజశేఖర్ వ్యాసరూపంలో వెలువరించిన ఈ ఆత్మ విమర్శనాపూర్వక వ్యాఖ్యలను అభివృద్ధి చేసి, పార్టీలో సరైన విధాన రూపకల్పనకు తోడ్పడవలసిన సమయంలో మనల్ని విడిచిపోవడం విచారకరం, గొప్పలోటు. ఆదర్శజీవి, పోరాటాల సారధి రాజశేఖర్‌కు ఆత్మీయుడు సహచరుడూ ఐన సి.ఆర్.పేరుతో నెలకొన్న ఫౌండేషన్ ఆవరణలో, రాజకీయ శిక్షణకు, అధ్యయనానికి ప్రాధాన్యం యిచ్చిన రాజశేఖర్ పేరుతో ఒక రిసెర్చి కేంద్రాన్ని స్థాపించుటకు నిర్ణయం జరిగింది. ఇది అత్యంత సముచితమైన నిర్ణయం.

సి.ఆర్. ఫౌండేషన్ కార్యదర్శిగా నన్నుండమని రాజశేఖర్ కోరినప్పుడు, ఆయన మీద వున్న గౌరవంతో అమెరికాలో వుండి కూడా నా ఆమోదాన్ని తెలియచేసినాను. సి.ఆర్. ఫౌండేషన్‌కు అధ్యక్షుడయ్యే గౌరవం రాజశేఖర్‌కు దక్కింది. రాజశేఖర్ మరణానంతరం ఆ పదవికి శ్రీ వచ్చాసుపల్లి నాగేశ్వరరావుగారు ఎన్నికైనారు.

**ఐక్యత అనేది మన ప్రజలకీ, పార్టీకి వున్న గొప్ప అమూల్యమైన సంప్రాయం. కేంద్ర కమిటీ నుంచి, శాఖదాకా కామ్రేడ్స్ అందరూ పార్టీ ఐక్యతను, దీక్షను కంటి పాపలాగా కాపాడుకోవాలి. మనది అధికారంలో వున్న పార్టీ. ప్రతి పార్టీ సభ్యుడు, పార్టీ కార్యకర్తా విప్లవ నైతికతతో తేజరిల్లాలి. పట్టుసడలని పరిశ్రమ, పొదుపరితనం, నిజాయితీ, రుజువర్తన, అంకితభావం ప్రజా ప్రయోజనాల పట్ల కలిగి వుండాలి. స్వార్థం అనేది యే కోశానా వుండకూడదు. మన పార్టీ సొడ్డు పెట్టకోడానికి వీల్లేని స్వచ్ఛతను పదిలం చేసుకోవాలి. ప్రజల విశ్వాసపాత్రమైన సేవక భావం నాయకత్వ లక్షణం ప్రతిబింబించేందుకు తగ్గట్టు వుండాలి.**

*- హోచిమన్*




ప్రొఫెసర్ సి. నరసింహారావు, డా॥ సి. సమత

గుంటూరు



కా॥ నీలం రాజశేఖరరెడ్డి భవన్
సి.పి.ఐ. విశాఖ జిల్లా పార్టీ ఆఫీసు

# సి.పి.ఐ.ని పటిష్ఠ పరచుటలో రాజశేఖర్ కృషి అద్వితీయం



- వై. విజయకుమార్

కొమ్రేడ్ రాజశేఖరరెడ్డి గారి సతీమణి శ్రీమతి లీలావతమ్మగారు రాజశేఖరరెడ్డిగారిని గురించి రాయమన్న ప్పుడు నేనొకరకంగా సంతోషించాను. మరొక రకంగా కొంచెం బాధ పడ్డాను రాజశేఖర రెడ్డిగారి లాంటి ప్రఖ్యాత కమ్యూనిస్టు నాయకుని, నిస్వార్ధ ప్రజాసేవకుని జీవితవిశేషాలు ప్రచురిస్తున్నందుకు సంతోషించాను. నా ఆరోగ్య పరిస్థితుల దృష్ట్యా ఆయన జీవితానికి సంబంధించి నేనెరిగిన ముఖ్య విశేషాలు కొన్ని జ్ఞాపకం చేసుకోలేక పోయినందుకు బాధపడ్డాను. ఏమైనా నా ప్రియమిత్రుడు, సహచరుడు, ఒక రకంగా నాయకుడు అయిన కామ్రేడ్ రాజశేఖరరెడ్డి గారిని గురించి జ్ఞాపక మున్నంత వరకు రాయడానికి గర్వపడుతున్నాను.

కామ్రేడ్ రాజశేఖర్ రెడ్డి ఒక దేశ భక్త కుటుంబానికి చెందిన వాడని చెప్పాలి. ఆయన అన్న గారైన నీలం సంజీవరెడ్డిగారు జాతీయ కాంగ్రేసులో ప్రముఖ నాయకుడు రాష్ట్రంలో కాంగ్రేసు మంత్రిగాను, కేంద్ర మంత్రి గాను, చివరకు భారతదేశ అధ్యక్షునిగారూ ఆయన గణతికెక్కారు. ఆయన తమ్ముడు కామ్రేడ్ రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి గార్లు బెనారస్ హిందూ విశ్వ విద్యాలయంలో చదువుకునే రోజులలో కామ్రేడ్ భరద్వాజ శిష్యులుగా కమ్యూనిస్టులుగా అయ్యారు. శ్రీ నీలం సంజీవరెడ్డి గారు కాంగ్రేసు ద్వారాను, కామ్రేడ్ రాజశేఖరరెడ్డి కమ్యూనిస్టు పార్టీ ద్వారాను దేశానికి, ప్రజల సేవకు అంకితమైన అకుంఠిత దేశభక్తులని చెప్పక తప్పదు.

అంతకు ముందు రాజశేఖర రెడ్డి గారితో నాకు కొద్దిగా పరిచయమున్నా నేను విశాఖపట్నంలోను ఆయన అనంతపురంలోను వుండడం వలన ప్రత్యక్ష పరిచయం లేదు. మా యిద్దరికీ ప్రత్యక్ష సన్నిహిత పరిచయం 1947 జనవరిలో కలిగింది. 1947 జనవరి 22వ తేదీ అర్ధరాత్రి అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రిగా వున్న ప్రకాశం పంతులుగారు అకస్మాత్తుగా ఆర్డినెన్స్‌ను ప్రకటించి దొరికిన కమ్యూనిస్టు నాయకులందరిని అరెస్టు చేసి రాయవెల్లూరు జైలులో నిర్బంధించారు. ఆంధ్ర నుండి అరెస్టయిన వారిలో నేనూ, రాజశేఖర రెడ్డి, నాగిరెడ్డి వున్నాము. కేరళ, తమిళనాడు, ఆంధ్ర ప్రాంతాల కామ్రేడ్స్ నందరిని అదే జైలులో నిర్బంధించారు.

జైలులోని కామ్రేడ్స్‌కు రాజకీయ తరగతులు నిర్వహించేవారం. ఇంగ్లీషులో కామ్రేడ్స్ యన్.కె.కృష్ణన్, నంబూద్రిపాద్, దామోదరం క్లాసులు చెపితే, తెలుగులో

నేనూ, రాజశేఖరరెడ్డి, నండూరి ప్రసాదరావు చెప్పేవాళ్ళం. రాజశేఖర్ రాజకీయాలు, నేను అర్థశాస్త్రం, ప్రసాదరావు తత్వశాస్త్రం పాఠాలు చెప్పేవాళ్ళం.

1947 జనవరిలో కామ్రేడ్స్ రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి, నేనూ అరెస్టయ్యేనాటికి మా భార్యలు ముగ్గురూ గర్భిణులు. నాకు గుర్తున్నంత వరకు వారు ముగ్గురూ మేమిలా జైలులో వుండగానే 1947 ఏప్రిల్ నెలలో ప్రసవించారు. కామ్రేడ్ రాజశేఖర్ కొడుకు విజయకుమార్, కామ్రేడ్ నాగిరెడ్డి కూతురు సుజాత, నా కూతురు సవితా పుట్టినప్పుడు మేము దగ్గర లేకుండా పోయాము.

1947 ఆగస్టు 15వ తేదీన భారతదేశం స్వతంత్రమయింది. మమ్మలను వెల్లూరు జైలు నుండి ఆగస్టు 13వ తేదీన విడుదల చేశారు.

అది 1962వ సంవత్సరం ప్రారంభం. చైనా భారతదేశం పైన దాడి చేసింది. ఈ దాడి జరిగిన వెంటనే కామ్రేడ్ డాంగే యీ దాడిని విమర్శిస్తూ పత్రికా ప్రకటన చేశారు. ఒక సోషలిస్టు దేశం మరొక స్వతంత్ర, తటస్థ, స్నేహ దేశంపైన ఆ విధంగా దాడి చేయం అనూహ్యమనీ, తప్పనీ విమర్శించాడు.

చైనా దాడితో కమ్యూనిస్టు పార్టీలో అభిప్రాయ భేదాలు తీవ్రస్థాయికి చేరాయి. చైనాది తప్పని వాదించేవారు కొందరు, చైనాది రైటని వాదించేవారు కొందరు. చంద్ర రాజేశ్వరరావుగారూ, రాజశేఖరరెడ్డిగారూ, మరికొంత మందిమి మేము చైనాది తప్పని వాదించేవాళ్లం. కామ్రేడ్ సుందరయ్య గారి నాయకత్వాన మరికొందరు చైనాది రైటని వాదించేవారు. ఈ అభిప్రాయ భేదాలు తరువాత పార్టీ చీలి పోవడానికి దారి తీశాయి.

1961లో రాజమండ్రిలో జరిగిన రాష్ట్ర పార్టీ మహాసభలో కామ్రేడ్ రాజశేఖరరెడ్డి రాష్ట్ర పార్టీ కార్యదర్శిగా ఎన్నికయ్యాడు. అత్యధికులు సుముఖంగా వున్నందున కామ్రేడ్ రాజశేఖర్ కార్యదర్శిగా ఎన్నికయ్యాడు.

1962 నుండి 1963 ఆఖరువరకు పార్టీలో అంతర్గత చర్చలు తీవ్రస్థాయిలో జరుగుతూనే వున్నాయి. ఒక వైపున కామ్రేడ్స్ సుందరయ్య, బసవపున్నయ్యగార్లు, మరొక వైపున కామ్రేడ్సు చంద్ర రాజేశ్వరరావు, రాజశేఖర రెడ్డిగార్లు ప్రధాన నాయకులుగా చర్చలు జరిగాయి. రాజేశ్వరరావుగారి వ్యక్తిత్వమూ, రాజశేఖరరెడ్డిగారి వాదనాపటిమ మెజారిటీ పార్టీ నాయకులను, సభ్యులను 1964లో పార్టీలో చీలిక తరువాత సిపిఐ లో వుండేటట్లు చేయగలిగాయనడంలో అతిశయోక్తి ఏమాత్రమూ లేదు.

1964లో పార్టీ రెండుగా చీలిపోయింది. సిపిఐ ఒక భాగం, సిపిఐ (మార్క్సిస్టు) మరొక భాగం. సిపిఐకి కామ్రేడ్ రాజశేఖరరెడ్డి కొన్ని సంవత్సరాలపాటు కార్యదర్శిగా వ్యవహరించారు. కామ్రేడ్ రాజశేఖరరెడ్డి కేంద్ర బాధ్యతలు స్వీకరించాక కామ్రేడ్ తమ్మారెడ్డి సత్యనారాయణ రాష్ట్ర పార్టీ కార్యదర్శిగా ఎన్నికయ్యారు.

కామ్రేడ్ రాజశేఖర్ పార్టీ కార్యదర్శిగా వున్న కాలంలో ముఖ్యంగా రెండు విషయాలపైన ఆయన కేంద్రీకరించారు. మొదటిది, చీలిపోయిన తరువాత పార్టీలో నెలకొన్న నిస్పృహను పోగొట్టి పార్టీని నిర్మాణ రీత్యా పటిష్టవంతం చేసేందుకు కృషి. ఆయన హయాం లోనే పార్టీ చీలిపోయిన తర్వాత వూగిసలాటలో వుండి కొంతకాలం పాటు సిపిఐ(మార్క్సిస్టు) పార్టీలో కొనసాగిన వారు- ఖమ్మం జిల్లాలో కామ్రేడ్ గిరిప్రసాద్ నాయకత్వాన అనేకమంది ముఖ్యకామ్రేడ్సు, కృష్ణాజిల్లాలో కామ్రేడ్ తమ్మిన పోతరాజు నాయకత్వాన వున్న కామ్రేడ్సు, విశాఖజిల్లాలో పోతిన సన్యాసిరావు నాయకత్వాన వున్న కామ్రేడ్సు సిపిఐలో చేరారు.

రెండవది, కామ్రేడ్సుకు రాజకీయ శిక్షణ. ఆయన రాష్ట్ర పార్టీ కార్యదర్శిగా వుండగా పార్టీనాయకులకూ కూడ రాజకీయ శిక్షణ యిచ్చేందుకు ప్రత్యేక కృషి చేశాడు. శాఖా కార్యదర్శులకు, పార్టీ సభ్యులకు రెగ్యులర్‌గా పదిరోజుల రాజకీయ పాఠశాలలు, విద్యార్థులకు 20 రోజుల వేసవి రాజకీయ పాఠశాలలు, పార్టీ నాయకులకు 40 రోజుల పాఠశాలలు నిర్వహించబడ్డాయి. నేను అప్పుడు రాష్ట్ర కమిటీ ఎడ్యుకేషన్ సబ్ కమిటీ కన్వీనర్‌ను.

తరువాత కొంతకాలానికి ఆయన కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యదర్శి వర్గ సభ్యుడయ్యాడు. కేంద్ర ఎడ్యుకేషన్ డిపార్టుమెంటు కన్వీనర్‌కూడా అయ్యాడు. అప్పుడు ఆయన అఖిల భారత స్థాయిలో పార్టీ నాయకులకు, సభ్యులకు రాజకీయ శిక్షణ యిచ్చేందుకు సాటిలేని కృషి చేశాడు. మన రాష్ట్రంతో పాటు వివిధ రాష్ట్రాలకు చెందిన పార్టీ నాయకులకు వివిధ సోషలిస్టు దేశాలలో 3 నెలల పాటు రాజకీయ శిక్షణ యిచ్చేందుకు ఏర్పాటు చేసి కొన్ని వందల మంది నాయకులకు శిక్షణ యిప్పించడం జరిగింది. అలాగే హిందీ ప్రాంతాల కామ్రేడ్స్‌కు ఢిల్లీలోను, యితర ప్రాంతాలనుండి ఇంగ్లీషు తెలిసిన కామ్రేడ్సుకు హైదరాబాదులో 20 రోజుల నుండి 30 రోజుల పాఠశాలలు నిర్వహించ బడ్డాయి. ఇప్పటి కేంద్రకమిటీలోనూ, కేంద్ర, రాష్ట్ర సమితులలోనూ సభ్యులుగా వున్నవారు చాలామంది ఆనాటి రాజకీయ పాఠశాలలకు హాజరైన వారే. దాదాపు ఆయన హయాం అంతా నేను కేంద్ర ఎడ్యుకేషన్ డిపార్టుమెంటు సభ్యునిగా వున్నాను.

అలాగే రాజశేఖరరెడ్డి హయాంలో సోషలిస్టు దేశాలలో వివిధ యూనివర్సిటీలలో వైద్య, యింజనీరింగ్ తదితర టెక్నికల్ కోర్సులు చదివేందుకు గతంలో కంటే ఎక్కువమంది విద్యార్థులను ఎంపిక చేసి పంపటం జరిగింది.

అదే విధంగా సోషలిస్టు దేశాలలోని వివిధ యూనివర్సిటీలలో చదువుకుంటున్న భారత విద్యార్థులలోని కమ్యూనిస్టు పార్టీ సభ్యులకు సంవత్సరానికొకసారి సోవియట్ యూనియన్‌లో వారం రోజులపాటు భారతదేశ రాజకీయ, ఆర్థిక, సాంఘిక

పరిస్థితులపైన రాజకీయ పాఠశాలలు నిర్వహించబడేవి. ఒక సంవత్సరం పాఠశాలకు అధ్యాపకులుగా రాజశేఖర్‌తో పాటు నేనూ, దిలీప్‌బోసూ వెళ్లాము.

పార్టీ చీలిపోయిన తరువాత అఖిల భారత సిపిఐ మహాసభ 1964 లో బొంబాయిలో జరిగింది. ఆ మహాసభకు నేను కూడా ప్రతినిధిగా వెళ్లాను. మహాసభ ఆఖరులో జాతీయసమితికి ఎన్నికలు జరిగినపుడు కామ్రేడ్ రాజశేఖరరెడ్డి నా పేరును ప్రతిపాదించగా కాట్రగడ్డ రాజగోపాలరావు నాకు పోటీ వచ్చాడు. అప్పుడు రాజశేఖర్ రాజగోపాలరావును కించపరచకుండానే నా అభ్యర్థిత్వాన్ని బలపరుస్తూ మాట్లాడాడు. దానితో నేను అత్యధిక ఓట్ల మెజారిటీతో గెలుపొందాను. అప్పటినుండి నేను రిటైర్ అయ్యేవరకు జాతీయ సమితి సభ్యునిగాను, కేంద్ర కంట్రోల్ కమిషన్ సభ్యునిగాను కొనసాగాను. తర్వాత రాజగోపాలరావు పార్టీలో నుండి బయటికి పోయాడు. ఇది నేనెందుకు చెబుతున్నానంటే కామ్రేడ్స్‌ను అంచనా వేయటంలో రాజశేఖర్ ఎంత జాగ్రత్తగా అంచనా వేసేవాడో తెలియజేయడం కోసమే.

1967లో అసెంబ్లీకి జరిగిన సాధారణ ఎన్నికలలో విశాఖ సిటిజన్స్ ఫ్రంటు (ఇది విశాఖ ఉక్కు ఫ్యాక్టరీ ఆందోళన సంధర్భంలో ఏర్పాటు చేయబడిన ఫ్రంటు) తరపున శ్రీ తెన్నేటి విశ్వనాధంగారు విశాఖపట్నం అసెంబ్లీ నియోజక వర్గంనుండీ, మా ఊగుల అసెంబ్లీ నియోజక వర్గం నుండి కూడా గెలుపొందారు. మా ఊగుల సీటు అట్టి పెట్టుకొని విశాఖ సీటుకు రాజీనామా యిచ్చారు. 1968లో ఈ సీటుకు బై ఎలక్షన్ జరిగింది. దానికి సిటిజన్స్ ఫ్రంటు తరపున నేను పోటీ చేశాను. భానోజీరావు లాంటి బలమైన అభ్యర్థిపైన పార్టీ సభ్యుడనై వుండి సిటిజన్స్ ఫ్రంటు అభ్యర్థిగా పోటీ చేయడం తప్పని అందుకు నన్ను పార్టీ నుండి సస్పెండు చేయాలని రాజగోపాలరావు పట్టుబట్టారు. ఫ్రంటు అభ్యర్థిగా ఎందుకు పోటీ చేయవలసి వచ్చిందో వివరించి, అది నేరమనుకుంటే నాకు తగిన శిక్ష విధించండని రాష్ట్ర కమిటీకి చెప్పాను. కార్యదర్శిగా వున్న రాజశేఖరరెడ్డి ఆత్మ విమర్శనా పూర్వకంగా పొరపాటును అంగీకరించాడు కాబట్టి ఏ శిక్ష అవసరం లేదని వాదించాడు. దానితో రాష్ట్ర కమిటీ నాకు ఏ శిక్ష విధించలేదు. ఇది ఎందుకు చెబుతున్నానంటే వాస్తవ పరిస్థితులను అర్థంచేసుకుని అందుకు అనుగుణంగా వ్యవహరించేవాడు కామ్రేడ్ రాజశేఖరరెడ్డి అని చెప్పటానికే.

ఇలాంటిదే మరొక వుదంతం. 1970 ప్రాంతంలో నేను కమ్యూనిస్టు పార్టీ మాసపత్రిక "కమ్యూనిజం" కు ఎడిటర్‌గా పత్రికను నిర్వహించేవాడిని. ఒక నెల పత్రిక తీసుకురావటంలో విఫలమయ్యాను. కామ్రేడ్ రాజశేఖరరెడ్డి నన్ను పిలిచి పత్రిక ఎందుకు తీసుకురాలేదు, యింత బాధ్యతా రహితంగా ఎందుకున్నావు అని కొంచెం కఠినంగానే నిగ్గదీసి అడిగారు. నేను ఏ కారణాల వలన పత్రికను సకాలంలో తీసుకు రాలేకపోయానో వివరించాను. పరిస్థితిని అర్థం చేసుకున్న రాజశేఖర్ "సారీ, పరిస్థితి తెలియక నేను

కఠినంగా మాట్లాడాను, క్షమించు'' అన్నాడు. క్రమశిక్షణను వుల్లంఘించి ఎవరి బాధ్యతలను వారు సక్రమంగా నిర్వహించక పోతే ఆయన కఠినంగానే వ్యవహరించే వాడు. అయితే కర్తవ్య నిర్వహణ పట్ల ఎంత నిర్మొహమాటంగా వుండేవాడో అంత దయార్ద్ర హృదయుడు కూడా.

ఆయనలో మెచ్చుకోదగిన మరొక ముఖ్యలక్షణం. ఒక భూస్వామ్య కుటుంబంలో పుట్టి ఉన్నత స్థాయి జీవితాన్ని గడపగలిగిన కామ్రేడ్ రాజశేఖర్ జీవన విధానం ఎంతో సరళంగా వుండేది. ఆహారంగాని, వస్త్రధారణ గాని చాలా సీదా సాదాగా వుండేది. అది మాకు ఆశ్చర్యాన్ని కలిగించేది. ఆదర్శప్రాయంగా వుండేది.

కామ్రేడ్ రాజశేఖర్ మరొక ఆదర్శాన్ని కూడా నెలకొల్పాడు. బహుశా 75 సంవత్సరాలు నిండగానే పార్టీలో ముఖ్య బాధ్యతల నుండి తప్పుకున్నాడు. వయస్సు మీరినా, శక్తి వుడిగినా పదవులకు అంటిపెట్టుకునే వారికి ఆయన ఒక పాఠం నేర్పాడు. ఆయన నెలకొల్పిన ఆదర్శాన్ననుసరించి నేను కూడా నా 75వ ఏట పార్టీలో ముఖ్య బాధ్యతల నుండి తప్పుకున్నాను.

పార్టీలో ఎన్నో ఆదర్శాలను నెలకొల్పిన కామ్రేడ్ రాజశేఖరరెడ్డి ధన్యజీవి. పార్టీ సభ్యుల ఎదలో ఎప్పటికీ చిరంజీవి, మార్గదర్శకుడు, ఆంధ్రప్రదేశ్ గర్వించదగిన మహావ్యక్తి.

చీలికానంతరం సి.పి.ఐ. ని పటిష్ట పరచుటలో రాజశేఖర్ కృషి అద్వితీయం!

**మిల్లులోనో పొలములోనో**
**మిక్కిలి శ్రమించువారు**
**మూగపుడమి పేగులలో**
**మూల్గే ఖనిజాలు త్రవ్వి**
**నల్లని ఆ బొగ్గు గనులు**
**మెల్లిగ మచ్చిక చేసుకు**
**బొగ్గు నుండి పలు రంగుల**
**నిగ్గు నుండి పరిమళాల**
**గుట్టు లరసి సాధించే**
**గట్టి వాళ్ళు శ్రమ జీవులు**

**- హరీంద్రనాథ్ చటోపాధ్యాయ్**
**అనువాదం - ఆరుద్ర**



# నీలం రాజశేఖరరెడ్డిగారు ఒక మహామనీషి!

ప్రొఫెసర్. కె. శేషాద్రి

కొమ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డిని గూర్చి చెప్పాలంటే కనీస అర్హత వుంటేనే సాధ్యం. అప్పుడే ఔచిత్యం. నా వరకు నాకు ఆ అర్హత లేదని నా భావం. కానీ, నాకా అర్హత వున్నా, లేకున్నా నాకు ఆయనతో కలిగిన మైత్రి, భ్రాతృత్వం, పరస్పర ఆలోచనా విధానంలోని ఏకత్వం మొదలైన సంబంధాల వల్ల నా మనస్సును ధృడ పరచుకొని ఈ కొన్ని అభిప్రాయాలు తెలుపుతున్నాను. జాతస్య మరణం ధృవం - రాజశేఖరరెడ్డిగారూ, చంద్ర రాజేశ్వర రావుగారు నాకంటే ముందుగానే వెళ్ళిపోయారే అనే తలంపు చాలా విషాదకరంగా వుంటుంది. నేను ఒంటరిగా వున్నప్పుడు కాలమై పోయిన చాలామంది కామ్రేడ్సును గూర్చి, తలచుకోవడం తరువాత వారు తమ జీవితంలో చేసిన పనులు, త్యాగాలు జ్ఞాపకం చేసుకోవడం జరుగుతూ వుంటుంది. కమ్యూనిష్టు ఉద్యమం భారతదేశంలో ఎన్నో ఆటుపోటులకు గురై ఎందరో మహానుభావులను సమీకరించుకున్న "మహా ప్రస్థానం". ఇది ఆగదు, గమ్యం చేరేటంతవరకు కొంతకాలం వెనకంజ వేయవచ్చు. ఆగిపోయి నిలవవచ్చు. ప్రపంచ చరిత్రలో కొన్ని సంవత్సరాల కాలం పెద్ద కాలం కాదు. చరిత్రే కొన్ని స్వర్ణాక్షరాలు వ్రాసింది. కొన్ని చోట్ల దాతనే రోతగా కూడా వుండి పోయింది. ఈ బృహత్ చరిత్రలో ఎందరో త్యాగమూర్తులు తమ సర్వస్వం ధారపోసి అమరులైనారు. ఇదంతా ఎందుకంటున్నానంటే అటువంటి అమరులలో ఒకడు నీలం రాజశేఖరరెడ్డి. అతడు త్యాగశీలి, మృదుభాషి, నిరాడంబరుడు, స్వార్ధరహితుడు. ఇవన్నీ గతించిన వారిని గురించి చేసే పొగడ్తలు కావు. నా అభిప్రాయంలో చాలమంది ఇటువంటి వ్యక్తులు కమ్యూనిష్టు ఉద్యమంలో, అందులో ముఖ్యంగా స్వతంత్ర పోరాట కాలంలోనే కమ్యూనిజమ్ గూర్చి అధ్యయనం చేసి ఈ పీడిత ప్రజానీకానికి నిజమైన స్వేచ్ఛ రావాలంటే కమ్యూనిస్టు ఉద్యమమే మార్గమని గ్రహించిన వారిలో చాలా మంది ఇలాంటి మహానుభావులే. వారిలో నాతో వ్యక్తిగతంగా చాలా దగ్గర సంబంధాలు పెట్టు కున్న వారు రాజశేఖరరెడ్డిగారూ, చంద్ర రాజేశ్వరరావుగారు. వీరిద్దరు కూడా పరస్పరం మైత్రితో మెలిగేవారు.

కమ్యూనిష్టు ఉద్యమం సర్కారు జిల్లాలలో బలపడింది. కానీ రాయలసీమలో అంతగా బలపడలేదని నేను ఒకసారి రాజశేఖరరెడ్డిగారితో కబుర్లు చెప్పుకుంటూ అడిగాను. మీరూ, చంద్ర పుల్లారెడ్డి, తరిమెల నాగిరెడ్డి వంటి నాయకులు రాయలసీమ నుండి వచ్చినప్పటికీ ఉద్యమం పెద్దగా రాలేదే అని నా సందేహాన్ని వెలిబుచ్చాను. (అంటే వారి నాలగవ, ఐదవ దశాబ్దం కాలపు మాట) దానికి ఆయన స్పందిస్తూ

అన్నాడు- "ఏ ఉద్యమానికైనా కొన్ని చరిత్రాత్మకంగా ఏర్పడ్డ నిబంధనలుంటాయి. రాజకీయంగా, ఆర్థికంగా కొన్ని పరిస్థితులుంటాయి. స్థాయికి మించిన ఉద్యమం ఏలాంటి నాయకులున్నా పెరగటం కష్టం. సర్కారు జిల్లా చైతన్యం, వ్యవసాయాభివృద్ధి కలిగినది. కాపిటలిస్టు విధానం కాకున్నా, ఫ్యూడల్ విధానం అంతరించింది కాబట్టి, దానికి పైస్థాయిలోకి ఎదగటానికి తోడ్పడే ఆర్థిక పరిస్థితులు ఏర్పడ్డవి. ఏలాంటి అభివృద్ధి విధానం లేక, క్షామదేవత ఎల్లప్పుడూ తాండవిస్తూ, పూర్వకాలపు కక్షలు, కుటుంబ ద్వేషాలు, పగతీర్చుకునేందుకు హత్యలు వాటికి ప్రతిగా మరల హత్యలు సాగిపోతున్న రాయలసీమలో అధునాతన సిద్ధాంతానికి దాని క్రమశిక్షణ తావెక్కడుంటుంది? ఇటలీలో కమ్యూనిస్టు ఉద్యమం అంత పెరిగినప్పటికీ సిసిలీలో మాత్రం మాఫియాలతోనే వెనక బడివుందికదా. అందుకని ఉద్యమాన్ని నిలపటం కాదు. ఇంకా శ్రమించి వెనుకబడిన వారిని కూడగట్టి ఈ చంపుడు, బాంబులు విసురుడు సంస్కృతిని కట్టిపెట్టవలసి వున్నది. వ్యవసాయం అభివృద్ధి చెందితే కూడా అది సాధ్యమవుతుంది. పంజాబ్‌లో కూడా ఇలాగే ఫ్యామిలీ వెన్‌దత్త వుండేది. ఇప్పుడు అలాంటిది లేదు కదా" అన్నారు. దీర్ఘ ఆలోచనతో చెప్పిన మాటలు ఎలాంటి అరమరికలు లేని మాటలు. ఎప్పుడు రాజశేఖరరెడ్డిగారి వద్ద జొల్లువాగుడు, కట్టె విరగక పాము చావక వుండేటటువంటి మాటలు కనిపించవు. కఠినంగా, పరుషంగా కాకుండా మృదువుగానే నిష్కర్షగా, ద్వంద్వార్థాలు లేకుండా చెప్పటం ఆయన స్వభావం. మనస్సును నొప్పించడు. కానీ, వదులుగా మాట్లాడడు. కామ్రేడ్స్ మనస్సును బాధపరచకుండా, గట్టి విమర్శచేసి, తప్పటడుగు వేసే వారిని దారికి తీసుకొని రావటం అనేదే నిజమైన మార్క్సిస్టు సానుభూతి అని ఆయన అభిప్రాయం. ఎంత పెద్దవారితోనైనా, లేక యువకులతోనైనా ఏలాంటి తారతమ్యం లేకుండా ఒకే తీరుగా మాట్లాడేవారు. ఆయనకు కొంతకాలంగా యువకుల మీద వారిని సరియైన సిద్ధాంతపరంగా తర్ఫీదు చేయటంపై దృష్టి కేంద్రీకరించారు. కమ్యూనిస్టు పార్టీలో మొట్ట మొదట అందరూ యువకులే. యువకులతోనే స్థాపించబడింది. సగటు వయస్సు పార్టీలో ముప్పయి ఐదు అని ఒకకాలంలో పి.సి. జోషీగారు సగర్వంగా చెప్పేవారు. కానీ అలాంటి నిష్పత్తి నేడు లేదుకదా. కాబట్టి యువతరంలో గట్టిగా పనిచేయాలి. వారిని శాస్త్రీయంగా, సిద్ధాంత పరంగా బలపరచి కమ్యూనిస్టు ఉద్యమాన్ని పెంచాలి. సైద్ధాంతిక రంగంలో కుంటుపడితే మనకు, బూర్జువా పార్టీలకు ఏమి భేదమున్నదని అనేవారు. ఢిల్లీలో పార్టీ హెడ్ క్వార్టర్సులో పార్టీ పాఠశాలలు నడపటంలో అతిశ్రద్ధ వహించి, ఇరవై నాలుగు గంటలు వాటిని పోషించటానికే తన శక్తినంతా ధారపోశారు.

ఇక్కడ నేను కొంత నన్ను గురించి చెప్పుతున్నందుకు క్షమించాలి. నాకు ఆయనతో చాల గట్టి మైత్రి ఉన్నందువల్ల మార్క్సిస్టు సిద్ధాంతం, భారతదేశ రాజకీయ

పరిస్థితులపైన నాకున్న స్వల్ప అవగాహనపై ఆయనకున్న నమ్మకం కొద్దీ నన్ను పార్టీ యొక్క అరవై సంవత్సరాల (షష్టిపూర్తి)లో భారత రాజకీయాలకు చేసిన సేవలను గూర్చి వ్రాయాలి అన్నారు. నాకు అంతటి సామర్థ్యం లేదన్నప్పటికీ గట్టిగా పట్టుబట్టారు. ఈ అరవై సంవత్సరాలు కమ్యూనిస్టు చరిత్రను పురస్కరించుకొని కొన్ని పుస్తకాలు ముద్రించ బడినవి. వాటిలో నేను వ్రాసిన పుస్తకం, రాజశేఖరరెడ్డి గారి ప్రోద్బలంతో బాగ అమ్ముడుపోయిందని సగర్వంగా చెప్పుచున్నాను. దానిని చూచినపుడంతా నాకు ఆయన జ్ఞాపకం వచ్చి కంటతడి వస్తుంది.

కేంద్ర బాధ్యతలనుండి రిలీవ్ అయి హైదరాబాద్‌కు వచ్చిన తర్వాత కూడ రాజశేఖరరెడ్డిగారి ముఖ్యమైన ధ్యేయం పార్టీలో యువకులను చేర్చటం, వారిని సైద్ధాంతికంగా గట్టి పరచడంపైన్నే తన సాయశక్తులూ ధారపోశారు. ఒకసారి నన్ను తనతో అనంతపురం జిల్లా యువజన మహాసభకు పిలుచుకొని పోయారు. ఇద్దరం ప్రసంగించి నాము. పార్టీ స్కూలులో ఒక్కొక్కసారి రాజకీయాలను గూర్చి ఏమీ తెలియని యువకులు వుండేవారు. అదినాకు తెలియదు. కాబట్టి నేను కొంత పై స్థాయిలోనే మాట్లాడినాను. విద్యార్థులెవ్వరికీ బోధ పడ్డట్టులేదు. వారందరు పోయి రాజశేఖరరెడ్డి గారి వద్ద తమకేమీ బోధపడలేదని మొరపెట్టు కున్నట్లున్నది. మరుసటి లెక్చరు ఇచ్చేదానికి ముందు రెడ్డిగారు నాతో "అయ్యా, మీరు ఎం.ఎ. స్టూడెంట్సుకు ఇచ్చే మోతాదులో వీళ్ళకు చెబితే ఎలా? కొంచెం కింది స్థాయిలో చెప్పమని మందలించారు. నేను చాలా కింది స్థాయిలోనే చెబుతున్నానంటే కూడ, ఇంకా కింది స్థాయిలో......అన్నాడు. నన్ను తన క్లాసులో అధ్యక్షుడుగా వుండమని తను ప్రసంగం చేశాడు. అంటే, ఏ స్థాయిలో వారికి చెప్పాలనేది, నాకు మనసు నొచ్చుకోకుండా నాకే బోధించారు కదా!

రాజశేఖరరెడ్డి స్థలంలో ఇంకెవరైనా కాంగ్రెసు నాయకుడు వుండివుంటే ఎన్ని ఉన్నత పదవులను ఆశించేవారోకదా. తన తోబుట్టువు సంజీవరెడ్డి గారు ఆంధ్రరాష్ట్రానికి ముఖ్య మంత్రి, యువతరంలో కాంగ్రెస్‌పార్టీ అధ్యక్షుడు, లోక్‌సభ స్పీకర్, తర్వాత రాష్ట్రపతిగా ఎంతో వున్నతస్థితికి వెళ్ళాడు. అలాంటి పరిస్థితి వున్నప్పటికీ రాజశేఖరరెడ్డి తను తన ఆశయాల కోసం ఎలాంటి జీవితం సాగించాలనుకున్నారో అదే సాధించారు. పార్టీలో ఎగుడు దిగుడులకు గురైనారు. కానీ ఆ అచంచల దీక్ష వల్లనే పార్టీ సభ్యులందరి గౌరవం సంపాదించారు. పార్టీ నిర్మాణంలో మేటి అనిపించుకున్నారు.

ఒక దినం ఆయన గదిలో ప్రవేశించినప్పుడు మాండోలిన్ శ్రీనివాస్ సంగీత క్యాసెట్ వింటున్నాడు. ఆ క్యాసెట్ మద్రాసునుండి కొని తెచ్చుకున్నాడు. నాకు చాలా సంతోషంగా వుండినది. సంగీతం మీద కూడా ఇంత అభిలాష వుందే మీకు అన్నాను. చాలా మందికి సంగీతమంటే అయిష్టత కాదు, కాని అంత అభిలాష వుండదు. అందులో

శాస్త్రీయ సంగీతం అంటే అసలే సరిపడదు. కానీ రాజశేఖరరెడ్డి గారిలో కనబడ్డ ఉత్సాహం నాకు చాల సంతోషం కల్గించింది. "చాలా బాగా వాయించాడండీ శ్రీనివాస్ ఈ వయస్సులోనే చాలా గర్వకారణం" అన్నాడు.

మానవతావాది, ఉదార స్వభావుడు, స్నేహశీలి, కమ్యూనిజమ్ యొక్క సత్యాన్ని పూర్తిగా నమ్మి దాని కొరకై ఎలాంటి నిరుత్సాహం లేనటువంటి త్యాగమూర్తిగా జీవితాన్ని గడిపాడు. తన కుటుంబ జీవితంలో ఎలాంటి కష్టాలను ఓర్చాడోకానీ, ఎల్లప్పుడు మందహాసం తోటే అందరితో మెలుగుతూ నిజమైన కామ్రేడ్‌గా జీవితం గడిపాడు ఈ మధ్య వరుసగా చాలమంది ముఖ్యమైన వారు కాలమైనారు. ఆంధ్రదేశంలో చాలమంది లేరు. కాని వారి యొక్క త్యాగాలు, వారి శ్రమ, వారుచేసిన ప్రజాసేవ చిరస్మరణీయంగా వుంటుందనే దానికి సందేహంలేదు. అలాంటి వారిలో కామ్రేడ్ నీలం రాజశేఖర్‌రెడ్డిగారికి ప్రథమశ్రేణిలో శాశ్వత స్థానం అనేది సత్యం.

**ప్రాకృతిక అభివృద్ధిని శాసించే నియమాలు సద్యోజ నితంగా వర్తిస్తాయి. అయితే సమాజ అభివృద్ధి నియమాలు అసంఖ్యాక మానవ కాంక్షలు, ఉద్దేశాలు, కార్యచరణాలు జరుపుకునే సంక్లిష్ట ప్రతిచర్యల ఫలితంగా ముందుకు వస్తాయి.**

**- ఎంగెల్స్**



# ఆయన సంతకం చేసిన చిట్టచివరి రాజకీయ పత్రం!

కె.యల్. మహేంద్ర

రాష్ట్ర పార్టీ మహాసభ అనంతపురంలో నిర్వహించినపుడు రాజేశ్వరరావు నాయకత్వం క్రిందవున్న కామ్రేడ్సుకీ, సుందరయ్య సహచరులుగా వున్న కామ్రేడ్సుకీ మధ్య తీవ్ర భేదాభిప్రాయాలు వచ్చాయి. రాయలసీమ కామ్రేడ్సు మామూలుగా తటస్థం గానే వుండేవాళ్ళు. సమస్యల్ని బట్టి వోటు వేసేవాళ్ళు. వాళ్ళు ఏ పక్షానికి వోటువేస్తే ఆ పక్షం గెలిచేది. ఆ రాష్ట్ర మహాసభ సందర్భంలోనే సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 20వ మహాసభ జరిగింది. ఆ పత్రాల గురించి చర్చించాక రాజమండ్రిలో మహాసభను నిర్వహించుకునేందుకు నిర్ణయించి వాయిదా పడింది. రాజమండ్రి మహాసభలో రాజశేఖర రెడ్డి పేరు సి.ఆర్. ప్రతిపాదించారు. తరిమెల నాగిరెడ్డి పేరు పి.యస్. ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదనలు రాష్ట్ర కార్యదర్శి పదవికోసం. వోటింగ్ జరిగింది. రాజశేఖరరెడ్డి రాష్ట్ర కార్యదర్శిగా ఎన్నిక అయ్యారు. సెక్రటరీగా ఎన్నికయ్యేక ఆయన తన స్థానాన్ని దిటవు పరచుకున్నారు. కామ్రేడ్స్ ఆయన అధికారానికి జై కొట్టారు. విజయవాడ పార్టీ మహాసభలపుడు సి.ఆర్, రాజశేఖర్ లిద్దరూ అజయ్‌ఘోష్‌ని బలపరిచారు. అవతలి పక్షం ప్రత్యామ్నాయ డాక్యుమెంట్‌ని ప్రతిపాదించింది. కానీ, కడకు అజయ్‌ఘోష్ ఉపన్యాసాన్నే ఆమోదించడం జరిగింది.

1962లో చైనా దాడి జరిగినపుడు జాతీయ సమితి చైనా దాడిని ఖండించేదానికి ముందే ఆ దాడి తప్పని రాజశేఖరరెడ్డి అభిప్రాయపడ్డారు. హైదరాబాద్ సిటీ కమిటీ వారు జాతీయ సమితి దాకా ఆగకుండ ఆ దాడిని ఖండించాలని అన్నారు. ఒక కామ్రేడ్ మాత్రం జాతీయ సమితి దాకా ఆగాలన్నాడు. దేశాన్ని కలచి వేస్తున్న సమస్య కాబట్టి దానిని బహిరంగంగా ఖండించాలని రాజశేఖరరెడ్డి అభిప్రాయం. సిటి సమితి చైనా దాడిని ఖండిస్తూ ఏకగ్రీవంగా తీర్మానం చేసింది.

అదిలాబాద్ జిల్లాలో అటవీ భూములను ఆక్రమిస్తూ వేలాదిమంది పేద రైతాంగాన్ని రాజశేఖర్, రాజబహదూర్‌లు నడిపించారు.

రాష్ట్ర కార్యదర్శిగా ఆయన సిద్ధాంతపర బోధన గురించి మరీ, మరీ చెప్పేవారు. విద్యార్థి, యువజన శిబిరాలని నిర్వహించడం జరిగింది.

కేంద్ర కార్యదర్శివర్గ సభ్యులుగా ఢిల్లీకి మారారు. పార్టీ అధ్యయన తరగతులపై దృష్టి కేంద్రీకరించారు. ఇంగ్లీషు, హిందీ భాషల్లో నిరంతరంగానూ, ఉర్దూలో సాలుకు రెడు సార్లు కేంద్ర అధ్యయన తరగతులు జరిగేవి, ఆ కార్యక్రమం అలా నిరంత రాయంగా కొనసాగుతూనే వుండాలని ఆయన అనేవారు. కేంద్ర పాఠశాల కోసం ఫరిదాబాద్‌లో ఓ భవనాన్ని నిర్మించారు. కొన్ని సందర్భాలలో కేంద్ర అధ్యయన పాఠశాలలు మగ్దుంభవన్‌లో కూడా జరిగేవి.

ఈ పాఠశాలలో చాలాసార్లు నేను కొన్ని పార్యాంశాల్ని బోధించే వాడిని. ఎంత ఖచ్చితంగా వాటి గురించి ప్రణాళిక చేసుకొనేవారో! ఈ పాఠశాలకు ముఖ్య కార్యకర్త లనూ హిందీ మాట్లాడే ప్రాంతాల వాళ్ళనీ పంపించేటట్లు రాష్ట్ర నాయకత్వాలకు నచ్చచెప్పేవాడు.

విశాఖపట్టణంలో ఏ.ఐ.టి.యు సి. కాన్ఫరెన్సు జరిగింది. ఆ జిల్లాలోని పార్టీ చిన్నది. అక్కడి నిర్మాణ సదస్సుల వల్ల రాష్ట్ర నాయకత్వం బెదురుగా వుండింది. ఆ కాన్ఫరెన్స్ సక్రమంగా జరిగేటట్టు పర్యవేక్షణ కోసం రాష్ట్ర కేంద్రం నుంచి నన్ను పంపించారు. ఏర్పాట్లన్నీ బాగా జరుగుతున్నదీ, లేనిదీ చూసేందుకు రాజశేఖరరెడ్డి వచ్చారు. ప్రతి ఏర్పాటునీ పరిశీలించి చూసి తృప్తి పడ్డారు.

నాకు బైపాస్ సర్జరీ జరిగింది. ఒంట్లో ఆరోగ్యం సరిగా లేదు. అప్పుడు ఆయన పనిగట్టుకొని హాస్పిటల్‌కు వచ్చేవారు. ఆయనకి క్యాన్సర్ వచ్చి కదలకుండా ఇంట్లోనే వున్నప్పుడు ఆయన్ని నేను వెళ్ళి చూచేవాడిని. ప్రస్తుత పరిస్థితి గురించి చర్చించుకునేవాళ్లం. రాజశేఖరరెడ్డి, వై.వి.కె. నేనూ ఒక డాక్యుమెంటు తయారుచేసి కేంద్ర నాయకత్వానికి పంపించాం. ప్రజలు అభివృద్ధి కోరుకుంటున్నారని, పాలకవర్గ పార్టీకి వ్యతిరేకంగా విమర్శిస్తూ పోవడమే చాలదనీ మా ముఖ్య ప్రతిపాదన. ప్రత్యామ్నాయ అభివృద్ధి ప్రణాళికతో పార్టీ ముందుకు రావాలి. పరిస్థితులు సబ్జెక్టివ్ గానూ, వస్తుగతంగానూ కూడా ఎలా వున్నాయంటే సోషలిజాన్ని తక్షణం తీసుకురావడం కుదరదు. అందుచేత పెట్టుబడిదారీ చట్రంలోనే ప్రత్యామ్నాయ అభివృద్ధి ప్రణాళికను ముందుంచాలి. కార్మికవర్గం మీద జరిగే దాడులను ఎదుర్కోడానికి ప్రజల్ని వ్యవస్థీకృతం చెయ్యాలి. ఆయన సంతకం చేసిన కడపటి రాజకీయ పత్రం ఇదే.

ప్రజల మనోభావాల ప్రత్యేక తెలంగాణా ఉద్యమం గురించిన అంచనాలో 'రాష్ట్ర కార్యదర్శి వర్గ అభిప్రాయం, నా అభిప్రాయం భిన్నంగా వున్నాయి. నా అంచనాయే

సరైనదని తర్వాతి సంఘటనలు రుజువు చేశాయి. అక్కడ నుంచి ప్రత్యేక తెలంగాణా ఉద్యమ కాలంలో రాష్ట్ర కార్యదర్శి వర్గ సమావేశాలకు రాజశేఖరరెడ్డి నన్ను పిలుస్తూ వుండేవారు.

నిజానికి ఆయన జీవిత చరమాంకంలో గతాన్ని సవిమర్శకంగా చూసి తన అభిప్రాయాలను నాకు చెప్పేవారు. ఆయన్ని జనరల్ హాస్పిటల్‌లో చేర్చారు. అక్కడ వున్న డాక్టర్లు చాలా మంది నాకు తెలిసిన వారే. నేను హాస్పిటల్‌కి తరచు వెళ్ళేవాడ్ని. ఆయన పరిస్థితి గడ్డుగా వుండి మరో రోజులో ఆయన పోవచ్చునన్న దశలో ఆఖరిసారిగా ఆయన్ని చూశాను. ఢిల్లీకి రైల్లో వెళ్ళాను. అజయ్‌భవన్‌కి వెళ్ళేటప్పటికి ఆరోజునే ఆయన పోయారన్న వార్త తెలిసింది.

**కార్మిక వర్గ రాజకీయ పోరాటపు లక్ష్యం అయినపుడే సోషలిజమ్ ఒక శక్తి అవుతుంది.**

***- లెనిన్***

# సోషలిస్ట్ దేశాల పర్యటనలో



సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకులు బ్రెజ్నేవ్, కోసగిన్‌లతో



# పదునైన మార్క్సిస్టు కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డి



డాక్టర్ కె. నారాయణ

రాయలసీమ ప్రాంతంలో ముద్దుగా "రాజన్నా" అని పిలవబడే రాజశేఖరరెడ్డిగారు నాకు తేదీ సరిగా గుర్తు లేదు బహుశ 1970-71లలో అయ్యివుంటుంది, గుంటూరు జిల్లా పార్టీ జనరల్ బాడీ సమావేశానికి రాజకీయ నివేదిక ఇవ్వడానికి వచ్చారు. అప్పటికి నేను గుంటూరు పట్టణానికి పట్టణ ఎ.ఐ.ఎస్.ఎఫ్. కార్యదర్శిగా వున్నాను. జిల్లా పార్టీ జనరల్ బాడీ సమావేశానికి హాజరయ్యాను. సమావేశం ప్రారంభం కావడానికి ముందే అజెండాపై వివాదం ప్రారంభం అయింది. సాంప్రదాయం ప్రకారం సమావేశం జరుగుతోంది. ఇష్టముండే వారు ఉండవచ్చు, వెళ్ళేవాళ్ళు వెళ్ళవచ్చని ఖరాకండిగా రాజశేఖరరెడ్డిగారు ప్రకటించారు. వెంటనే నిరసన వ్యక్తమైంది. సభ్యుల అభిప్రాయాలను తెలుసుకున్న వెంటనే తన ఆలోచనలను మార్చుకున్నారు. అంత పెద్ద నాయకుడు తన అభిప్రాయాలను ఎంత ఖచ్చితంగా వ్యక్తం చేస్తారో అంత ప్రజాస్వామ్య బద్ధంగా ప్రవర్తించడం నాకు ఆనాడు ఆశ్చర్యం వేసినా, నాయకత్వ లక్షణం కార్యకర్తల అభిప్రాయాలను గౌరవించడం.

జిల్లాలో పర్యటించేటప్పుడు అక్కడ చురుకైన కార్యకర్తలను గమనంలోకి తీసుకోవడం వారిపై సరైన అంచనాకురావడం రాజశేఖరరెడ్డి గారి ప్రత్యేకత. ఎవరెవరు ఏ రంగంలో పనిచేయగలరో ఆ విధంగా సలహాలిచ్చేవారు. దాన్ని అమలు పరిచేలా చూసేవారు. అందుకు చాలా ఉదాహరణలున్నా నాకు వర్తించే సంఘటన ఒకటుంది. నేను గుంటూరు జిల్లా ఎఐఎస్ఎఫ్ ఉద్యమంలో ఉన్న రోజులలో రాష్ట్ర కేంద్రానికి ఎఐఎస్ఎఫ్ ప్రధాన బాధ్యతలకు ఎవర్ని ఎంపిక చేయాలనే ఆలోచనలు రాష్ట్ర కేంద్రంలో చర్చలు జరగడం సహజం. ఆ చర్చలలో నాపేరు కూడా వచ్చింది. ఓ చిన్న కాలేజీలో చదివిన నారాయణ రాష్ట్ర ఉద్యమానికి పనికిరాడనే వాదనలు కూడా చోటు చేసుకున్నాయి. అయితే ఆచరణలో పని విధానం చూసి అంచనా వేయడం అవసరమని, ఆ నేపథ్యంలో నారాయణ అర్హుడని రాజశేఖరరెడ్డిగారు అభిప్రాయం వ్యక్తం చేసినట్టు ఆలస్యంగా మరెవరి ద్వారానో తెలుసుకున్నాను.

రాష్ట్ర స్థాయిలో ప్రజాసంఘంలో పనిచేసిన బాధ్యుడు ఏదో ఘటన వలన నిరుత్సాహంతో వుండిపోయారు. ఆ కామ్రేడ్ కొరకు వారున్న ప్రాంతానికి వెళ్లి మాట్లాడి

డా॥ కె. నారాయణ, రాష్ట్ర సి.పి.ఐ. సహాయ కార్యదర్శి

వచ్చారు. సుదూర ప్రాంతంలో వున్నా ఆయన పని వత్తిళ్లను అధిగమించి కార్యకర్త కోసం ప్రయత్నించడం నాయకత్వ విశిష్టతకు మరో నిదర్శనం

నేను టూర్‌పై మాస్కోలో వుండగా రాజశేఖరరెడ్డిగారు మాస్కో వచ్చారు ఆ సందర్భంలో ఆయనను కలవడానికి వచ్చిన మనదేశ విద్యార్థినీ విద్యార్థులతో సంభాషణ గమనించాను ఎవరికి వారు, వారి కుటుంబ పెద్దతో మాట్లాడుతున్నట్లు వారు అనుభూతి పొందుతున్నారు ఆ తర్వాత తెలిసింది వారు ఏదేశం వెళ్ళినా అక్కడున్న మనదేశ విద్యార్థినీ విద్యార్థులను కలవడానికి ప్రత్యేక కార్యక్రమం నిర్ణయించుకుంటారని ఒక విధంగా స్పేడ్ వర్క్ చేయడంలో దిట్ట

1980-81లో ఒకవైపు జనతా కూటమి - మరొకవైపు కాంగ్రెస్ పార్టీ హోరా హోరీ రాజకీయ పోరాటంలో కా॥ నీలం రాజశేఖరరెడ్డిగారిని పార్టీ అనంతపురం అభ్యర్థిగా ఎంపిక చేసింది ఆ సందర్భంలో నేను వారి ఇంటిలో వుండే ఎన్నికలలో పని చేశాను ఆ సందర్భంగా వారి కుటుంబ సభ్యులతో కూడా సన్నిహిత సంబంధం ఏర్పడింది వారు జాతీయ స్థాయి నాయకులయినా క్రింది కార్యకర్తలపై ఆదరణ, కలసిపోవడం వారిలో వున్న ప్రత్యేకత

నేను విద్యార్థి ఉద్యమ బాధ్యతల నుండి రిలీవ్ అయిన తర్వాత సొంత జిల్లా అయిన చిత్తూరు జిల్లాకి వెళ్ళి పనిచేయమని రాష్ట్ర పార్టీ ఆదేశించింది "ఆదేశించింది" అనే మాట ఎందుకంటున్నానంటే - నాకు రాజకీయ చైతన్యం కలిగింది గుంటూరులో. సహజంగా రాజకీయ జీవితంలో స్థిరపడడానికి గుంటూరు జిల్లానే ఎన్నుకుంటాను. అయితే తమ్మారెడ్డిగారు, గిరిప్రసాద్ గారు, నీలం రాజశేఖరరెడ్డిగారు పట్టుపట్టి నన్ను తిరుపతి పంపారు. నేను తిరుపతి కేంద్రంగా వి కె. ఆదినారాయణరెడ్డి గారి ప్రోత్సాహంతో రాయలసీమ జిల్లాల ఎస్.ఎఫ్.వై ఎఫ్. రంగాలపై కేంద్రీకరించి పని చేశాను. ఈ కేంద్రీకరణ వలన కూడా తిరుపతి, చిత్తూరు జిల్లా ఉద్యమానికి బాగా తోడ్పడింది.

రాయలసీమ ప్రాంతంలో నీటి ప్రాజెక్టులు, పారిశ్రామిక వృద్ధికై ఆందోళన చేసే భాగంలో సదస్సులు, బహిరంగ సభలకు రాజశేఖరరెడ్డిగారు బాగా తోడ్పడేవారు. 1977లో తిరుపతిలో "రాయలసీమ సర్వతో ముఖాభివృద్ధి" పై పెద్ద సదస్సు, బహిరంగ సభ జరిగింది. ఆనాడు ముఖ్య అతిథిగా కా॥ నీలం రాజశేఖరరెడ్డిగారు హాజరైనారు. సభకు నిండుదనం - కార్యకర్తలకు ఉత్సాహం కల్పించారు. ఆ సభకు అనంతపురం నుండి వి.కె. ఆదినారాయణరెడ్డిగారు, ఐదుకల్లు సదాశివన్ గారు, కడప నుండి ఎన్. శివరామిరెడ్డిగారు, జె. వెంకటరామిరెడ్డి గారు, పెద్దలు ఈశ్వరరెడ్డిగారు, చిత్తూరు జిల్లానుండి గంధమనేని శివయ్యగారు, కె. క్రిష్ణారెడ్డిగారు కూడా హాజరయ్యారు.

నాకు చేదు అనుభవం రాష్ట్ర ఎఐఎస్ఎఫ్ కార్యదర్శిగా వున్న సందర్భంలో గుంటూరులో రాష్ట్ర మహాసభలో జరిగింది. ఆ మహాసభలోనే నేను కార్యదర్శిగా రిలీవ్ అయ్యాను. ఆ మహాసభ సందర్భంగా జరిగిన బహిరంగ సభకు రాజశేఖరరెడ్డి గారిని ఆహ్వానించాం. ఆ సభకే సినీ యాక్టర్ నాగభూషణం గారిని కూడా ఆహ్వానించాం. సినీ అభిమానులంతా సభకు హాజరై నాగభూషణం గారు మాట్లాడి వెళ్ళాక సభా వాతావరణం చెడిపోయింది. నేను రాజశేఖరరెడ్డిగారి ముందు కనబడకుండా తప్పుకోవలసి వచ్చింది. అప్పుడనుకున్నాను పార్టీ అగ్రనాయకులుండగా సినిమా యాక్టర్లను సభకు పిలవకూడదని.

నేను చిత్తూరు జిల్లాలో పార్టీ ఉద్యమంపై కేంద్రీకరించి పనిచేసే సందర్భంలో రాజశేఖరరెడ్డి గారు జిల్లా జనరల్‌బాడీ సమావేశాలకు వచ్చి నైతికంగా ఉద్యమానికి తోడ్పాటు నిచ్చేవారు. వారిచ్చిన ఉత్సాహం ఒక సందర్భంలో యిబ్బంది కూడా కలిగించింది. తిరుపతిలో జరిగే జనరల్ బాడీ సమావేశంలో రాజశేఖరరెడ్డి గారు ప్రసంగిస్తూ మారుతున్న రాజకీయ పరిస్థితుల్లో అవసరమైతే సైకిళ్ళపై వెళ్లే నాయకత్వం వుండాలన్నారు. ఆనాటికి జిల్లా కార్యదర్శిగా కా॥ కృష్ణారెడ్డి గారున్నారు. (వారు క్రానిక్ ఆస్మా పేషెంటు)వారి స్వగ్రామ మయిన గాజుల మండ్యంనుండి ఒక కిలోమీటర్ దూరం వున్న చక్కెర ఫ్యాక్టరీకి సైకిల్‌పై వెళ్ళివచ్చారు. పర్యవసానంగా అనారోగ్యంతో హాస్పిటల్ పాలయ్యారు. 20 రోజులపాటు హాస్పిటల్‌లో వారి సేవకు సరిపోయింది. రాజశేఖరరెడ్డి గారు ఒకందుకు ఉత్సాహ పరిస్తే అది మరో మలుపు తిరిగింది.

జిల్లా జనరల్ బాడీ సమావేశానికి హాజరయ్యేందుకు తిరుపతి వచ్చారు. ఆ సందర్భంగా మా ఇంటికి భోజనానికి ఆహ్వానించాం. 'నాకు తిండి బలహీనత వుంది, తక్కువగా పెట్టాలి' అని మా ఆవిడ వసుమతిని హెచ్చరించారు. దాన్ని సరదాగా తీసికున్నాం. మా ఆవిడలో వున్న సహజ లక్షణం అతిథులకు గానీ ఇంటిలో వారికి గానీ బలవంతంగా వడ్డించదు. అన్నీ టేబుల్‌పై వుంటాయి. వారికి ఇష్టమైనట్లు తినవచ్చు. పొరబాటున నేను గానీ, అతిథులు గానీ మొహమాట పడితే కడుపుకు అన్యాయం జరుగుతుంది. రాజశేఖరరెడ్డి గారి మాటల్లోపడి మంచిగానే భోజన కార్యక్రమం పూర్తి చేశాను. లేవడానికి ప్రయత్నించేటపుడు గుర్తుకొచ్చింది. "అరె ఇపుడు జనరల్ బాడీ మీటింగ్‌లో మాట్లాడాలి. ఎక్కువ భోజనం పెట్టి ఇబ్బంది పెట్టేశావ్" అని వసుమతిని మందలింపు ధోరణితో అంటుంటే అందరం నవ్వుకోవాల్సి వచ్చింది. రుచికరమైన ఆహారంపై నాకే కంట్రోలు వుండదు అని వారే సర్దుకుంటుంటే ఎంత పెద్దవారికయినా కొన్ని చిన్న పిల్లల లక్షణం వుంటేనే జీవితానికి మధురానుభూతి.

కడప పార్లమెంటు స్థానానికి ఎద్దుల ఈశ్వర్‌రెడ్డి గారు పోటీ చేస్తున్న సందర్భంలో ఎన్నికల ప్రచారం నిమిత్తం నేను కడపలో ఉన్నాను. నీలం రాజశేఖరరెడ్డి గారు, నేను కలసి ఉదయం ఎన్నికల ప్రచారానికి వెళ్ళాల్సి వుంది. "నారాయణా కడపలో నెయ్యిదోశ తిన్నావా" అని అడిగారు. లేదన్నాను. నెయ్యిదోశ రుచి చూడకుండా ఏంటయ్యా" అంటూ, "సంజీవరెడ్డీ నెయ్యిదోశ తెప్పించు" అని పురమాయించారు.

సంజీవరెడ్డి గారంటే ఉత్తమ బ్రహ్మచారి - పార్టీ కొరకు జీవితాంతం అంకితమై వున్న ఆదర్శమూర్తి. కడప పార్టీ ఆఫీసు కార్యదర్శిగా వుండేవారు. వారంటే అందరికీ గౌరవం. ప్రచారానికి ఆలస్యమౌతుంది నెయ్యిదోశ తెప్పించేందుకు వీలు కాదు వెళ్లండి అని సంజీవరెడ్డి గారన్నారు. అలా కుదరదు నీవు తెప్పించాల్సిందే, నారాయణకు రుచి చూపించాల్సిందే నన్నారు రాజశేఖరరెడ్డి గారు. నీవు తినాలనే కోర్కెతో ఆ కొండకోతి (నన్ను ముద్దుగా కొండకోతి అని సంజీవరెడ్డి పిలిచేవారు) పేరుతో సాకు చెపుతావే అని పోట్లాట. ఎలాగయితేనేం నేను నెయ్యి దోశ కడపలో ప్రధమంగా రుచి చూశాను. రాజశేఖరరెడ్డి గారు పార్టీ కేంద్ర బాధ్యతలు నిర్వహించేటపుడు ఎంత ఆరోగ్యంగా, ఉత్సాహంగా వుండేవారో బాధ్యతల నుండి రిలీవ్ అయ్యాక త్వరగా అనారోగ్యానికి గురయ్యారు. పార్టీ పెరుగుదలపై, నిర్మాణ పటిష్టతపై తపనపడే వారు. చివరకు క్యాన్సర్ జబ్బు వచ్చిందని తెలిసికున్నాక వైద్యం చేయించుకున్నా ఫలితం లేక భౌతికంగా మనల్ని వీడి వెళ్లారు. అయితే వారి నిర్మాణ పద్ధతులు, నిశిత రాజకీయజ్ఞానం, కామ్రేడ్స్‌పై ఆప్యాయత ఇంకా మనల్ని అంటిపెట్టుకునే వున్నాయి.

**లక్షల చేతులు పండించే ధాన్యం**
**ఒక్క లోగిట్లో పరుచుకుంటే**
**కోట్ల చెమట బొట్లు కురిసే మూల్యం**
**ఒక్క గుప్పిట్లో అణిగి వుంటే**
**అచ్చమైన సౌజన్యం**
**చచ్చు పీనుగులా పడి వుంటుందా?**
**రెచ్చిపోయిన రక్తఘోషతో**
**చిచ్చు రెక్కలు సాచకుంటుందా?**

**- సి.నా.రె.**
**విశ్వంభర**

# పార్టీ సిద్ధాంత పరిజ్ఞానం : రాజశేఖరరెడ్డిగారి కృషి



- ఈడ్పుగంటి నాగేశ్వరరావు

"డాక్టరు అధికారి, సర్దేశాయిల కంటే సిద్ధాంత పరిజ్ఞానం ఉన్నవాడినా! అయితే నేను ఒక పాలసీని అనుసరించాను. కార్యకర్తల శిక్షణా కార్యక్రమం నిరంతరం సాగాలి. పార్టీ ఎడ్యుకేషన్ అనేది పార్టీ జీవితంలో అంతర్భాగం".

ఈ మాటలు కామ్రేడ్ రాజశేఖరరెడ్డిగారివి. మా సంభాషణలో రెండు, మూడు సార్లు అవి అలా దొర్లాయి. ఇందులో నమ్రత భావం ఉంది. పార్టీ నిర్మాణం, సిద్ధాంతం ఆచరణ పట్ల స్పష్టమైన దృక్పథం వుంది.

ఆంధ్ర రాష్ట్ర పార్టీ నిర్మాణంలోనూ, అఖిల భారత పార్టీ నిర్మాణంలోనూ కామ్రేడ్ రాజశేఖరరెడ్డిగారికి ప్రత్యేక పాత్ర వుంది. సజీవమైన పార్టీ ఎల్లప్పుడూ నూతన తరాన్ని ఆకర్షించాలి. కార్యకర్తలను తయారు చేసుకోవాలి. భవిష్యత్ వారిదే కదా! అన్నది ఆయన వైఖరి.

రాష్ట్ర పార్టీ బాధ్యతల నుండి తప్పుకుని పార్టీ కేంద్రంలో కొత్త బాధ్యతలు స్వీకరించిననాటి నుండి దాదాపు రెండు దశాబ్దాల పాటు భారత కమ్యూనిస్టు పార్టీ రాష్ట్ర శాఖలు వున్న అన్ని ప్రాంతాలలోనూ పార్టీ కార్యకర్తల సైద్ధాంతిక, రాజకీయ స్థాయిని పెంచేందుకు బోధనా కార్యక్రమాల్ని రూపొందించడంలో, దానిని నిర్వహించటంలో విరామంలేని కృషిసల్పారు రాజశేఖరరెడ్డిగారు. అకుంఠితదీక్ష, సంకల్ప బలం, నిబద్ధత ఉంటేగాని అది సాధ్యంకాదు.

కేంద్ర పార్టీలో అప్పటికే డాక్టరు అధికారి, కామ్రేడ్ మొహిత్‌సేన్, ఆ తరువాత కొద్ది కాలంపాటు కామ్రేడ్ భవానీసేన్‌లాంటి ప్రముఖులు పార్టీ ఎడ్యుకేషన్ ఫ్రంట్‌లో కొంత కృషి చేసి వున్నారు. కాని అది దేశవ్యాప్తంగా, క్రమపద్ధతిలో, కార్యకర్తలస్థాయికి అనుగుణంగా దశలవారీగా, దీర్ఘకాలిక ప్రయోజనాలతో, ప్రణాళికాబద్ధంగా సాగింది కాదు. అట్టి బృహత్ కర్తవ్యాన్ని పరిపూర్తి చేయగలిగారు కామ్రేడ్ రాజశేఖరరెడ్డి.

అయితే, ఇది పార్టీలో వివిధ స్థాయిలలో ఆటంకాలు, చిక్కులు లేకుండా జరిగిందని కాదు. సిద్ధాంతంపట్ల విముఖతా భావం కొంతమందిలో ఉంటే, ఆచరణలో ఇది సాధ్యమా అన్న సందేహం మరికొంత మందిలో వుండేది. కాని నాటి పార్టీ ప్రధాన కార్యదర్శి చండ్ర రాజేశ్వరరావుగారు ఇతర సహచరుల సానుకూల వైఖరి, సహాయ సహకారాలతో వాటిని అధిగమించి పార్టీ ఎడ్యుకేషన్‌కు ఒక గుర్తింపును తీసుకు రావటంలో ఆయన కృతకృత్యులు కాగలిగారు.

భారతదేశ పరిస్థితులలో సామాజిక పరివర్తనకు కమ్యూనిస్టు పార్టీ వ్యూహమేమిటి? ఇది నాడు, నేడు పెద్ద చర్చనీయాంశంగానే ఉన్నది. బొంబాయి, పాట్నా మహాసభలు ఆమోదించిన పార్టీ కార్యక్రమం ప్రాతిపదికగా కార్యకర్తల కొరకు సులభ శైలిలో, అర్థమయ్యే రీతిలో కామ్రేడ్ రాజశేఖరరెడ్డి ఒక నోట్స్ తయారు చేశారు. పార్టీ నిర్మాణంపై పత్రాలు తయారు చేశారు. కొన్ని ప్రత్యేక అంశాలపై సెమినార్స్ నిర్వహించారు. మార్క్సిజంను భారతదేశ పరిస్థితులకు అన్వయించటంలో వ్యక్తమయిన బలహీనతలను గుర్తించిన నాయకులలో ఆయన ఒకరు. భారతదేశ చరిత్ర, సంస్కృతి, భారతీయ తాత్విక చింతన, తదితర అంశాలను, నేడు ఆర్థిక వ్యవస్థలో వస్తున్న మార్పుల గురించిన అధ్యయనం, విశ్లేషణ, పార్టీ బోధనా ప్రణాళికలో చేర్చి పార్టీ సిద్ధాంత స్థాయిని పెంచేందుకు కృషి చేశారు.

నూతన తరం కార్యకర్తలపై కామ్రేడ్ రాజశేఖరరెడ్డిగారికి ప్రత్యేక శ్రద్ధ ఉండేది. పార్టీ కార్యకర్తల గురించిన ఒక శాస్త్రీయ విధానం (క్యాడర్ పాలసీ) రూపకల్పనకు ఆయన శ్రమించారు; పోరాడారు. అందులోనూ ముఖ్యంగా యువజన విద్యార్థి రంగాల కార్యకర్తలను, తీర్చిదిద్దేందుకు వారిని గుర్తించి కాపాడుకునేవారు. ఆయా రాష్ట్రాల పార్టీ శాఖలతో ఓపికగా వ్యవహరిస్తూ వారికి నచ్చచెప్పి అంగీకరింపజేసేవారు. కేంద్ర పార్టీ నుండి అవసరమయిన వనరులను సమీకరించి వందల సంఖ్యలో రాజకీయ శిక్షణా శిబిరాలను ప్రత్యేకంగా యువకులకు, విద్యార్థులకు నిర్వహించారు. ఒక దశలో ఆర్థిక వనరుల కొరత తీవ్రమయింది. దానిని పూరించేందుకు పలు మార్గాలను అన్వేషించారు. రాజకీయ పాఠశాలకు హాజరయ్యే విద్యార్థులు ఆయా శిక్షణ కేంద్రాలలో నిధి సేకరణ, సాహిత్యం అమ్మకాలలో పాల్గొనుట పాఠశాల కార్యక్రమంలో అంతర్భాగంగా చేయవలసి వచ్చింది. ఇది ఆచరణలో జయప్రదమయింది. పాఠశాల విద్యార్థులకు ఉత్సాహాన్నిచ్చింది కూడా.

వివిధ ప్రజారంగాలలో పనిచేసే కార్యకర్తలకు - టి.యు., కిసాన్, ఖేత్, మజ్దూర్, మహిళలకు - ప్రత్యేక పాఠశాలలు నిర్వహించడం తొలి దశలో సాధ్యమయింది కాదు. వారి నాయకులతో పలు సమావేశాలు, ఉమ్మడి చర్చల అనంతరం అది క్రియారూపం దాల్చింది.

సుదూర ప్రాంతాలలో, చిన్న రాష్ట్రాలలో (ఈశాన్య భారతంలో) గిరిజన ఆవాసాలలో (దండకారణ్య) పార్టీ పాఠశాల అది ఎంత చిన్నదయినా ఎవరు నిర్వహించినా కామ్రేడ్ రాజశేఖరరెడ్డి ఉత్సాహంతో పొంగిపోయేవారు. దానిని ఆదర్శనీయమైన కృషిగా ప్రస్తుతించేవారు.

పార్టీ నాయకులను, ప్రజారంగాల నాయకులను ప్రతి సందర్భంలోనూ, సాధ్యమయిన ప్రతిచోట ఈ కార్యక్రమంలో పాల్గొనేలా ప్రోత్సహించేవారు. తాను స్వయంగా పాల్గొనేవారు. పార్టీ నాయకులతో పాటు వివిధ వృత్తులలో వున్న మేధావులను కలుసుకుని, చర్చించి పార్టీ అవసరాలను తెలిపి వారి సేవలను ఉపయోగించుకునేందుకు కామ్రేడ్ రాజశేఖరరెడ్డి ప్రత్యేక ఆసక్తిని కనపరచేవారు.

భారతదేశంలాంటి విశాలమైన దేశంలో, వెనుకబడిన దేశంలో, అపార వైవిధ్యం వున్న దేశంలో కమ్యూనిస్టు పార్టీని నిర్మించటం, దాని నిర్మాణ ఐక్యతను సాధించటం, కాపాడటం క్లిష్టతరమైనది. దేశ జనాభాలో 60 శాతం మందికి అక్షరజ్ఞానం లేదు. పార్టీ సభ్యత్వంలో కూడా నాల్గవవంతు మంది అక్షరాస్యులు కారు. వీరందరిని పార్టీ విద్యలో భాగస్వాముల్ని చేయడం ఎలా? ఆర్థిక వనరుల కొరత ఎదుర్కొంటున్న పార్టీ రాష్ట్ర శాఖలు ఉన్నాయి. ఆ రాష్ట్రాలలో పార్టీ కార్యకర్తల చైతన్య స్థాయిని పెంచటం ఎలా? పార్టీ విద్యతో పాటు అనుసరించవలసిన ఇతర పద్ధతులు, రూపాలు ఏమిటి? ఇత్యాది ప్రశ్నలను పార్టీ నాయకత్వం తీవ్రంగానే పరిశీలించింది.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి పార్టీ ప్రతినిధిగా ఏ దేశం సందర్శించినా, సోదర పార్టీల సైద్ధాంతిక కృషి, వారి రాజకీయ పాఠశాలల నిర్వహణ తప్పనిసరిగా పరిశీలించేవారు. ఆయన కార్యక్రమంలో ఇదొక అంతర్భాగమయింది. నాటి సోవియట్ యూనియన్, జి.డి.ఆర్., వియత్నాం, క్యూబా తదితర పార్టీల అనుభవాలను అధ్యయనం చేశారు. ఆ పార్టీల ముఖ్యులతో, బాధ్యులతో ప్రయోజనకరమైన చర్చలు జరిపేవారు. పార్టీ ఎడ్యుకేషన్ అనేది మొత్తం సైద్ధాంతిక కార్యకలాపాలలో ఒక భాగం. సోదర కమ్యూనిస్టు పార్టీలు సైద్ధాంతిక కృషిని ఎలా సాగిస్తున్నాయి? పార్టీ పత్రికలు, సాహిత్యం, ప్రసార మధ్యమాలు, విజ్ఞానశాస్త్రాల సంస్థల నిర్వహణ, రాజకీయ పాఠశాలలు, అధ్యయన గోష్ఠులు - ఇవన్నీ పార్టీ సైద్ధాంతిక ప్రచార రంగాలకు సంబంధించినవి. సోదర పార్టీల సైద్ధాంతిక కార్యకలాపాలను అధ్యయనం చేసేందుకు భారత కమ్యూనిస్టు పార్టీ ప్రతినిధి వర్గాలను ఎంపిక చేసి పంపింది. 1976లో ప్రప్రథమంగా విదేశాలను సందర్శించిన సి.పి.ఐ. సైద్ధాంతిక ప్రతినిధి వర్గంలో ఈ రచయిత కూడా సభ్యుడు. ఇట్టి అనుభవాల మార్పిడికి కామ్రేడ్ రాజశేఖరరెడ్డి ఒరవడి పెట్టారు. డాక్టరు అధికారి ఈ కృషిని ఎంతగానో ప్రశంసించారు.

ఫ్రెంచి, ఇటాలియన్ కమ్యూనిస్టు పార్టీలు ఇంకా ఇతర పార్టీల సైద్ధాంతిక కృషి గురించిన ప్రశ్న పార్టీ కేంద్ర ఎడ్యుకేషన్ డిపార్టుమెంటులో ఒక రోజున చర్చకు వచ్చింది. ఆ రోజునే ప్రాగ్ నుండి న్యూఢిల్లీ వచ్చిన "వరల్డ్ మార్క్సిస్టు రివ్యూ" ప్రతినిధితో రెండు రోజులపాటు డిపార్ట్‌మెంట్ సభ్యులు సుదీర్ఘ చర్చలు జరిపారు. ప్రపంచ

కమ్యూనిస్టు పార్టీల అనుభవాలను ఆకళింపు చేసుకోవాలనే తపన, అంతర్జాతీయతా భావం కామ్రేడ్ రాజశేఖరరెడ్డిలో ప్రగాఢంగా వ్యక్తమవుతూ వుండేది.

ఇటీవల సంభవించిన అంతర్జాతీయ పరిణామాలు, సోవియట్ యూనియన్ విచ్ఛిత్తి, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి తగిలిన ఎదురుదెబ్బలు కామ్రేడ్ రాజశేఖర రెడ్డిగారిని బాగా కలచివేశాయి. ఏమి జరిగింది? ఎలా జరిగింది? ఈ ప్రశ్నలకు సమాధానాల అన్వేషణలోనే ఎక్కువ కాలం ఆలోచించారు. గడిపారు.

సోషలిస్టు సామాజిక పరివర్తన సుదీర్ఘ క్రమంతో కూడినది. పెట్టుబడిదారీ సమాజం 1789 ఫ్రెంచి విప్లవం నుంచి వివిధ దశలలో పరిణామం చెందుతున్నది గదా! సోషలిజం పరిణామ క్రమంలో సోవియట్ యూనియన్ సమాజ నిర్మాణం ఒక దశ, ఇలా సాగింది ఆయన ఆలోచన.

సోషలిజం పరివర్తన క్రమం ప్రజాస్వామ్యం ప్రాతిపదికగా సాగాలి. కమ్యూనిస్టు పార్టీ నిర్మాణంలో అంతరంగిక ప్రజాస్వామ్యం పెంపొందే రీతిలో నిర్మాణ సూత్రాలను ప్రతి ఒక్క కమ్యూనిస్టుపార్టీ రూపొందించుకోవాలి. ఆయా దేశాల సామాజిక, ఆర్థిక పరిస్థితులు, రాజకీయ వ్యవస్థను పరిగణనలోకి తీసుకోవాలి. భారత కమ్యూనిస్టు పార్టీ నిర్మాణంలో ఈ దిశగా మార్పులు రావాలని ప్రగాఢంగా వాంఛించారు. ఈ దేశంలో సామాజికవర్గాలు, కులాల పొందికను కూడా దృష్టిలో పెట్టుకోవాలి. భావ వ్యక్తీకరణ స్వేచ్ఛకు ప్రజాస్వామిక వాతావరణాన్ని పార్టీలో పెంపొందించాలి. ఈ విషయంలో నాయకత్వ కమిటీల బాధ్యత ముఖ్యమైనది. దీనికి చైతన్యయుతమైన కృషి అన్ని స్థాయిలలో అవసరం. కార్యకర్తల శిక్షణ అట్టి స్ఫూర్తితోనే కొనసాగిందనేది ఆయన దృఢాభిప్రాయం.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి పార్టీ కేంద్ర బాధ్యతలలో వుండగానే పార్టీ ఎడ్యుకేషన్ కార్యకలాపాలు నిరాఘాటంగా కొనసాగేందుకు, దానిని వ్యవస్థీకృతం చేసేందుకు శాశ్వతమైన ఏర్పాట్లు చేయాలని ఆలోచించారు. దానిలో భాగంగానే న్యూఢిల్లీకి 40 కిలోమీటర్ల దూరంలో సూరజ్‌ఖండ్ వద్ద ఫరీదాబాద్‌లో సువిశాలమైన స్థలంలో ఆధునిక సౌకర్యాలతో ఒక పెద్ద భవనాన్ని కేంద్ర పార్టీ నిర్మించింది. ఆయన ప్రత్యక్ష పర్యవేక్షణలో ఆ భవన నిర్మాణం పూర్తయింది. తొలి పాఠశాలను మహిళలకు నిర్వహించారు. హిందీ ప్రాంతాలలో పార్టీ నిర్మాణ విస్తరణకు ఆ రాష్ట్రాల కార్యకర్తలకు ఒక ప్రత్యేక పాఠశాలను నిర్వహించారు.

ఢిల్లీ నుండి హైద్రాబాద్‌కు తిరిగి వచ్చిన అనంతరం, పార్టీలో అన్ని పదవుల నుండి స్వచ్ఛందంగా తప్పుకున్న తరువాత కూడా పార్టీ పెద్దగా, రాష్ట్రపార్టీ కార్యవర్గ

ప్రత్యేక ఆహ్వానితులుగా, సాధారణ పార్టీ సభ్యుడిగా చివరి నిముషం వరకు పార్టీకి అంకితభావంతో సేవచేస్తూనే తుదిశ్వాస విడిచారు.

1994 సంవత్సరం వేసవిలో కేంద్రపార్టీ అధ్వర్యంలో హైద్రాబాద్ మఖ్దుం భవన్‌లో వర్క్‌షాప్ జరిగింది. అనారోగ్యంతో బాధపడుతున్నప్పటికీ ఒకరోజు పూర్తిగా చర్చలలో పాల్గొన్నారు. రాష్ట్రపార్టీ ఆధ్వర్యంలో మరో వర్క్‌షాపు అదే కాలంలో నిర్వహించబడింది. సోషలిస్టు దేశాలలో పరిణామాలపై ఒక పత్రాన్ని తయారుచేసి చర్చకు ప్రవేశపెట్ట వలసిందిగా ఆయనను అభ్యర్థించాం. ఆ ప్రతిపాదనను సంతోషంతో అంగీకరించి చర్చను నిర్వహించారు. కడప, అనంతపురం, రంగారెడ్డి, ఇతర జిల్లాల కామ్రేడ్స్ కోరగానే, ఆ జిల్లాలకు వెళ్ళి కార్యకర్తల శిక్షణా తరగతులలో పాల్గొన్నారు.

సోషలిజం కూలిపోయిన దేశాలలోనే తిరిగి వామపక్షశక్తులు, కమ్యూనిస్టులు క్రమక్రమంగా విజయాలు సాధిస్తుండటంతో ఆయన దేహం శిధిలమవుతున్నా, హృదయం ఉత్సాహంతో ఉప్పొంగేది. ఆ పరిణామాలను ఆసక్తితో తెలుసుకునేవారు. భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం నూతన స్ఫూర్తితో పురోగమించే అవకాశాలు ఆచిరకాలంలోనే ఏర్పడతాయనే ఆశాభావంతోనే ఆయన ఆలోచన, సంభాషణ ఉండేది.

ఆ విశ్వాసంతోనే ఆయన కన్ను మూశారు. కమ్యూనిస్టు శ్రేణులకు కామ్రేడ్ రాజశేఖరరెడ్డిగారు ఒక గొప్ప సేనాని. ఉద్యమ ప్రయోజనాలు, పార్టీ శ్రేయస్సే జీవిత సర్వస్వంగా మనసా, వాచా, కర్మణా పాటించిన మహామనిషి.

**దిక్సూచిలో ముల్లులాగా లెనిన్ ఆలోచనలన్నీ యెప్పుడూ శ్రామిక ప్రజల వర్గ ప్రయోజనాల వైపే సర్వదా మొగ్గి వుండేవి.**

**- గోర్కీ**

# ధీరుడు, వినయ సంపన్నుడూ అయిన కమ్యూనిస్టు!

పి. మాణిక్యం

రాజశేఖర్ విద్యార్థి రోజుల గురించి ఎస్. రామకృష్ణన్ చెప్పగా విన్నాను. రామకృష్ణన్ బెనారస్ హిందూ యూనివర్సిటీలో చదువుకున్నాడు. ఆయన రాజశేఖర్‌కు మిత్రుడు, సన్నిహితుడు. రాజశేఖర్ అడయార్ థియోసాఫికల్ స్కూల్లో చదువుకున్నాడనీ, తన సోదరునితో కలసి వున్నాడనీ కూడా రామకృష్ణన్ స్వయంగా నాతో చెప్పారు. ఆయనకు తమిళం కూడా వచ్చు. అప్పట్లో మద్రాసులో ఆయన సోదరి వుండేది. వాళ్ళను చూడ్డానికి ఆయన అక్కడికి వస్తూవుండే వారు. అలా వచ్చినప్పుడు మద్రాసులో వున్న మా రాష్ట్ర కమిటీ ధర్మాన్ని ఆయనగారు దృష్టిలో వుంచుకొనే వారు. అయితే ప్రధమంగా ఆయన దృష్టి పెట్టేది పార్టీ పనికే. ఆయన ధోవతిని తమిళ పద్ధతిలోనే కట్టుకునేవారు. ఎంతో కాలంగా ఉన్న అలవాటు కదా!

ఆయన నిరంతర అధ్యయన శీలి. మార్క్సిస్టు సిద్ధాంతం గురించిన పుస్తకాలే కాదు. విజ్ఞాన శాస్త్ర గ్రంధాలు, చరిత్ర గ్రంధాలు, సాహిత్య గ్రంధాలు కూడా చదువుతూనే వుండేవారు. ఆయనకు బహు విధమైన ఆసక్తులు వుండేవి. ఆయన విషయజ్ఞుడు, మేధావి.

దేశంలోని భిన్న ప్రాంతాల కార్యకర్తలతో ఆయన కలసి మెలసి పని చేసేవాడు. వాళ్ళు తమ, తమ రంగాల్లో చేస్తూ వున్న పని గురించి ఆయనకు చెప్పేవారు. ఆయన శ్రద్ధగా వినేవాడు. క్రింద స్థాయిలో క్రియాశీల రంగంలో పనిచేసే కార్యకర్తలతో ఆయనకు చక్కని సంబంధాలు వుండేవి, ఆర్ద్ర సంబంధాలు వుండేవి. వాళ్ళతో ఆయన సన్నిహితంగా మెలిగేవాడు. దానితో వాళ్ళు ఆయనతో ఆత్మీయంగా వుండేవారు. ఇందువల్ల కార్యకర్తల సమస్యలేమిటో, క్రియాశీల రంగంలో సంక్లిష్ట స్వభావం ఏమిటో అవగతం చేసుకొనే అవకాశం రాజశేఖర్‌కు కలిగింది.

కార్యకర్తలకు ఆయన దర్శకత్వం అవసరం, ఉపయోగం. పార్టీ తరగతుల్లో ఆయన బోధించడం కార్యకర్తలకు ఉపయోగం. కార్యకర్తల సిద్ధాంత పరిజ్ఞానాన్ని, రాజకీయ రంగంలో ప్రస్తుత సమస్యల అవగాహననూ, ఆయన తులనాత్మకంగా పరిశీలించ ప్రయత్నం చేశారు.

నాయకుడిగా ఆయన ఎంతటి వాడైందీ జగద్విదితమే. ఆయన సమస్యను అవగాహన చేసుకొనేవారు, ముఖ్యంగా కామ్రేడులను సక్రమంగా నడిపించే రీతి అందరి

---

పి మాణిక్యం తమిళనాడు సి.పి.ఐ. నాయకులు

మన్ననలనూ అందుకున్నది. ఆయన ఎప్పుడూ పెత్తనం చెలాయించేవారు కాదు. సర్వదా ఆధారపడ దగ్గ సహచరునిగా వుండేవారు. అపరిమిత శక్తి సామర్థ్యం ఉన్నట్టు కనిపించేవారు.

అఖిల భారతస్థాయి రాజకీయ పాఠశాలలనూ, రాష్ట్రస్థాయి రాజకీయ పాఠశాలలనూ నిర్వహించేందుకు తీవ్రంగా కృషి చేసేవారు. పాఠ్యాంశాల్ని ఎంపిక చేసేవారు. సరైన ఉపాధ్యాయులను సరిఅయిన బోధనాంశాలకు ఎంపిక చేసేవారు. దేవీ ప్రసాద్ ఛటోపాధ్యాయ, దిలీప్ బోస్, గాతిక నక్వే మొదలైన మేధావులను పార్టీ పాఠశాలల కోసం రప్పించేవారు. పార్టీ జీవితంలో పార్టీ విద్య ఒక భాగం. కామ్రేడ్ రాజశేఖర్ పార్టీకి చేసిన మహోపకారం యిది.

సైద్ధాంతిక వాగ్వివాదాల్లో ఆయన ఆలోచన యేమాత్రం గజిబిజి లేకుండా స్పష్టంగా వుండేది. తన అభిప్రాయాలను తేటతెల్లంగా వెల్లడించేవారు. గోర్బచేవ్ నూతన సిద్ధాంతం ప్రతిపాదించారు. దానిని పార్టీ ప్రముఖ స్థానం నుంచి రాజ శేఖర్ వ్యతిరేకించారు. ఆర్థిక రంగంలో గోర్బచేవ్ తెచ్చిన మార్పు అనేదేమీ లేదు, కానీ సోవియట్ యూనియన్‌లో పార్టీ బలహీనతలను దుయ్యబట్టాడు. దాని పర్యవసానం సోవియట్ యూనియన్‌లో పార్టీనాశనం అయింది. రాజశేఖర్ దీనికి వ్యతిరేకంగా గట్టిగా వాదించారు. సిద్ధాంతపరంగా ఆయన స్థైర్యం అది.

ఆయన నిరాడంబరంగా బతికారు. భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణ యత్నానికి అంకితం అయ్యారు. ఆయన ఆంధ్ర, తమిళనాడు రాష్ట్రాలకు నేరుగా చేసిన సేవలు అందరికీ తెలిసినవే. పుట్టింది సంపన్న కుటుంబంలో, బతికింది పేదలకోసం. తుది శ్వాస విడిచేదాకా అణగారిన ఆర్తుల సేవకే అంకితం అయిందాయన జీవితం. ఆయన కార్మికోద్యమం కోసం, కమ్యూనిస్టు ఉద్యమం కోసం చేసిన సేవలు చెరగనివి, చెరపలేనివి. ఆయన జీవితం, కృషి మన చరిత్రలో భాగమయ్యాయని చెప్పగలను.

**లెనిన్‌లో కనిపించే విశిష్ట లక్షణం నిరాడంబరత,**

**సత్యంలా నిరాడంబరుడు ఆయన.**

*- గోర్కీ*



# ఆత్మీయుడు, ఆదర్శ కమ్యూనిస్టు కామ్రేడ్ రాజశేఖరరెడ్డి

- కె. ప్రతాపరెడ్డి

కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డిగారి జీవిత చరిత్రను గ్రంథస్తం చేస్తున్నట్లు తెలిసి ఎంతో సంతోషిస్తున్నాను. వారి సుదీర్ఘ రాజకీయ జీవితం యీనాటి తరానికి ఆదర్శం, మార్గదర్శకం అవుతుందని ఆశిస్తున్నాను.

అమరజీవి రాజశేఖరరెడ్డిగారి గురించి ఒక వ్యాసం పంపమని కోరారు. ఆ లేఖ అంది చాలా రోజులయ్యింది. ప్రతిరోజూ గడిచి పోతుంది. ఏమి రాయాలో? ఎలా ప్రారంభించాలో? వారిలోని ఏ విశిష్ట లక్షణాన్ని ప్రస్తావించాలో అర్థం కావడంలేదు. కలం కదలడం లేదు. ఆయనొక కవో, రచయితో అయితే వారి రచనల విశిష్టతను వివరించవచ్చు. వారు ఉన్నత ప్రభుత్వ పదవులు పొంది వుంటే - ఆ పదవుల గొప్ప తనాన్ని ప్రస్తావించవచ్చు. కానీ, రాజశేఖరరెడ్డిగారు పదవుల కోసం పాకులాడలేదు. సన్మానాలూ-సత్కారాలూ పొందలేదు. తన సేవకు ప్రతిఫలం ఆశించలేదు. తన జీవితాన్ని దేశసేవకు విప్లవోద్యమానికి అంకితం చేశారు. కష్టనష్టాలు భరించారు. కారాగారశిక్ష అనుభవించారు. ధనవంతుల బిడ్డగా పుట్టి పేదల పక్షపాతిగా నిలిచారు. ఐదు దశాబ్దాలపాటు ఆంధ్రదేశ విప్లవోద్యమంలో అగ్రశ్రేణి నాయకుల్లో ఒకరుగా, భారత కమ్యూనిస్టు పార్టీ రాష్ట్ర కార్యదర్శిగా, కేంద్ర కార్యవర్గ సభ్యులుగా కృషి చేశారు.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి మచ్చలేని రాజకీయనాయకుడు, మానవతావాది, మార్క్సిస్టు మేధావి, నిష్కళంక దేశభక్తుడు, సకల సద్గుణాలు కలిగిన రాజకీయవేత్త. ఆయనొక రాజకీయ విజ్ఞాన సర్వస్వం.

రాజశేఖరరెడ్డిగారు భౌతికంగా దూరమైనా, ఆ రూపం, ఆ నడక, ప్రతి మాట ఆచితూచి పలికే తీరు, నిరాడంబరత్వం, నిండు కుండలాంటి మనస్సు - యింకా కళ్ళ ముందు కదులుతున్నట్లున్నాయి. ప్రతి అంశాన్ని ఎందుకు? అన్న ప్రశ్నతో పరిశీలించడం, ప్రశాంతంగా ఆలోచించడం తన అభిప్రాయాన్ని స్వచ్ఛంగా, స్పష్టంగా, సూటిగా చెప్పడం, అనవసర పదజాలం, ఆవేశపు మాటలు లేకపోవడం అనుకున్నది సాధించాలనే పట్టుదల-ఆచరణ యోగ్యమైన కార్యాచరణ, క్రమశిక్షణ-తప్పకుండా రాజకీయ అభిప్రాయాలలో రాజీ పడకుండా-విమర్శకు జంకని-ఆత్మ విమర్శకు వెనుకాడని విశిష్ట లక్షణాలు కామ్రేడ్ రాజశేఖరరెడ్డివి.

విమర్శ - ఆత్మ విమర్శ విప్లవకారులకు పదును బెట్టే సాధనంగా భావించాడు. రాజకీయంగా విభేదించినా - వ్యక్తిగతంగా ద్వేషభావం ఎరగడు. అప్యాయంగా

పలకరించడం - ఆత్మీయుడుగా ఆదరించడం - సామాన్య కార్యకర్తలతో సైతం కలిసిమెలిసి వుండటం-వారి మంచిచెడ్డలు తెలుసుకోవడం. సలహా-సహకారాలందించడం-ఆయన ప్రత్యేక లక్షణాలు. కార్యకర్తల శక్తి సామర్థ్యాలు-అభిరుచి, ఆసక్తి గమనించి - ఆయా రంగాలలో వారిని అభివృద్ధి చేయడానికి ప్రత్యేక శ్రద్ధ కనబరిచారు. రాజకీయ నాయకుడిగానే కాకుండ - ఒక కుటుంబపెద్దగా యువతరానికి ఆత్మీయుడయ్యారు. ప్రతి పార్టీ కుటుంబంతో ప్రత్యక్ష సంబంధాలు కలిగి వారి బాగోగులు విచారించడం ఆయన ఆత్మీయతకు నిదర్శనం.

విప్లవోద్యమానికి సిద్ధాంతం - ఆచరణ విడదీయరాని మౌలిక సూత్రాలని, "సిద్ధాంతంలేని ఆచరణ గుడ్డిది - ఆచరణలేని సిద్ధాంతం గొడ్డుది" అన్న లెనిన్ సూత్రీకరణను అనుసరించి, ఆచరించి, వేలాది మంది కార్యకర్తలకు బోధించారు. పార్టీలో రాజకీయ శిక్షణకు అత్యంత ప్రాముఖ్యతనిచ్చారు. రాజకీయ శిక్షణనొక ఉద్యమంగా నడిపి-వేలాది మంది యువతీ-యువకులను పార్టీలో కార్యకర్తలుగా, నాయకులుగా అభివృద్ధి చెందడానికి కామ్రేడ్ రాజశేఖరరెడ్డి చేసిన కృషి మరవలేనిది. మూడున్నర దశాబ్దాల కాలం వారితో నాకున్న సన్నిహిత సంబంధంలో సిద్ధాంతకర్తగా, నిర్మాణ దక్షునిగా, ఉద్యమనేతగా వారికున్న ప్రతిభను చూశాను.

ఈ సందర్భంగా - రెండు - మూడు సంఘటనలు - నా వ్యక్తిగత అనుభవంలో మరువలేను.

**1964** సంవత్సరంలో సిద్ధాంత రాజకీయ విభేదాలతో భారత కమ్యూనిస్టు పార్టీ చీలిపోయింది. అప్పుడు నేను విద్యార్థి, యువజన ఉద్యమాల్లో హైదరాబాదు నగర పార్టీలో పనిచేస్తున్నాను. రాష్ట్ర పార్టీ కార్యదర్శిగా రాజశేఖరరెడ్డిగారున్నారు. రాష్ట్ర పార్టీ ఆఫీసు సెక్రటరీగా పని చేయాలని నన్ను కోరారు. ఉద్యమంలో పనిచేస్తూ-ఒక ప్రైవేట్ సంస్థలో ఉద్యోగం చేస్తున్నాను. పార్టీ వేతనంపై పనిచేయడం, ఉద్యమాల్లో కాకుండా పార్టీ ఆఫీసులో పనిచేయడం నాకిష్టం లేదు. నా అభిప్రాయాన్ని వారికి చెప్పాను. నేను చెప్పిన కారణాలతో వారు ఏకీభవించారు.

రెండు సంవత్సరాలు గడిచాయి. అప్పుడు నేను ఉద్యోగం చేస్తూనే-హైదరాబాదు నగరపార్టీ సహాయ కార్యదర్శిగా, విద్యార్థి-యువజన రంగాలలో బాధ్యుడుగా వున్నాను. ఒక రోజు రాజశేఖరరెడ్డిగారూ, తమ్మారెడ్డి సత్యనారాయణగారు నన్ను పిలిచి-రాష్ట్ర పార్టీ ఆఫీస్ సెక్రటరీ బాధ్యతలు తీసుకోకతప్పదన్నారు. నేను సందేహించాను.

"రాష్ట్రపార్టీ ఆఫీస్ సెక్రటరీ అంటే గుమస్తా పని కాదు. చాలా బాధ్యతగలది. ఆ స్థానంలో సరియైన వ్యక్తి లేకపోతే - రాష్ట్రపార్టీ కార్యదర్శి బాధ్యతతోపాటు ఆ పని కూడా నేనే చేయవలసి వస్తుంది. We need a responsible person. we think you are

suitable for that responsibility" అన్నారు రాజశేఖరరెడ్డిగారు. నేను కాదనలేకపోయాను. వెంటనే ఉద్యోగానికి రాజీనామా చేసి బాధ్యతలు తీసుకున్నాను. రెండు సంవత్సరాల పాటు నా విధి నిర్వహణలో ఎన్నడూ ఆయన జోక్యం చేసుకోలేదు. ఎందుకు? ఏమిటి అని ప్రశ్నించలేదు. సమిష్టి నిర్ణయం వ్యక్తిగత బాధ్యత అన్న సూత్రాన్ని పాటించిన వ్యక్తి రాజశేఖరరెడ్డిగారు.

1967 శాసనసభ ఎన్నికల తర్వాత - యువజన రంగంలో పూర్తికాలం పని చేయాలన్న నా అభిప్రాయాన్ని రాజశేఖరరెడ్డిగారికి చెప్పాను. హైదరాబాదు నగరపార్టీ సహాయకార్యదర్శి, రాష్ట్రపార్టీ ఆఫీసు సెక్రటరీ బాధ్యతలను విరమించుకోవాలన్న నా నిర్ణయాన్ని చెప్పాను. అపుడు యువజన రంగం స్తబ్దతలో ఉంది. యువజన రంగంలో పనిచేసే ముఖ్యమైన కార్యకర్తలను పార్టీ చీలిక తర్వాత పార్టీ నిర్మాణం, విశాలాంధ్ర పత్రిక, మొదలైన రంగాలకు మార్చడం జరిగింది.

"నువ్వు నిర్వహిస్తున్న బాధ్యతల కంటే యువజన రంగం అంత ముఖ్యమైన దనుకుంటున్నావా?" అని ప్రశ్నించారు.

"ఎందుకు యువజన రంగంలో పనిచేయాలనుకుంటున్నావు?"

"దాని కార్యక్రమమేమిటి?"

"ఎందుకు ఈ ఆలోచన వచ్చింది?"

అని రకరకాల ప్రశ్నలడిగారు. నేను సరైన సమాధానంతో వారిని సంతృప్తి పరచలేకపోయాను. యక్షప్రశ్నలతో వేధిస్తున్నాడనుకున్నాను. చివరికి చిరునవ్వుతో "నువ్వు అంత పట్టుదలతో వుంటే నేనెందుకు కాదంటాను! నీ పట్టుదల-ఆసక్తి-నీకు ఆ రంగంపై వున్న విశ్వాసాన్ని తెలుసుకోవడానికే యిన్ని ప్రశ్నలు వేశాను. But, still I think you are in wrong direction! నీ రాజకీయ జీవితాన్ని వృధా చేసుకుంటున్నావు. This is a test for you"అని నా శ్రేయోభిలాషిగా హెచ్చరించారు. పార్టీ హోల్‌టైమర్‌గా యువజన రంగంలో పనిచేయడానికి అనుమతించారు.

"ఇది నీకు పరీక్ష?" అన్న రాజశేఖరరెడ్డిగారి హెచ్చరిక నాకు పదేపదే గుర్తుకొచ్చేది. నా తోటి కామ్రేడ్స్‌తో కలిసి ఆనతికాలంలోనే యువజన సమాఖ్య పునర్నిర్మాణం చేశాం. రాష్ట్ర వ్యాపిత ఉద్యమంగా వచ్చింది. యువజన రంగ ప్రాముఖ్యతను గుర్తించి ప్రత్యేక శ్రద్ధను చూపారు. యువజన రాజకీయ శిబిరాలు - శిక్షణ తరగతుల నిర్వాహణకు, హోల్‌టైమర్ల నియామకానికి అత్యంత ప్రాధాన్యతనిచ్చారు. రాష్ట్రంలో యువజనోద్యమం అభివృద్ధి చెందడానికి, వేలాది మంది యువతీ-యువకులు రాజకీయ చైతన్యం పొందడానికి రాజశేఖరరెడ్డిగారు ప్రత్యేక శ్రద్ధ తీసుకున్నారు.

అనేక సందర్భాల్లో వారి అభిప్రాయాలతో నేను విభేదించాను. కానీ-ఎన్నడు ఎందుకలా అని ప్రశ్నించలేదు. నా ఎడల వారికున్న ఆత్మీయత చెడలేదు.

మరో సంఘటన :

1989 ఎన్నికల తర్వాత రాష్ట్రసమితి సమావేశం జరుగుతోంది. చర్చలు వేడిగా వాడిగా సాగుతున్నాయి. సభ్యుల మనోభావాలు అర్థం చేసుకున్న రాజశేఖరరెడ్డిగారు- ఎంతో ఆవేదనతో ప్రసంగించారు. ఆయనలో అంత ఆవేదన-ఆవేశం నేనెప్పుడూ చూడలేదు. మాట్లాడిన తర్వాత కొద్దిసేపటికి నెమ్మదిగా హాల్లో నుంచి బయటికి నడుస్తున్నారు. ఆయన ముఖంలో ఏదో మార్పు చూశాను. ఆయన వెనకాలే బయటికి నడిచాను. బయట కుర్చీలో కూర్చుని -

"ప్రతాప్... ఆఫీసు కారుందా?" అన్నాడు.

"చూస్తాను" అన్నాను.

"లేకపోతే ఒక టాక్సీ తెప్పించు"

"ఎక్కడికి?" అన్నాను.

"నిమ్సుకి... ఏమీ లేదు కొద్దిగా అన్‌ఈజీగా వుంది"

మామూలు ధోరణిలోనే అన్నారు.

నాకు అర్థమయ్యింది. హడావుడిగా కిందికి వెళ్ళి కారు ఏర్పాటు చేసి నెమ్మదిగా కారులో ఎక్కించాను. పక్కన కూర్చున్నాను. కారు అసెంబ్లీహాల్ సమీపంలో వుంది. రాజశేఖరరెడ్డిగారు ఆయాసపడుతున్నారు. ఎక్కిళ్లు ప్రారంభమయ్యాయి. నాకు కంగారు పుట్టింది. "మంచి నీళ్ళున్నాయా?" నెమ్మదిగా అడిగారు. కార్లో నీళ్ళు లేవు. దారిలో హోటల్, షాపు వుంటే ఆపమని డ్రైవర్‌తో చెప్పాను.

"అక్కరలేదు... దగ్గరేగద... పోనీ" అన్నారు.

ఎక్కిళ్ళు ఎక్కువైనాయి. నాకు ఖంగారు మరింత ఎక్కువయ్యింది. అప్పుడు నీళ్ళు తాగొచ్చో - లేదో తెలియదు. కారును వేగంగా పోనియ్యమన్నాను.

నిమ్స్ చేరగానే డాక్టర్లు పరీక్షించి ఎమర్జెన్సీ వార్డులో వుంచి ఆక్సిజన్ ఎక్కించారు. రెండు రోజుల తర్వాత రాజశేఖరరెడ్డిగారు కోలుకున్నారు. నన్ను చూడగానే "ఎందుకంత ఖంగారుపడ్డావు. ఈ వయసులో యివన్నీ మామూలే"నన్నారు.

అంత గుండెనిబ్బరం గల మనిషి.

ఆ మనిషి కళ్ళల్లో రెండు సార్లు కంటతడి చూశాను.

ఒకటి కామ్రేడ్ తమ్మారెడ్డి సత్యనారాయణ, రెండు కామ్రేడ్ చంద్ర రాజేశ్వరరావు మరణించినప్పుడు.

చివరకు ఎంతోమంది ఆత్మీయుల, అభిమానుల-ఉద్యమ కార్యకర్తల కళ్ళల్లో నీళ్ళు నింపి - కామ్రేడ్ రాజశేఖరరెడ్డిగారు దూరమైపోయారు.

కానీ - చిరకాలం మన హృదయాల్లో వుండిపోయారు!



# మణులలో నీలం గొప్పది!

- ఆర్. వెంకటేశ్వర రావు

నవరత్నాలలోనూ నీలం ఒకటి. దాన్నే ఇంద్రనీలమణి అనీ అంటారు. హిందూ సాంప్రదాయంలో దేవుళ్ళుగా ఆరాధించే మహా పురుషులు శ్రీరాముడు, శ్రీకృష్ణుడు నీల వర్ణశోభికులని సంప్రదాయం. దుష్టశిక్షణకీ, శిష్ట రక్షణకీ నీలవర్ణులే సమర్థులనిపించేటట్టు విష్ణుమూర్తే అవతారాలు యెత్తేవాడు. అసలు నరక మంటూ ఒకటి లేకపోతే అలాంటి దాన్ని సృష్టించాలి. లేకపోతే నరమాంసం రుచి మరిగిన పెట్టుబడిదారుల్ని శిక్షించడం యెలా అంటాడు జాక్‌లండన్. ప్రపంచ సంపద పెరగడానికి శ్రమని ధారపోసే శ్రామికులే శిష్టులు. వాళ్ళు బాధాసర్పదష్టులు. వాళ్ళని విముక్తం చేసేందుకే ఎర్ర జెండా రెపరెపలాడింది. భారత కమ్యూనిస్టు ఉద్యమంలో యీ లోహిత వర్ణం 'నీలం'తో కలిసింది. నీల లోహితం అంటుంది ఉద్యమం. పురాణ నాయకుల వర్ణం నీలంలో వుంటే యీ ఉద్యమనాయకుడి ఇంటి పేరే నీలం అయింది. నాయకమణులలో గొప్పదై ప్రకాశించింది.

ప్రజాసేవకే అంకితమై విలసిల్లిన నీలం కుటుంబం దేశ రాజకీయ చరిత్రలోనే ఘనత సాధించింది. తనదైన ముద్ర వేసింది. ఆ కుటుంబ సభ్యులు తాము యెంచుకున్న జీవిత మార్గాల్లో తమదిగా ప్రత్యేక స్థానం సంపాదించుకున్నారు.

భారత కమ్యూనిస్టు పార్టీకి నీలం కుటుంబం అందించిన కానుక రాజశేఖరరెడ్డి. ఇంటి పేరులోని ఔన్నత్యం యెంతటిదో, యీ పేరులోని ఔన్నత్యం అంతటిదే.

రాజశేఖరరెడ్డిగారు సిద్ధాంతం ఆపోశన పట్టేరు. సిద్ధాంతం ఆచరణకు కరదీపికగా వుండాలని తరుచు అంటూ వుండడం వింటాం కానీ క్రియకు వచ్చేటప్పటకి రొడ్డ కొట్టుడు పద్ధతిలోనే బండగా అమలు జరపడం కనిపిస్తూ వుంటుంది. ఎలా అన్వయించాలీ అన్న అవగాహన లోపం వల్ల యీ ప్రమాదం తలెత్తుతూ వుంటుంది. సిద్ధాంతాన్ని కరదీపికగా ఉపయోగపెట్టుకోడానికి సిద్ధాంత పరిజ్ఞానం ఒక్కటే చాలదు, అమలు చేసే విజ్ఞత కూడా వుండాలి. జీవిత సమస్యల్ని పరిశీలించేందుకు సిద్ధాంతం ఉపయోగపడుతుంది. విశ్లేషణ చేసేందుకు ఆసరా అవుతుంది. వాటి పరిష్కారం ఆ వెలుగులో చెయ్యడానికి విజ్ఞత కావాలి. రాజశేఖరరెడ్డిగారు గాఢమైన సిద్ధాంత పరిజ్ఞానం వున్నవాడే కాదు, యెలా పరిస్థితులకు అన్వయించుకోవాలో తెలిసిన విజ్ఞులు.

ఆయన పార్టీ ఎడ్యుకేషన్ విభాగం చూసినారు. పార్టీ కార్యకర్తలకు సిద్ధాంత పరిజ్ఞానం కలిగించవలసిన అవసరం యెంతటిదో ఆయనకు బాగా తెలుసు. పార్టీ కార్యకర్తలు యెప్పుడూ యేదో ఉద్యమాల్లో, ఆందోళనల్లో తలమునకలై వుంటారు.

చదువుకునే వ్యవధి ఉండదు. అంచేత ముందు కార్యక్రమం, తర్వాత చదువు అనే వైఖరిలో వుండడం ఎక్కువగా కనిపించేది. యిలాంటి వైఖరిలోని వైరుధ్యాన్ని ఆయన యెత్తి చూపించేవారు. చదువనేది ఏదో తీరిక వేళల్లో సాగే వ్యాపకం కాదు. కులాసా వ్యవహారం కాదు, చదువు, ఆచరణ రెండూ కలిసి సాగాలని ఆయన హెచ్చరించేవారు. అలాగే మహిళా విభాగంలో పని చేసే మహిళా కార్యకర్తల చదువు గురించి ఆయన హెచ్చరిస్తూ వుండేవారు. చంటి పిల్లలతో వున్న మహిళలు చదువు కోవడం కష్టమని ఆ కారణంగా వాళ్ళని పాఠశాలలకు పిలవడం లేదనీ కొందరు అభిప్రాయ పడేవారు. పాఠశాల జరిగే సమయంలో యే ఆయానో పిల్లల్ని చూడటానికి పెట్టి మహిళలకు తరగతులు నిర్వహించాలి కానీ ఈ కారణంగా వాళ్ళని చదువుకు దూరం చెయ్యడం యేమిటని ఆయన సూచించేవారు. తను స్వయంగా క్లాసులు తీసుకొనేవారు. చదువు, ఆచరణ అనే వాటి గురించి ఆయన యింత నిశితమైన గతి తార్కిక దృష్టి పెట్టేవారు. ఒకటి వుండి రెండవది కుదరదు అనే వైరుధ్య అంతరం వుండకూడదన్నది ఆయన అభిప్రాయం. రెండూ కలిసే వుంటాయి. యేదీ రెండోదాన్ని లుప్తం చెయ్యదు అన్నది ఆయన అభిప్రాయం. రాష్ట్రంలోగానీ, కేంద్రంలోగానీ పాఠశాలలు నిర్వహించేందుకు ఆయన చాలా ప్రణాళికాబద్ధంగా వుండేవారు. సిలబస్ విషయంలో, విద్యార్థుల ఎంపిక విషయంలో, తరగతుల నిర్వహణ విషయంలో చాలా శ్రద్ధ చూపించేవారు. ఆయన తీసుకున్న క్లాసులో నేను కూడా వున్నాను. ఆయన బోధనా పద్ధతి గురించి చెప్పడం పునరుక్తి దోషం అవుతుంది. ఆయన యెంతటి సిద్ధాంత పరిజ్ఞానం వున్నవాడో అంతటి ఉత్తమ బోధకుడు కూడా. యే విషయాన్నైనా మార్క్సిస్టు సిద్ధాంత దృక్కోణం నుంచి యెలా పరిశీలించాలో ఆయన నుంచి నేర్చుకోవలసిందే. సిద్ధాంతం ఆయన ఆలోచనా ధోరణిలో భాగం అయినందువల్లనే ఆయన పరిశీలన అంత నిశితంగా వుండేది. ఆయన వివరించే తీరు అంత స్పష్టతతోనూ వుండేది.

రాజకీయ సిద్ధాంత వేత్తగా ఆయన యెంతో పరిణితుడు. రాష్ట్రంలో, కేంద్రంలో జరిగే రాజకీయ పరిణామాల గురించి ఆయన నిర్దుష్టమైన పరిశీలన చేసేవాడు. ప్రభుత్వాల వర్గ పొందికను గురించి, ప్రభుత్వాధిపతుల సహజ(వర్గ) స్వభావాల గురించీ స్పష్టమైన వివరణలు యిచ్చేవాడు. రాష్ట్రంలోగానీ, కేంద్రంలోగానీ యే ప్రభుత్వమైనా రాజ్యాంగబద్ధ పరిమితులకు లోబడి పని చెయ్యాలన్న విషయం విదితమే. అయినా ఆయా సందర్భాల్లో సంఘటనలు ప్రభావితం అవుతాయి. ఉదాహరణకు తీవ్రవాదం, శాంతి భద్రతలు, వ్యవసాయ సంస్కరణలు లాంటి సమస్యలున్నాయనుకోండి. వీటిని పరిష్కరించడంలో ప్రభుత్వాధినేతల అభిప్రాయాల ప్రభావం కూడా పని చేస్తుంది. యీ కారణంగానే ఫలానా ఆయన కరకు, ఫలానా ఆయన మెతక, ఫలానా ఆయన

తాత్సారం చేస్తూ వుంటాడని వాళ్ళ, వాళ్ళ పనులని బట్టి అంచనా కడుతూ వుంటారు. వాళ్ళ పని తీరును బట్టి ఆయా సంఘటనలు ప్రభావితం అవుతూ వుంటాయి. ఇలాంటి రాజకీయపరమైన అంచనాలను రాజశేఖరరెడ్డి వెయ్యగలిగేవారు. రాజకీయ నాయకుడు తక్షణ సమస్యల గురించే కాక ఓ మాదిరి సమీప భవిష్యత్తు గురించి కూడా విశ్లేషించ గలిగివుండాలి.

పార్టీ పత్రికల్లో ఆయన అనేక వ్యాసాలు రాసేవారు. అనేక సమస్యల గురించి చర్చించేవారు. యెలా సమస్యల్ని దర్శించాలో, పరిష్కరించాలో చూపించేవారు. "పార్టీ లైఫ్"లో ఆయన రాసిన వ్యాసాలు అన్నీ యిందుకు ఉదాహరణగా చూపించదగ్గవే.

రాజకీయ నాయకునిగా, మార్క్సిస్టు సిద్ధాంతవేత్తగా ఆయన యెంత లోతైన మనిషో, వ్యక్తిగా అంతే సౌమ్యుడు. ఆయన వాత్సల్యం యెంతటిదో అందుకు పాత్రుడినైన నాకు స్వయంగా తెలుసు.

సభల్లో, సమావేశాల్లో ఆయన్ని చూస్తూ వుండేవాళ్ళం. అప్పట్లో వ్యక్తిగతంగా పరిచయం లేదు. అప్పట్లో కడప కాలేజీలో పనిచేస్తూ వుండేవాణ్ణి. పార్లమెంటు సభ్యులు వై. ఈశ్వరరెడ్డిగారు, రా.రా., గజ్జల మల్లారెడ్డి మా యింటికి వస్తూ వుండేవారు. 67 ఎన్నికలప్పుడు కామోసు రాజశేఖరరెడ్డిగారు కడప మీటింగుకు వచ్చేరు. అప్పుడు మల్లారెడ్డి పిల్లల చదువు కోసం కడపలో మకాంపెట్టి మాకు దగ్గర్లోనే వుండేవాడు. మీటింగు ఆయిన మర్నాడు పొద్దున్నే మల్లారెడ్డి ఆయన్ని మా యింటికి తీసుకొచ్చేడు. అదే వ్యక్తిగతంగా ఆయనతో పరిచయమవడం. ఆ తర్వాత చాలాసార్లు ఆయన్ని కలుసుకున్నాను. 'అరసం' పునరుజ్జీవన సమయంలో లెక్చరర్ల సమావేశ సందర్భాల్లో ఆయన్ని చాలాసార్లు కలవడం, మా విషయాలు చర్చించడం, ఆయన సలహా తీసు కోవడం జరిగాయి. ఆయన చాలా నిబ్బరంగా మాట్లాడేవారు. ఎప్పుడూ తొందర పడటం కనిపించలేదు. కోపం తెచ్చుకోవడం కూడా యెరగను.

నేను మాస్కో ప్రగతి ప్రచురణాలయంలో అనువాదకునిగా వెళ్ళాను. అప్పటి నుంచీ ఆయన్ని మరింత సన్నిహితంగా చూసే అవకాశం కలిగింది. ఢిల్లీలో, మాస్కోలో ఆయన్ని కలిసేవాళ్ళం. ఎప్పుడు మాస్కో వచ్చినా హోటల్ రూమ్‌కు చేరుకోగానే నాకు ఫోన్ చేసేవారు. నేను వెళ్ళేవాణ్ణి. మాస్కోలో చదువుకొనే తెలుగు విద్యార్థుల్ని కూడా ఆయన పిలిచేవారు. అందరి యోగక్షేమాలూ వ్యక్తిగతంగా కనుక్కొనేవారు.

ఎప్పుడు మాస్కో వచ్చినా యేవో పచ్చళ్ళు పట్టుకొచ్చేవారు. ఏ దేశంలో వున్నప్పుడు ఆ దేశంలో దొరికే వాటినే తినాలని చాలా మంది నాయకులు అంటూ వుండేవారు. సూత్రరీత్యా ఆ ముక్క నిజమే అయినా, పుట్టి పెరిగిన వాతావరణంలోని అలవాట్లు ఒకంతటపోవు. మసాలాలు, ఆవు నేయి ఆంధ్రులకు మరీ అలవాటు.

అలవాటు అంటే రెండవ నైజం అని కదా అంటారు. చట్నీ వుంటే చద్ది కూడైనా తినేస్తారు. తెలుగు విద్యార్థులు అక్కడి ఆహార పదార్థాలకు అలవాటు పడినా ఓ అవకాయో, గోంగూర పచ్చడో, సాంబారో వుంటే "హమ్మయ్య" అని తృప్తి పడేవారు. విద్యార్థులే కాదు, చుట్టపు చూపుగా రెండు, మూడు వారాల పర్యటన నిమిత్తం మాస్కో వచ్చేవాళ్ళు కూడా మన మసాలాలు లేక జిహ్వ చచ్చిపోయిందని గోలపెట్టేవాళ్ళు. అలాంటి రుచుల్ని వదులుకోవడం అంత తేలికా? ఇలాంటి విషయాల్లో కొంత వెసులుబాటు వైఖరి వుండాలి. రాజశేఖరరెడ్డిగారికి అలాంటి విశాల దృక్పథం వుండేది. "ఎందుకండీ ఈ వూరగాయ సీసాలు, బరువు అంటే ఎందుకేమిటి, మీ యింటికి యెంత మందో వస్తూ వుంటారు. మన వంటకాలు కావాలంటూ వుంటారు", అని అందించేవారు. ఇంకా యేమన్నా కావాలా తెస్తా అనేవారు. ఏమీ వద్దని చెప్పేవాళ్ళం. అడక్కుండానే ఇలా ఏదో ఒకటి తెస్తున్నారు, అడిగితే యింకెంత బరువు మోసుకువస్తారో అని భయం.

ఆయన అంత నిరాడంబరంగా వుండటం మాకు ఆశ్చర్యం కలిగించేది. ఆయనకుగా ఆయన ఏమీ కావాలని అడిగేవారు కాదు. షాపింగ్‌కు కూడా ఆసక్తి వుండేది కాదు. మేమే బలవంతం చేసి "జెస్కిమోర్"కో (చిన్నపిల్లల షాప్) "గూమ్"కో (పెద్ద డిపార్టుమెంటల్ స్టోర్స్) తీసుకెళ్ళే వాళ్ళం.

ఆయన వైద్యం కోసం సెంట్రల్ కమిటీ హాస్పిటల్‌లో వున్నప్పుడు కూడా వారానికో, పది రోజులకో వెళ్ళి చూసి వచ్చేవాణ్ణి. చాలా మంది నాయకులు వచ్చేవారు. హాస్పిటల్‌కు వెళ్ళి చూసి వస్తూ వుండేవాళ్ళం. ఆ హాస్పిటల్ చాలా దూరం. ప్రపంచంలోని అతి వేగవంతమైన మెట్రో మాస్కో నగరంలోనే వుంది. అలాంటి ఫాస్ట్ సర్వీస్‌లో హాస్పిటల్ చేరడానికి గంటన్నర పట్టేది. హాస్పిటల్‌కు వెళ్ళాము అంటే ఆ పూట పని పోయినట్టే. అయినా వెళ్ళే వాళ్ళం. మన మాటకాని దేశం. నోరారా మాట్లాడుకునే మనిషి దొరకడు. అలాంటి నేపథ్యంలో మనవాళ్ళు అన్న మనిషి కనబడితే యెంత సంతోషం కలుగుతుందో ఊహించుకోవాల్సిందే. మా జిల్లా సర్వేశ్వరరావు హాస్పిటల్‌లో వున్నప్పుడు (పాపం ఆయన అక్కడే పోయేరు) యేమీ తినడం లేదని చెపితే ఇడ్లీలు చేయించి తీసుకువెళ్ళాను. అప్పటికే ఆయనకు తిండి హితవు పోయి, ఒక్కటి కూడా తినలేకపోయారు. సుందరయ్యగారు కూడా అదే గదిలో వుండేవారు. ఆయనకు ఎండు ద్రాక్ష పళ్ళు పట్టుకెళ్లి యిచ్చాను. ఆయన ఆ విషయం చూడ్డానికి వచ్చిన వాళ్ళందరితోనూ చెప్పేవాడు. అంచేత ఆత్మీయత అలా వుంటుంది. రాజశేఖరరెడ్డిగారు యేమీ వద్దనేవారు. పుస్తకాలు, పేపర్లు తెమ్మనేవారు. ఇంటర్‌నేషనల్ లైబ్రరీ నుంచి తీసుకున్న పుస్తకాలు కూడా పట్టుకెళ్ళి యిచ్చేవాణ్ణి. ఓసారి కాట్స్కీ అనే రచయిత పుస్తకం

"నియో మావోయిజమ్ ఇన్ ఇండియా" అన్న పుస్తకం పట్టుకెళ్ళి యిచ్చాను. తెలంగాణా పోరాట నేపధ్యంవున్న ఆ గ్రంధంలో భారతదేశ రాజకీయ పరిస్థితిని రైతాంగసాయుధ పోరాట పద్ధతినీ, కమ్యూనిస్టు సిద్ధాంత ఆచరణనీ వివరించాడు రచయిత. అందులోని అంశాలను గురించి ఆయన చర్చించడం నాకు బాగా గుర్తు వుంది.

ఆయనతో విద్యార్థులు సన్నిహితంగా మెలగగలిగేవారు. ఆయన హోదా, నాయకత్వ స్థానం మొదట్లో జంకు కలిగించేవి. అయితే ఆయన సముఖంలో అవన్నీ వెనక్కితగ్గి, కుటుంబపెద్దతో తమ కష్టసుఖాలు చెప్పుకునేటట్టు విద్యార్థులు తేలికపడే వారు. మాస్కోలో తెలుగు విద్యార్థులందరూ "వేదిక" అన్న సంస్థపేరు మీద మా యింట్లో నెల, నెలా గోష్ఠులు నిర్వహించుకునేవారు. ఎన్నో విషయాల గురించి చర్చలు చేసేవాళ్ళు. రాజశేఖరరెడ్డిగారు చాలా ఉత్సాహం యిచ్చి, తను మాస్కో వచ్చినప్పుడు పాల్గొనేవారు. విద్యార్థులు యితర దేశాలకు సందర్శనార్థం వెళ్ళేవారు. కొంత మంది రైల్లో మాస్కో నుంచి బీజింగ్ (ఆరు రోజుల పధ్నాలుగు గంటలు) వెళ్ళిన అనుభవం గురించి చెప్పేరు. "చద్దులు మూట కట్టుకు వెళ్ళండి" అని ఆయన వారం రోజుల రైలు ప్రయాణం గురించి చమత్కరించారు.

రాజశేఖరరెడ్డి మేధ, హృదయమూ కలిసి వున్న నాయకుడు. ఆయనతో సాన్నిహిత్యం కలగడం ఆయన అభిమానానికి పాత్రుణ్ణవడం నాకు చాలా గొప్ప.

**లెనిన్ చాలా సంవత్సరాలు విదేశాల్లో ప్రవాస జీవితం గడపవలసివచ్చింది. తరచు ఆయన కార్మిక సభలకు వెళ్తూవుండేవారు. వారి జీవితాలను పరిశీలించేవారు. వారితో సంభాషణాలు జరిపేవారు. తాను, తన భార్య చౌక గదుల్లో నివసిస్తూ చౌక భోజనం చేసేవారు. అందుకు భిన్నమైన జీవితం వారికి చేతకాదు. దీనిని బట్టి లెనిన్‌ని విరాగిగా అర్థం చేసుకోకూడదు. స్కేటింగ్అన్నా, కొండలెక్కడమన్నా, సైకిల్ తొక్కడ మన్నా, ఆయనకెంతో ఇష్టం. సంగీతమంటే ఆయన చెవి కోసుకునేవారు. జీవిత సౌందర్యం ఆయనను మైమరిపించేది. తన కామ్రేడ్స్‌నీ, ప్రజల్ని ఆయన ప్రేమించేవారు. ఆయన హాస్యం, వ్యంగ్యం యితరుల్ని ఆకట్టుకొనేవి.**

***- కంభంపాటి "కమ్యూనిస్టు నీతి" నుండి.***

# సి.ఆర్. లేకుండా యన్.ఆర్. లేదు

## కమ్యూనిస్టు ఉద్యమంలో వారి సహచర్యం అలాంటిది.



1968 కూలిదండు సందర్భంగా




1968 కూలిదండు సందర్భంగా హైద్రాబాద్‌లో సి.ఆర్., మగ్దూం, రాజశేఖరరెడ్డి



విశాఖలో జరిగిన రాష్ట్ర పార్టీ మహాసభ సందర్భంగా (ఎడమనుండి) ఆరుట్ల రామచంద్రారెడ్డి, దాసరి, ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి పిల్లలమర్రి, సంకు, బద్దం, కపర్దీ, చండ్ర, నీలం, యల్లమందారెడ్డి, డా॥వెంకట్రామారావు, వై.వి.కె., రాజ్‌బహదూర్



ఎడమ నుండి కుడికి : యస్.కుమారన్, భూపేష్‌గుప్త, చండ్ర రాజేశ్వరరావు, యస్.ఏ.డాంగే, గంగాధర అధికారి, నీలం రాజశేఖరరెడ్డి, ఇంద్రదేవ్ సిన్హా




70 సంవత్సరాలు దాటిన వృద్ధ కామ్రేడ్స్ మగ్దుం భవన్‌లో (1992)



కర్నాటక రాష్ట్ర పార్టీ మహాసభ సందర్భంగా కామ్రేడ్ ఎమ్.ఎస్.కృష్ణన్, సి.ఆర్.లతో



సి.ఆర్., ఇంద్రజిత్‌గుప్తాలతో



సి.ఆర్., గిరిప్రసాద్‌గార్లతో



హైదరాబాద్‌లో జరిగిన రాయలసీమ - తెలంగాణా ప్రాజెక్టుల ప్రదర్శనలో (1992)



1982 ఫిబ్రవరి 15-19 తేదీలలో ఖమ్మంలో జరిగిన సి.పి.ఐ. రాష్ట్ర 15వ మహాసభల సందర్భంగా సరళాదేవి, సి.ఆర్., సుధాకర్‌రెడ్డి, టి.వి. మొదలగువారితో



సి.ఆర్. శవపేటిక వాహకులుగా రాజన్న, వై.వి.కె., దాసరి మొదలగువారు

# క్లోజప్‌లో రాజన్న!



యన్. శివరామిరెడ్డి

లోకానికి తెలిసిన పేరు నీలం రాజశేఖరరెడ్డి. సన్నిహితులు ఆయన్ను రాజశేఖర్ అని సంబోధించేవారు. ఆత్మీయులు ముచ్చటగా రాజన్న అని పిలుస్తారు. ఆ కామ్రేడ్‌తో నాకు నలభై సంవత్సరాల పరిచయం వున్నప్పటికీ, చనువు, ఆప్యాయతలు వుట్టిపడే ఆ పొట్టిపేరుతో పిలవటానికి నాకు చాలా ఏండ్లు పట్టింది.

నాకూ, రాజన్నకూ వయోభేదం నాలుగేండ్లు. ఆయన పుట్టింది **1918,** నేను **1922.** నాలుగేండ్ల తేడానే ఐనాకూడా ఆయన్ను గురువుగా భావించాము. మేము అన్నప్పుడు నేను, కామ్రేడ్ జె. వెంకట్రామిరెడ్డి. నేనూ, జె.వి. అనంతపురం ప్రభుత్వ కళాశాలలో **1939-43** మధ్య చదివేటప్పుడు రాజన్న, నాగిరెడ్డి గార్లు మాకు మార్క్సిజమ్‌లో స్టడీ క్లాసులు తీసుకొనే వారు. మార్క్సిజమ్‌లో అక్షరాభ్యాసం నేర్చుకొనింది వారి వద్దనే. కాలేజీకి సమీపంలో వుండిన శివరావు బంగళాలో వారు నిర్వహించిన అధ్యయన తరగతులకు ఇతరులతో పాటు మేము వెళ్ళేవాళ్ళం. మా కాలేజీ రోజుల్లోనే సదాశివన్, వి.కె. గార్లను కూడా చూశాము. ఈ నలుగురితో మాకు ఆనాడు ముఖ పరిచయమే గానీ, చనువు, సాన్నిహిత్యం లేవు.

**1961**లో రాజన్న గారు రాష్ట్ర పార్టీ కార్యదర్శిగా ఎన్నికైనప్పటి నుండీ ఆయనతో పరిచయం తప్పని సరి అయింది. **1956-87** మధ్య సుదీర్ఘకాలం నేను జిల్లా కార్యదర్శిగా వుండినందువల్ల రాష్ట్ర కౌన్సిల్, కార్యవర్గ సమావేశాల్లో ఆయనగారి ఉపన్యాసాలు, రిపోర్టులు, వివరణలు వినడానికి అవకాశం దొరికింది. రాజన్నలాగా సూటిగా మాట్లాడటం కొందరికే చేతనవుతుంది. కొందరి ఉపన్యాసాలు పునరుక్తి దోషం వల్ల రక్తి కట్టేవి కావు, విసిగించేవి. రాజన్న విషయంలో అలా కాదు. ఇంకా కొంతసేపు మాట్లాడి వుంటే బాగుండేది అనిపించేది. కడుపు కొంత ఖాళీ వుండగానే తినడం ముగించడం ఆరోగ్యరీత్యా మంచిదంటారు. రాజన్న తన ఉపన్యాసాల్లో ఈ సూత్రాన్ని పాటించేవారు కాబోలు. పదిసార్లు బెల్లు కొట్టినా మైకు వదలని మొండిఘటాలు రాజన్న గారి ఆదర్శంనుండి నేర్చుకుంటే మంచిది.

మార్క్సిజాన్ని భారతీయ పరిస్థితులకు వర్తింప చేయటంలోనే మన వైఫల్యం వుందని చాలాకాలంగా మనం గుర్తించాము. కానీ, భారతీయ పంథా కనుగొనడానికి ఈ నాటికి కూడా సఫలం అయినామని ధైర్యంగా చెప్పలేకున్నాము. మోడల్స్ కొరకు

చాలా కాలం అన్వేషించి, అనుకరించి నష్టపోయినది జగద్విదితమే. భారతీయ వాస్తవికతను అర్థం చేసుకోడానికి ఆఖరి సంవత్సరాల్లో రాజన్న, రాజేశ్వరరావుగార్లు గట్టిగా ప్రయత్నించారు. ఈ సమస్యపై కార్యకర్తలు తమ, తమ అనుభవాలతో వెలుగు వేస్తారేమోనని సమావేశాల్లో వారిద్దరూ కనిపెట్టుకొని వినేవారు. సమావేశాలు ముప్పయి, నలభై నిముషాలు ఆలస్యంగా ప్రారంభమైనా, నిర్ణీత సమయానికే వారిద్దరూ ఖచ్చితంగా వచ్చేవారు. ముగింపు వరకు లేచిపోకుండా కూర్చునేవారు.

మార్క్సిస్టు మూలసూత్రాలు రాజన్నకు కరతలామలకము. అందులో తడబాటు అంటూ వుండదు. ఆయన చెప్పదలచుకున్న విషయం ఏదైనా సూటిగా, స్పష్టంగా చెప్పేవారు. నీళ్ళు నమలటం, దాటవేయడం ఆయనకు చేతకాదు. ఇబ్బందికర విషయాలను తమ ముగింపు సమాధానంలో కొందరు దాట వేస్తూ వుంటారు రాజన్న ఆ కోవకు చెందడు.

సదాశివన్, రాజన్న, నాగిరెడ్డి, వి.కె. గారలు అనంతపురం జిల్లా కమ్యూనిస్టు ఉద్యమానికి మూలపురుషులు. సదాశివన్‌గారి నిరాడంబరత్వం, రాజన్నగారి సిద్ధాంత పరిజ్ఞానం, నాగిరెడ్డిగారి ఉపన్యాసపటిమ, వి.కె గారి సమరశీలత ఆ ఉద్యమానికి మెరుగులు దిద్దాయి. 1964 చీలిక అనంతరం నాగిరెడ్డిగారి మార్గం వేరు కాగా తక్కిన నాయకత్రయం ఉద్యమాన్ని ముందుకు తీసుకెళ్ళారు. నాగిరెడ్డి గారు కరిస్మాటిక్ లీడర్, గొప్ప ఉపన్యాసకుడు. శాసనసభలో బాగా రాణించాడు. కానీ చీలిక సమయంలో ఆయన గారివెంట రాయలసీమ ముఖ్య నాయకత్వం కొట్టుకుపోలేదు. సి.పి.ఐ.లోనే దృఢంగా నిలబడ్డారు. వ్యక్తి ఆకర్షణ వారిని గాడి తప్పించలేదు. వారి సిద్ధాంత నిబద్ధత అలాంటిది.

1961 నుండీ రాజన్న నిర్వహించిన పాత్ర చరిత్రాత్మకమైనదీ, చిరస్మరణీయ మైనదీ. అంతర్జాతీయంగా సాగిన ఆనాటి గ్రేట్ డిబేట్‌లో, రాజన్న తన సిద్ధాంత పరిజ్ఞానంతో, వాదనా బలంతో రాష్ట్రంలో ప్రత్యర్థుల వాదనలను పూర్వపక్షం చేసేవాడు. మెజారిటీ సభ్యులను, కార్యకర్తలను సి.పి.ఐ వెనకాల సమీకరించి, పటిష్ఠ పరచడంలో ముఖ్య భూమిక నిర్వహించారు.

పార్లమెంటరీ పదవుల పట్ల ఆయనకు ఏనాడు వ్యామోహం లేదు. అయితే పార్టీ నిర్ణయం మేరకు పోటీ చేయాల్సి వస్తే వెనుకంజ వేయలేదు, ఓటమి తప్పదని తెలిసినా. రాజ్యసభ సభ్యత్వానికి సి.పి.ఐ.కి ఛాన్సు వచ్చిన సందర్భంలో అభ్యర్థి గురించి రాష్ట్ర కార్యవర్గంలో చర్చకు వచ్చినపుడు రాజన్నపేరు ప్రస్తావనకు వచ్చింది. కానీ,

రాజన్న చర్చకు అవకాశం యివ్వకుండా నిర్ధ్వందంగా దానిని త్రోసి పుచ్చి కామ్రేడ్ గిరిప్రసాద్‌గారి అభ్యర్థిత్వాన్ని బలపరచారు.

రాజన్న వ్యక్తిత్వంలోని ఒక పార్శ్వాన్ని గురించి మాత్రమే ఇంతవరకు స్పృశించాను. ఆయన గారి స్నేహశీలత, మమతానురాగాలు, అభిరుచులను గురించి ప్రస్తావించక పోతే తప్పవుతుంది. అనంతపురం పార్లమెంటు స్థానానికి జరిగిన ఎన్నికలో సి.పి.ఐ. అభ్యర్థిగా రాజన్న ఎన్నికల బరిలో దిగాడు. కడప జిల్లానుండి నేను వెళ్ళినపుడు రాజన్న కుమారుడు డాక్టర్ విజయకుమార్ ఇంటిలో మాకు విడిది ఏర్పాటు చేశారు. ఎన్నికల నిమిత్తం భూపేష్ గుప్తా గారు రాగా, వారికి విజయకుమార్ ఇంటిలోనే ఆతిధ్యం ఏర్పాటు చేశారు. చికెన్ స్కిన్‌తో చేసిన ఒక స్పెషల్ డిష్‌ను గురించి రాజన్న ప్రత్యేకించి వివరించారు. రాత్రి నిద్రపోయే ముందు రాజన్నగారి వృద్ధమాత ఒక రౌండు ఇళ్ళంతా తిరిగి అతిధుల సౌకర్యాలను గురించి చెకెప్ చేసుకొనేవారు. అతిధుల పట్ల అంత శ్రద్ధ తీసుకోవటం ఆ కుటుంబ సాంప్రదాయమేమోనని అనిపించింది నాకు. ఆ ఒరవడిలో పెరిగిన రాజన్నకు కూడా ఎటువంటి భేషజాలు లేవు.

మఖ్దూం భవన్‌కు సమీపంలో "పిక్ అండ్ మూవ్" అన్న పేరుతో ఒక హోటల్ వుంది. నోరూరించే ఐటమ్స్‌తో అది యువతను ఆకర్షిస్తూ వుంటుంది. ఎప్పుడూ ఆ త్రోవన పోవటమేగానీ అందులో అడుగుపెట్టడానికి సాహసం చేయలేదు. ఒక రోజు రాజన్నతో పాటు నలుగురైదుగురం కలిసి ఆ హోటల్ ప్రక్కన వెళ్ళుతున్నప్పుడు అందులో ఏముందో పదండి రుచి చూస్తాం అన్నాడు రాజన్న. తృప్తిగా తిన్న తర్వాత రాజన్న బిల్లు చెల్లించగా బ్రేక్ త్రూ సాధించినట్లు ఒకరి ముఖం ఒకరు చూసుకొని బయట పడినాము.

సి.ఆర్. సూచన ప్రకారం నేను జిల్లా కార్యదర్శి బాధ్యత నుండి తప్పుకొని రాష్ట్ర రైతు సంఘ బాధ్యతల్లోకి వెళ్ళాను. రాయలసీమ ప్రాజెక్టులను గురించి నేను కృషి చేయాలన్నది ఆయన గారి ఉద్దేశ్యం కావచ్చు. మంగళగిరి రాష్ట్ర రైతు మహాసభ తర్వాత "రైతులోకం" పత్రికకు నన్ను ప్రధాన సంపాదకుణ్ణి చేశారు. ఆ బాధ్యతలో నేను మూడేండ్లు వున్నాను. ప్రతినెలా హైదరాబాద్‌కు పత్రిక పని మీద వెళ్ళినప్పుడు వారం పదిరోజులు మఖ్దూం భవన్‌లో మకాం వేసేవాణ్ణి. అదే కాలంలో సి.ఆర్, రాజన్నగార్లు కూడా కేంద్ర బాధ్యతల నుండి తప్పుకొని రాష్ట్రకేంద్రంలోనే ఎక్కువకాలం గడిపేవారు. వారిద్దరితో సాన్నిహిత్యం పెరగడానికి మంచి అవకాశం లభించింది నాకు.

రాయలసీమ నీటిపారుదల ప్రాజెక్టుల పట్ల సి.ఆర్., రాజన్నగార్లు ఇరువురు కూడా అమితమైన ఆసక్తి కనపరచేవారు. రాయలసీమకు అన్యాయం జరిగిందని ఆవేదన చెందేవారు. రాయలసీమ ప్రాజెక్టుల సాధనకు సమరశీల పోరాటాల అవసరాన్ని వాళ్ళు నొక్కి వక్కాణించేవారు. అటువంటి పోరాటాలకు నాయకత్వం వహించటానికి సంసిద్ధత వ్యక్తం చేసేవారుకూడా.

1970 ప్రాంతంలో ప్రొద్దుటూరులో జరిగిన రాయలసీమ ప్రాజెక్టుల అఖిలపక్ష మహాసభలో రాజశేఖరరెడ్డిగారి కీనోట్ స్పీచ్ అన్ని వర్గాలను ఆకట్టుకొనింది. చివరి దశలో కడపజిల్లా వీరపునాయుని పల్లెలో జరిగిన ప్రాజెక్టుల మహాసభకు హాజరై కార్యకర్తలను ఉత్సాహపరచారు. ఆ పూట ఆ వూరిలో మా తమ్ముని కుమారుడూ, జూనియర్ కాలేజీ ప్రిన్సిపాల్ అయిన ప్రభాకరరెడ్డి ఇంటిలో కలిసి భోంచేసినాము.

ఆయనగారి సేవలకు గుర్తింపుగా ప్రొద్దుటూరులో జరిగిన అమరజీవి ఈశ్వరరెడ్డి గారి స్మారక సభలో రాజన్నగారిని సన్మానించే భాగ్యం కడపజిల్లా పార్టీకి లభించింది. ఆ రోజు ప్రొద్దుటూరులో కామ్రేడ్ దస్తగిరిసాబ్ తన ఇంటిలో చక్కటి ఆతిధ్యం ఏర్పాటు చేశారు. కడపజిల్లా పట్ల రాజన్నకున్న అభిమానం ఆ జిల్లా పార్టీ కార్యకర్తలమీద చిరస్మరణీయమైన ముద్రవేసింది.

రాజన్న పెద్ద భూస్వామ్య కుటుంబంలో పుట్టినా, కార్యకర్తలతోనూ, సామాన్య ప్రజలతోనూ చాలా కలసిమెలసి వుండేవాడు. అప్పుడప్పుడు చాలా విట్టీగా మాట్లాడే వాడు. పెండ్లీడు కూతురున్న తండ్రి ఎక్కడికి వెళ్ళినా మంచి వరుని మీద దృష్టి వున్నట్లే, పార్టీ నాయకునికి మంచి కార్యకర్తను సంపాదించడం గురించి దృష్టి వుండాలనే వాడు. ఆయన చతురోక్తికి మరో ఉదాహరణ. ఇతరులతో పొత్తు, సర్దుబాట్లు ప్రయోజన కరంగా జరగాలంటే, మనకు స్వంత బలం వుండాలి. స్వంత బలం వున్నప్పుడు ఇతరుల బలం వుపయోగపడుతుంది. తలలో కొంతవరకైనా వెంట్రుకలు వుంటే సవరము పెట్టుకుంటే కలిసివస్తుంది. బోడిగుండుతో సవరము ఎలా అతుకుతుందని చమత్క రించేవాడు. స్వంత బలం పెంచుకోవాలని ఉద్బోధించేవాడు.

హైద్రాబాద్‌కు కుటుంబంతో వచ్చినప్పుడు నేనూ, నా భార్య ఎర్రగడ్డ ఏరియాలో నున్న మా కడపటి కూతురు ఝాన్సీ ఇంటిలో వుండేవాళ్ళం. ఈ ప్రాంతం రాజన్న నివాసం వుంటున్న యూసఫ్‌గూడాకు సమీపమే. నేనెప్పుడైనా ఫోన్‌చేస్తే బ్రేక్‌ఫాస్టుకు రావయ్యా అని వత్తిడి చేసేవాడు. నేను మొదటిసారి వారి ఇంటికి టిఫిన్‌కు వెళ్ళినపుడు

అన్నీ టేబుల్ మీద వున్నప్పటికీ నా సంకోచాన్ని అర్థం చేసుకొని కాబోలు రాజన్న భార్య లీలావతమ్మగారు స్వయంగా వడ్డించారు. ఒకసారి వారింటిలో లంచ్ తర్వాత విశ్రాంతి తీసుకుంటున్నప్పుడు శివరామిరెడ్డీ! నాకు క్లాసికల్ మ్యూజిక్ అంటే ఇష్టమయ్యా, అని ఒక క్యాసెట్ పెట్టి వినిపించాడు.

ఆఖరుసారి నన్ను కుటుంబ సమేతంగా వారింటికి రావాలని రాజన్నగారు పట్టు పట్టారు. ఒక షరతుమీద అంటే రాజన్నా, వారి సతీమణి మా ఝూన్సీ ఇంటికి వచ్చే షరతు మీద బ్రేక్ ఫాస్ట్‌కు వారింటికి వెళ్ళాము. మధ్యాహ్నం భోజనానికి వారిద్దరూ మా ఝూన్సీ ఇంటికి వచ్చారు. వెళ్ళిపోయేటప్పుడు మా అల్లుడు, పిల్లలు అందరమూ ఆనందంతో వీడ్కోలు చెప్పాము. ఎంతో ఆత్మీయతతో కూడుకున్న ఆ సన్నివేశాన్ని ఎన్నటికీ మరచి పోలేము. దాని తర్వాత రాజన్న ఎంతో కాలం జీవించలేదు.

సమావేశాల్లో మనలను ఆకట్టుకునేది ప్రతిభావంతమైన రాజన్నగారి మేధ, క్లోజప్‌లో మనలను ఆకట్టుకొనేది ఆయన గారి రసజ్ఞ హృదయం.

- యన్. శివరామిరెడ్డి

**శాస్త్ర విజ్ఞానం ఎంత ఖచ్చితంగా, నిష్పాక్షికంగా ముందుకు సాగుతూ వుంటుందో అంతగా అది కార్మిక వర్గ ప్రయోజ నాలకూ, ఆకాంక్ష లకూ సమన్వయంగా వుంటుంది.**

**- ఏంగెల్స్**



# మా గురువుగారు నీలం రాజశేఖరరెడ్డి

- డి. యస్. రామచంద్రరావు

1964 ఆగస్టు-సెప్టెంబరు నెలల్లో రాజశేఖరరెడ్డిగారు, పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు జిల్లాలు పర్యటించిన రోజులవి. తూర్పు గోదావరి జిల్లా రామచంద్రాపురం బహిరంగసభలో ప్రధానవక్తలుగా వచ్చారు. అప్పటికి కొద్ది వారాల క్రితం భారత కమ్యూనిస్టు పార్టీ చీలికకు లోనైంది. సిపిఐ(యం) అప్పుడే ఆవిర్భవించింది. మాతృ సంస్థ సిపిఐలోనే ఉండిపోయాను. నాకు మిత్రులుగా ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీలో కలసి తిరుగుతూ, పనిచేస్తూ వచ్చిన కొద్ది మంది సిపిఐ (యం)లోకి వెళ్లారు. నేను ఎమోషనల్‌గా చాలా మానసిక వ్యధకు గురైనాను. కారణం బలోపేతమైన భారత కమ్యూనిస్టు పార్టీ రెండు ఖండాలుగా చీలిపోయిందని. ఆ రోజుల్లో కమ్యూనిస్టు పార్టీ అన్నా, కార్యకర్త అన్నా కమ్యూనిస్టేతరులు కూడా, ఆఖరికి మనకు రాజకీయంగా వ్యతిరేకులు కూడా గౌరవించేవారు. అటువంటి శక్తివంత మైనది భారత కమ్యూనిస్టు పార్టీ. నిస్వార్థ సేవకు, త్యాగనిరతికి వీరు మొదటి కోవకు చెందినవారని సంఘంలో మన యెడల సుహృద్భావ వాతావరణం నెలకొని వుండేది.

1964 సెప్టెంబరు నెల మొదట్లో సిపిఐ రాష్ట్ర పార్టీ కార్యదర్శిగా రాజశేఖరరెడ్డి గారు, సిపిఐ శాసనసభాపక్ష నాయకుడు, ప్రతిపక్ష నాయకుని హోదా కూడా వున్న పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు రామచంద్రాపురం వచ్చారు. అప్పుడు అసెంబ్లీలోను, లెజిస్లేటివ్ కౌన్సిల్‌లోను కలిపి సిపిఐ సంఖ్యాబలం 32అని గుర్తు. డాక్టర్ చెలికాని రామారావుగారి ఇంట్లో కామ్రేడ్స్ పెదపాటి వెంకట్రావు, జె.బి.ఆనంద్‌గార్లు నన్ను రాజ శేఖరరెడ్డి గారికి పరిచయం చేసి నాకు పార్టీ పని బాధ్యత ఏదైనా అప్పగించవలసిందని సూచించారు. రాజశేఖరరెడ్డిగారు ఆ సూచన పట్ల యోచించి కొద్ది సమయంలోనే ఒక ప్రతిపాదన చేశారు. విజయవాడ విశాలాంధ్రలోనూ లేదా రాష్ట్రపార్టీకేంద్రం హైద్రాబాదు లోనైనా కావాలన్నారు. బాధ్యత నాపై పెట్టి అరగంట ఆలోచించి నిర్ణయం చెప్పమన్నారు.

విశాలాంధ్ర కంటే రాష్ట్ర కేంద్రంలో వెంటనే అవసరం. అక్కడే పని వత్తిడి ఎక్కువగా వుంటుందని వారే మళ్లీ వెల్లడించారు. అరగంటలో లేదా రామాలయం వద్ద జరిగే బహిరంగసభ ముగిసే సమయానికి నిర్ణయం చెప్పమని నాకు చెప్పారు. కామ్రేడ్స్ పెదపాటి, జె.బి.ఆనంద్‌గార్లు బహిరంగసభ ముగిసిన వెంటనే లెజిస్లేచర్ పార్టీకి ఆఫీసు కార్యదర్శిగా తనకు కావాలని రాజశేఖరరెడ్డిగారికి చెప్పారు.

రాజశేఖరరెడ్డిగారు అంత త్వరగా స్పందించే అవకాశం ఇస్తారని నేను భావించలేదు. నాకు ఆ సన్నివేశం చాలా ఆశ్చర్యకరమైనదిగా మనసులో వుండిపోయింది. పార్టీలో పెద్దవారు, పార్టీపై గల గౌరవ భావంతో హైదరాబాదు వస్తానని నా నిర్ణయాన్ని చెప్పాను. వారు నా అడ్రస్ తీసుకు న్నారు. అయితే కొద్ది రోజుల్లోనే కామ్రేడ్ వై.చంద్రంగారి నుండి ఉత్తరం (హైదరాబాదు పార్టీ కేంద్రం), విజయవాడ విశాలాంధ్ర నుండి రూ.30/-లు యం.ఒ. నాకు అందాయి. ఉత్తరంలోనూ, యం.ఒ. కూపన్‌లోనూ రాజశేఖరరెడ్డిగారు టూరు నుండి హైదరాబాదు వాపసు వస్తారు, ఆ సమయానికి మీరు వచ్చి రాష్ట్ర కేంద్రం పనిలో చేరమని. అయితే హైదరాబాదులో ఇన్ని సంవత్సరాలు పార్టీ పనిలో ఉంటానని ఊహించలేదు. నేను 1964 సెప్టెంబర్ 20వ తేదీన హిమయత్ నగర్ ప్రొఫెసర్ హారూన్‌ఖాన్ షేర్వాణి గారి భవనంలో గల పార్టీ కేంద్రానికి చేరుకున్నాను. నా హైదరాబాదు రాక అలా జరిగింది. ఇదే విషయం ఒకసారి కామ్రేడ్ కంభంపాటి సీనియర్‌గారు "నిన్ను మూడు ప్రశ్నలు అడుగు తాను చెప్పగలవా?'' అని ప్రశ్నించారు. ఇంత వరకు నీ అనుభవంలో అత్యంత ఆశ్చర్య కరమైన విషయం, విచారకరమైన విషయం, సంతోషకరమైన విషయం వరుసగా చెప్పు అన్నారు. అత్యంత ఆశ్చర్యకరమైన విషయం కామ్రేడ్ రాజశేఖరరెడ్డిగారు నన్ను వెంటనే హైదరాబాదు పార్టీ కేంద్రంలో పనిచేయమని ఆఫర్ ఇవ్వటం, రెండవది విచారకర విషయం పార్టీ చీలిక, మూడవది ఇంత వరకు చెప్పుకోదగిన సంతోషకర విషయం ఏదీ లేదని బదులు చెప్పాను.

అంతకు ముందు నాకు ఎన్నికల్లో పార్టీ వలంటీర్‌గానూ, పోలింగ్ ఏజెంట్‌గానూ పనిచేయడం, బహిరంగసభలకు, సమావేశాలకు హాజరవ్వటం, పార్టీ నాయకులు ఎవ్వరు కనబడినా కలసి పలకరించడం, కుశల ప్రశ్నలు వేయడం మినహా కట్టుదిట్టమైన ఆఫీసు పనిలో అనుభవం ఏమాత్రం లేదు. మధ్య తరగతి మనస్తత్వం, ఈజీ గోయింగ్‌కి అలవాటు పడివున్నాను.

రాజశేఖరరెడ్డి, వై.వి.కె.గార్లు కలిసి నాకు మన ఆఫీసు అకౌంట్స్ అప్పజెప్పారు. నాకు ఎకౌంట్స్ రాయడం అసలురాదు. కానీ తరువాత నెమ్మదిగా అలవాటు చేసు కున్నాను. అప్పటికే కామ్రేడ్ వై.వి.కె. పార్టీ కోశాధికారి. రోజువారీ పనిలో సెక్రటేరియల్ వర్క్ బాగా అలవర్చుకోవడానికి ఆయన నాకు ట్రైనింగ్ ఇచ్చేవారు. ఆ రోజుల్లో నాయకులందరూ పార్టీ ఆఫీసుకు ఉదయం 9గంటలకే వచ్చేవారు. కామ్రేడ్స్ రాజబహదూర్ గౌడ్, వై.వి.కృష్ణారావులు ఉదయం 7.30 లేక 8 గంటలకే వచ్చి రాతపనిలో నిమగ్నమై ఉండేవారు. కామ్రేడ్ రాజశేఖరరెడ్డిగారు మిగిలిన పార్టీలీడర్స్ 9.30ప్రాంతంలో

ఆఫీసుకు చేరుకుని కార్యక్రమాలు, విధులకు హాజరయ్యేవారు. రాజశేఖరరెడ్డిగారు ఎక్కువ సమయం రీడింగ్, స్టడీ సెలెక్టివ్‌గా చేసేవారు. అప్పుడు డాక్టర్ రాజబహదూర్ గౌడ్ సహాయ కార్యదర్శిగా అనేక విధాలుగా రాయటంలో నిమగ్నమై ఉండేవారు. రాజ్ extrovert, అయితే రాజశేఖర్ introvert ఏ సమస్య మీదనైన సరే నిమిషాల మీద ప్రెస్ రిలీజ్ కానీ, నోట్ కానీ తయారు చేసేవారు. ఆనాడు ఆయన సూపర్‌స్పీడ్‌తో కార్యక్రమాలు, పనులు చేసేవారు. రాజ్, ముఖ్దూం సాహెబ్‌ల గారి వలన హిమాయత్ నగర్ ఉర్దూ హాలుకు మరింత ప్రాముఖ్యత, నిండుదనం కలిగింది.

కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డిగారి కుటుంబం 1950నాటికే ఆంధ్రలో పత్రికలు చదివే వారికి, వినికిడి ద్వారాను తెలుసు. ఆ కుటుంబం దేశానికి ఒక రాష్ట్రపతిని, ఒక ప్రముఖ కమ్యూనిస్టు నాయకుని, ఒక ప్రముఖ పార్లమెంటేరియన్‌ని, విద్యావంతులు, దేశభక్తి, సమాజం అంటే గౌరవం గల సోదరసోదరీమణుల్ని, బంధువులను సమ కూర్చింది. రాజశేఖరరెడ్డిగారి సతీమణి శ్రీమతి లీలావతిగారు (వారికి మేనకోడలు) కూడా అప్పట్లో గ్రాడ్యుయేట్ అని గుర్తు. నీలం సోదరులకు బావ కామ్రేడ్ తరిమెల నాగిరెడ్డి యం.పి.గా, ప్రముఖ పార్లమెంటేరియన్‌గానూ, ఎం.ఎల్.ఎ.గానూ వాసికెక్కారు. ఇంగ్లీషు, తెలుగు భాషల్లో అనర్గళంగా మాట్లాడేవారు. అసెంబ్లీలో హేతుబద్ధమైన వాదన చేసేవారు. మేము చదువుకునే రోజుల్లో Silver voiced నాగిరెడ్డి అని పత్రికలు, విద్యావంతులు ప్రశంసించేవారు. రాజశేఖరరెడ్డిగారు పదవులు నిర్వహించే రోజుల్లో పార్టీ కార్యాలయానికి దగ్గరలో మకాం ఉండేవారు. మొదట్లో బర్కత్‌పురా బాబుల్‌రెడ్డి ఇంట్లో అద్దెకు ఉండేవారు. తదుపరి ఆశోక్‌నగర్ బ్రిడ్జికి సమీపంలోనూ ఉండేవారు. సంపన్న కుటుంబం నుండి వచ్చిన ఆయన ఎప్పుడూ సింపుల్‌గా, వైట్ డ్రెస్‌తో ఉండేవారు. తన ఖర్చులకు కూడా స్వంత డబ్బులే వాడేవారు. పార్టీ సొమ్ము ఖర్చు చేసేవారు కాదు. శ్రీకాకుళం జిల్లాకు పార్టీ కార్యదర్శి హోదాలో వెళ్లినప్పుడు కూడా రైలు టిక్కెట్టు, తిరుగు ప్రయాణ టిక్కెట్టుకు స్వల్పంగా రూపాయలు దగ్గర ఉంచుకునేవారు. పార్టీ ఆర్థిక విషయాలు కామ్రేడ్స్ వై.వి.కె., తమ్మారెడ్డి, రాజబహదూర్ గౌడ్ గార్లకు సూచనలిచ్చి మిన్నకుండేవారు. పార్టీ వనరులు పెంచడానికి, పార్టీ నూతన క్యాడర్‌ను తయారు చేయుటకు గల అవకాశాల గురించి ఎల్లప్పుడూ శ్రద్ధగా ఆలోచిస్తూ వుండేవారు. ఈనాడు పార్టీలో చురుకుగా పార్టీ బాధ్యతలు నిర్వహించే పార్టీ నాయకులు అనేకమందిని ఆయనే స్వయంగా స్టడీ చేసి పరిశీలించి మోటివేట్ చేసినవారే. పార్టీ క్యాడర్‌ని "apple of the eye"గా చూడగలగాలి అనే లెనిన్ ఆశయాన్ని ఉదహరించేవారు.

గుంటూరు జిల్లా సిపిఐ కార్యదర్శి, ప్రముఖ ట్రేడ్ యూనియన్ నాయకుడు ఆనాడు జిల్లాలో అత్యుత్తమ కమ్యూనిస్టుగా గౌరవింపబడిన కా॥కె.మల్లయ్యలింగంగారు అనారోగ్యానికిలోనై రాయవెల్లూర్ మిషనరీస్ హాస్పటల్‌లో చేరటం జరిగింది. కాన్సర్ అని పరీక్షలో నిర్ధారణ జరిగింది. కామ్రేడ్ మల్లయ్యలింగంగారు రాజశేఖరరెడ్డిగారిని చూడాలన్న కోరిక వ్యక్తపరిచినప్పుడు రాజశేఖరరెడ్డిగారు, తమ్మారెడ్డిగారు వెల్లూరు వెళ్లి చూచి వచ్చారు. యువకుడైన కామ్రేడ్ ఈ విధంగా అనారోగ్యానికి గురైనందుకు భిన్నుడైనారు. అటువంటిది రాజశేఖరరెడ్డిగారి ప్రేమ, అభిమానం.

కామ్రేడ్ తమ్మారెడ్డి సత్యనారాయణగారు కార్యదర్శి కాక ముందూ విజయవాడ లో పార్టీ సెంటర్ వున్నప్పుడూ ఉమ్మడి పార్టీలోనూ కూడా సహాయ కార్యదర్శి బాధ్యతలు నిర్వహించేవారు. హైదరాబాద్ వచ్చిన మొదట్లో అమీర్‌పేటలో వుండేవాడు. అక్కడ నుండి సైకిల్ మీద హిమాయత్‌నగర్ పార్టీ ఆఫీసుకు వచ్చేవారు. తదుపరి హైదరాబాద్ నుంచే ఆయన ఆరోగ్యంలో మార్పు వచ్చింది. కొన్ని సంవత్సరాలు ఓల్డ్ ఎం.యల్.ఏ.క్వార్టర్స్ బి బ్లాక్‌లో వుండేవారు. ఆయన చాలా కష్టజీవి. మితభాషి. ఎవరిని గురించి విమర్శకాదు కనీసం తన మనసులోని అభిప్రాయం ఏమిటో ఫారంలో తప్ప ఎక్స్‌ప్రెస్ చేసే వారు కారు. ఒకనాడు విజయవాడ లో పార్టీ పత్రికలు అమ్ముతున్న మన పార్టీ మహిళా కామ్రేడ్స్‌ను రౌడీలు జడలులాగి అల్లరి చేసినప్పుడు కామ్రేడ్ సి.ఆర్., తమ్మారెడ్డి, పోతరాజుగారు మరికొంత మంది యువకులు కర్రసాము చేసుకుంటూ రౌడీలను తరిమి కొట్టారు. ఈ సంఘటన విజయవాడలోనూ, రాష్ట్రమంతటా కథలుగా చెప్పుకునేవారు. అది మొదలు విజయవాడ లో పార్టీ అంటే ఖబడ్దార్, రౌడీలకు సింహస్వప్నం. అటువంటి తమ్మారెడ్డిగారి ఆరోగ్యం లో మార్పు అంటే ఆనాటి పార్టీకి ఎంత కష్టమో గదా! ఎంత సుస్తీ పడినా, అలాగే ప్రశాంతంగా get on అయ్యేవారు. అప్పటికే అనేక మంది సోషలిస్టు దేశాలలో వైద్య సదుపాయం పొంది ఆరోగ్యంగా తిరిగి వస్తూండేవారు. ఆనాడు తమ్మారెడ్డిగారికి ట్రీట్‌మెంటు విషయంలో రాజశేఖరరెడ్డిగారు ఎంతో శ్రమ తీసుకున్నారు. అయినా విదేశానికి పంపుటలో P.H.Q.లో కొంత ఆలస్యం జరిగింది. ఈ సమయంలో రాజశేఖర రెడ్డిగారు అనేకమార్లు restless అయ్యారు. Infatuationకు గురైనారు. చివరకు process అయింది వారి వైద్యం ఏర్పాటు. కామ్రేడ్ తమ్మారెడ్డి, రాజశేఖరరెడ్డిగార్లు ఇద్దరూ రూంలో కూర్చుని మాట్లాడుకుంటూ, పార్టీ కార్యకలాపాలు చూసుకుంటూ అనేక గంటలు గడిపేవారు.

కా॥మ్రేడ్ రాజశేఖరరెడ్డిగారికి ప్రతిభావంతులైన మిత్రులుండేవారు. ఢిల్లీ JNUలో ప్రొఫెసర్‌గా పనిచేసిన కె.శేషాద్రిగారు, బెంగుళూరులో పనిచేసిన ప్రొ.మల్లవరపు రామకృష్ణ స్కూలు విద్యార్థి దశ నుండే కా॥ బిట్రగుంట రామచంద్రరావు (ఆనాడు B Sc గోల్డ్‌మెడలిస్టు) మొదలగువారు.

కా॥మ్రేడ్ రాజశేఖరరెడ్డి మిగిలిన అందరి కా॥మ్రేడ్స్ వలె అప్పటికే సంవత్సరాలుగా మన పార్టీ కార్యాలయంలో పనిచేసే హోల్‌టైమర్, ఆఫీసుఅసిస్టెంటు కా॥మ్రేడ్ బి.నరసింహులును ప్రేమగా చూచేవారు. క్రమశిక్షణా రాహిత్యాన్ని, బద్ధకాన్ని, అశ్రద్ధను సహించేవారు కాదు. వ్యవహారాలలో, విశ్లేషణలో నిర్మొహమాటంగా కుండబద్దలు కొట్టినట్లు మాట్లాడేవారు. తాము చేసే కృషి పూర్తి స్థాయిలో లేదనే భావన వ్యక్తపరచేవారు. కమ్యూనిస్టు ఉద్యమ భవితవ్యంపై దీర్ఘంగా ఆలోచించేవారు. మామూలుగా మాట్లాడి నప్పుడు తమలపాకు వత్తినట్లు సున్నితంగా ఉండేది. కానీ ఇండిగ్నేషన్ ఫీల్ అయినా రీయాక్షన్ చూపించినా తాత్కాలిక ఆవేశానికి లోనయ్యేవారు. వెంటనే కూల్‌డౌన్ అవుతూ వుండేవారు. ఒకనాడు అర్ధరాత్రి కా॥మ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్యగారు ముషీరాబాద్ జైలులో డిటెన్యూగా ఉండగా తీవ్ర అనారోగ్యానికి గురై పరిస్థితి విషమించిందని మన పార్టీ నాయకులకు సమాచారం అందింది. వెంటనే రాజశేఖరరెడ్డి, రాజబహదూర్‌గౌడ్, తమ్మారెడ్డి మరికొంత మంది నాయకులు హుటా హుటిన పార్టీ ఆఫీసుకు వచ్చారు. అప్పుడు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి హైదరాబాదులో లేరు. బెంగుళూరు గ్లాస్ హౌస్‌లో ఎఐసిసి మహాసభలు జరుగు తున్నాయి. రాష్ట్ర రాజధానిలో ఇన్‌ఛార్జిగా డాక్టర్ యం.చెన్నారెడ్డి (ఆర్థికమంత్రి) ఉన్నారు. అయితే ఆయన గాఢనిద్రలో వున్నారని సెక్యూరిటి వాళ్లు, వారి శ్రీమతిగారు చెప్పటం జరిగింది. ముఖ్యమైనది ఆపద సమయంలో తప్పదు లేపండి అని రాజ్‌బహదూర్‌గౌర్ గారు కోరారు. చివరకు మాట్లాడారు. వెంటనే బెంగుళూరుకు టెలిగ్రాం కూడా ఇచ్చాం. పర్యవసానం సుందరయ్యగారు పెరోల్‌పై విడుదలై ట్రీట్‌మెంట్ నిమిత్తం మాస్కో వెళ్ళగలిగారు. బ్రహ్మానందరెడ్డిగారు కూడా రాజశేఖర్ టెలిగ్రాం అందిన వెంటనే పెరోల్ పర్మిషన్ ఇచ్చాము అని ఎక్నాలెడ్జ్ చేశారు. శ్రీకాకుళం జిల్లాలో నక్సలైటు ఉద్యమ సందర్భంగా అరెస్టు అయి జైళ్ళలో మగ్గుతున్న కా॥మ్రేడ్స్‌కు సానుభూతి, సహాయం చేయగలందులకు లీగల్ ఎయిడ్ కమిటీని మన పార్టీ తరుపున ఏర్పాటు చేసి సాహిత్యాన్ని, సహాయాన్ని అందించే కృషి చేశారు. ఆ లీగల్ ఎయిడ్ కమిటీకి కా॥మ్రేడ్ గిరిప్రసాద్ కన్వీనర్‌గా వుండేవారు. ముషీరాబాద్ జైల్లో వున్న కా॥మ్రేడ్స్‌ను కలుసుకుని

వచ్చేవాళ్ళం. ఒకసారి తరిమెల నాగిరెడ్డిగార్ని కూడా ఇంటర్వ్యూ చేశాము. కామ్రేడ్ రాజశేఖరరెడ్డిగారు పార్టీ కార్యదర్శిగా వున్నప్పుడు గిరిప్రసాద్‌గారు పార్టీ సెక్రటేరియట్ సభ్యులు (ఎం.ఎల్.ఏ. కూడా) సెక్రటేరియట్‌లో అందరికంటే వయస్సులో చిన్నవాడని సగర్వంగా, ప్రత్యేకంగా పరిచయం చేసేవారు. రాజశేఖరరెడ్డి మదనపల్లెలో తన చిన్ననాటి విద్యాభ్యాసం గురించి, మద్రాస్ అడయార్‌లోని థియోసా ఫికల్ సొసైటీ గురించి అక్కడి ప్రముఖల గురించి గుర్తు చేసుకునేవారు. ఆంధ్రుల చరిత్ర, సంస్కృతి, కళాభిమానం, సాహిత్యం, సంగీతం, నాట్యకళ అంటే ఆయనకు ఆసక్తి మెండు. మంచి పుస్తకాలు స్వయంగా వెళ్లి కొని తెచ్చుకునేవారు. బళ్ళారి రాఘవా చారిగారు ఆ రోజులలో న్యాయవాదిగానే కాక మహాకళాకారుడుగా కూడా పేరు పొందారు. (లండన్‌లో బళ్ళారి రాఘవాచారిగారు షేక్స్‌పియర్ నాటకంలోని పాత్రను అభినయించి నప్పుడు జార్జి బెర్నార్డ్‌షా ప్రత్యేకంగా అభినందించిన విషయం ఈనాడు చరిత్రలో భాగం) ఆ రోజులలో నీలంగారి ఇంటికి బళ్ళారి రాఘవాచారిగారితో బాటు అనేక మంది ప్రముఖులు వచ్చి పోతూ వుండేవారు. వారందరిని సమీపంగా చూడటం, కలుసుకొనడం ఆయన వ్యక్తిత్వానికి వన్నె కలిగించి ఉంటాయనుటలో అతిశయోక్తి లేదు. సోనాల్ మాన్‌సింగ్, యామిని కృష్ణమూర్తి సుమతీ కౌశల్ నాట్య ప్రదర్శనల గురించి ప్రత్యేకంగా ప్రశంసించేవారు. నటరాజ రామకృష్ణగారు సరేసరి. వ్యక్తి గతంగా అభిమానంతో కూడిన మంచి స్నేహితులు. పరస్పరం కలుసుకుంటుండేవారు. 1952 ప్రాంతంలో Child prodigy మంగళంపల్లి బాల మురళీకృష్ణ రేడియోలో కర్ణాటక సంగీతం వినిపించేవారు. ఆనాటి నుండి ఈనాటి టీనేజర్ షణ్ముఖ శ్రీనివాస్ మాండలిన్ వరకు మధ్యలో షహనాయి బిస్మిల్లాఖాన్, ఈమని శంకరశాస్త్రి, యం. యస్. సుబ్బలక్ష్మి ద్వారం వెంకటస్వామి నాయుడుగారి వయోలిన్ కచేరీలు, షేక్ చినమౌలానా సాహెబ్ నాదస్వరం తలుచుకుని ఆ సంగీత సాగరంలో ఓలలాడిపోయేవారు. రాజశేఖరరెడ్డి గారి ఉపన్యాసం క్లుప్తంగా వుండేది. అందరికి తెలియకపోవచ్చు మంచి Conversa-tionalist.

రాజశేఖరరెడ్డిగారికి, కర్ణాటక కామ్రేడ్స్‌కు అవినాభావ సంబంధం ఉండేది. కామ్రేడ్స్ ఎం.ఎస్.కృష్ణన్, పి.రామన్‌గార్లతో ప్రేమాభిమానం నెలకొని వుండేది. కా॥యం. యస్. కృష్ణన్ సహజంగా మంచి గాయకుడు. ఒకనాడు అనారోగ్యం కారణంగా గొంతు మూగబోయింది. కామ్రేడ్ రాజశేఖరరెడ్డికి చంద్ర సావిత్రీదేవి (సావిత్రమ్మగారు) అంటే ప్రత్యేక గౌరవం, శ్రద్ధ చూపేవారు.

ఒక రోజున కామ్రేడ్ సావిత్రమ్మగారు నేను వచ్చినప్పుడు ఏ రూమ్‌లో ఉండాలి? కామ్రేడ్ సి.ఆర్.కి ఒక రూమ్ కేటాయించలేరా? అని అడిగారు. వెంటనే రాజశేఖర రెడ్డిగారు తాను ఉంటున్న రూమ్ నంబరు 29ని వెంటనే ఖాళీ చేసి పుస్తకాలు తీసుకొని వేరే రూమ్‌కి మారారు. కామ్రేడ్ సి.ఆర్. అంటే రాజశేఖరరెడ్డిగారికి ఎనలేని గౌరవం, ప్రేమ కలిగి వుండేవారు. ఇద్దరూ పార్టీ కార్యాలయం రూమ్ నంబరు 11లో సోఫాలో కూర్చుని గంటల తరబడి చర్చించుకునేవారు. ముచ్చటించుకునేవారు. అతి నెమ్మదిగా మాట్లాడుకునేవారు. కామ్రేడ్ సి.ఆర్. నిమ్స్‌లో స్పెషల్‌రూమ్‌లో వుండి ట్రీట్‌మెంట్ పొందుతున్న సందర్భంలో ఒక రోజున విసుగుదలతో ఆపూట తినవలసిన ఆహారాన్ని తిరస్కరించారు. (రాజశేఖరరెడ్డిగారు ప్రతిరోజూ సి.ఆర్.గారి వద్దకు వచ్చి కొన్ని గంటలు వారి ఎదురుగా కూర్చొని ట్రీట్‌మెంట్ విధానం తెలుసుకుని లోటుపాట్లు సవరించుటకు సలహాలు ఇచ్చి వేళ్ళేవారు) అక్కడనే వేచి వున్న రాజశేఖరరెడ్డిగారు పెద్దవారికి ఈ పూట ఆహారం అవసరం లేకుంటే చిన్నవాళ్ళమైన మాకు మాత్రం ఎందుకు? పెద్దల అడుగుజాడలే ముఖ్యం గదా అని అక్కడనే వుండిపోయారు. కొంతసేపయిన తదుపరి కామ్రేడ్ సి.ఆర్. కరిగిపోయారు. రాజశేఖర్ మీ పట్టుదల నాకు తెలుసు. నేను భోజనం చేస్తాను దయచేసి మీరు ఇంటికి పోయి భోజనం చేయండి. రేపు మరల కలుద్దాం అన్నారు. వారిరువురూ అంత ప్రేమ, గౌరవం, ఆత్మీయత కలిగి వుండేవారు. కామ్రేడ్ సి.ఆర్. ఒక రాజశేఖరరెడ్డిగారినే కాదు ప్రతి పార్టీ సభ్యుని యావత్ పార్టీని అంత అమితంగా ప్రేమించేవారు. పార్టీని, భారతదేశాన్ని అమితంగా గౌరవించేవారు. కామ్రేడ్ ఎం.వి.ఎన్.కపర్థిగారు అకాల మరణం చెందినప్పుడు రాజశేఖరరెడ్డిగారు టూర్‌లో ఉన్నారు. కండోలెన్స్ టెలిగ్రామ్ ఇచ్చారు. నాకు గుర్తున్నంత వరకు untimely death, comrade of sterling qualities and allround worth-irrepairable loss to party & Trade Union movement సారాంశం తక్కువ పదాలతో ఎంతో విలువైన సందేశం అది.

ఆయన అభివృద్ధి, ఆదాయ మార్గాలను అన్వేషిస్తూ ఉండేవారు. పార్టీ కార్యాలయాల నిర్మాణం, ప్రచురణాలయాల, బుక్ హౌస్‌ల అభివృద్ధిని పరిశీలిస్తూ వుండేవారు. ఆనాడు ఆయనే పి.హెచ్.ని ఎంతో అభివృద్ధి పరిచారు. పి.హెచ్. నిమిత్తం గోడౌన్, పర్మెనెంటు స్కూలు, స్టాఫ్ క్వార్టర్స్ దృష్టిలో వుంచుకొని, విశాలమైన, విలువైన స్థలాన్ని ఢిల్లీకి సమీపంలో ఫరీదాబాద్‌లో కొనుగోలు చేశారు.

**మనస్సుకు హత్తుకునే విషయం :** హైదరాబాదులో సిపిఐ పార్టీ కాంగ్రెస్ సందర్భంగా అని గుర్తు. కా॥ సి.ఆర్.తో పాటు రాజశేఖరరెడ్డిగారు కూడా అన్ని పదవులు

ఐచ్ఛికంగా వదిలిపెట్టినప్పుడు చెప్పిన మాటలు, నూతన నాయకత్వం రావాలి, ఎదగాలి. మాలాంటి వాళ్లము వాళ్ళకు సలహా సహాయం అందించాలి అని ప్రకటించారు. అంతకు ముందు కా॥ రాజబహదూర్ గౌడ్ కూడా అదే విధంగా పదవులను అప్పజెప్పారు. నాయకులు ఈ విధంగా మార్గదర్శకంగా ఉండాలి అని చెప్పారు. నేను ఈ ఉదాహరణ లను చూచి ఉత్తేజం పొందాను. ఒక చోట చదివాను. ఎక్కడో గుర్తులేదు. ఆ వాక్యం "Men in public life should know the following; How to live, when to lead, and when to leave". నాకు ఈ వాక్యం మనసుకు హత్తుకుపోయింది. అటువంటి ఆదర్శ నాయకులు, కా॥ సి.ఆర్. కా॥ఎన్.ఆర్. జంట హంసలవలె సి.ఆర్.ఫౌండేషన్ ఆవరణలోనే నీలం రాజశేఖరరెడ్డి రీసెర్చి సెంటర్ నిర్మాణం చేపట్టడం మన పార్టీ కామ్రేడ్స్‌కు గర్వకారణం. అటువంటి చిరస్మరణీయునికి సరైన నివాళి. ఈ రీసెర్చి సెంటర్‌కు కా॥ వై.వి.కృష్ణారావు డైరెక్టర్‌గా బాధ్యతలు తీసుకోవటం చాలా ముదావహం. ఇక్కడ ఒక విషయం కామ్రేడ్ రాజశేఖరరెడ్డిగారికి కామ్రేడ్ వై.వి.కె.గారంటే ఆత్మీయత, అభిమానం, గౌరవం.

కా॥ వై.వి.కె. అంటే ఓపికకు మారుపేరు. వై.వి.కె. రెండవసారి ఎం.ఎల్.సి.గా పోటీ చేసినప్పుడు పట్టుదలతో ప్రచార బాధ్యత అంతా కా॥రాజశేఖరరెడ్డిగారే స్వయంగా బాధ్యత వహించి చేశారు. కా॥ వై.వి.కె. గెలిచారు. ఆ విషయం నాకు ఎంతో ఉత్తేజాన్ని ఇచ్చింది. కా॥ వై.వి.కె. ఈ రీసెర్చి సెంటర్‌ను వికాసవంతంగా తీర్చి దిద్దుతారనేది నిస్సందేహం. వై.వి.కె.గారు సబ్జెక్టు స్పెషలిస్ట్. అందుకే ఈ యోధుని ఆరోగ్యం, మానసిక శక్తి రెట్టింపు కావాలని నా ప్రగాఢ వాంఛ. ఆఖరి వాక్యం సి.ఆర్. ఫౌండేషన్ తరుపున "హోమ్ ఫర్ ది ఏజ్డ్" ప్రారంభం, తదుపరి బృహత్తర కార్యక్రమం నీలం రాజశేఖరరెడ్డి రీసెర్చి సెంటర్ ఏర్పాటు చేయడానికి శరవేగంతో నిర్మాణం జరుగుతున్న ఈ తరుణంలో ఈ మొత్తం ప్రాజెక్టుకు శ్రీకారం చుట్టి ఆచరణ సాధ్యం అని రుజువు చేసిన వ్యక్తి కా॥ఎన్.ఆర్.దాసరిగారు. ఆయన వెనుక నిలిచిన చంద్ర రాజేశ్వరరావు ఫౌండషన్ ఆఫీసు బేరర్స్‌కు నేను జేజేలు పలుకుచున్నాను.



# మా స్ఫూర్తి ప్రదాత రాజశేఖర్

- బి. పార్వతమ్మ

**1942** క్విట్ ఇండియా మూమెంటు ఉధృతంగా సాగుతున్నది. పల్లెల్లో, పట్టణాలలో ఈ పోరాటం వూపందు కుంటున్నది. అదే సమయంలో కామ్రేడ్ వి. కె. ఆదినారాయణ రెడ్డిగారి నాయకత్వాన అనంతపురంలో విద్యార్థులు పోరాటా నికి ఆయత్త మవుతున్నారు. ఆ సమయంలోనే వి.కె.గారికి, రాజశేఖరరెడ్డిగారితో పరిచయం అయింది. నాకు వి.కె.గారి వల్లనే రాజశేఖరరెడ్డిగారితో పరిచయం కలిగింది. వి.కె.ఆదినారాయణరెడ్డిగారు మా అన్న.

1943లో మా పెద్దన్న పెళ్ళికి రాజశేఖరరెడ్డి వచ్చారు. అప్పటికే నా భర్త చనిపోయి నిరాశ, నిస్పృహలలో వున్నాను నేను. అన్నకు నా పరిస్థితి బాధాకరంగా వుంది. ఆయన నా విషయం తెలిపి ఓదార్చటానికి రాజశేఖర్‌రెడ్డిగారిని పంపారు. ఆయన ఎన్నో వుదంతాలు చెప్పారు. దేశం కోసం ఎందరు భర్తలను పోగొట్టుకున్నారో చెప్పారు. అలాగే దైవభక్తితో వుండేకన్నా ప్రజాసేవలోనే నిస్వార్థత వుందని, ఆవైపు పయనించాలని చెప్పారు. దేశ విముక్తి కోసం పోరాడే విప్లవవీరుల చరిత్రలు వినిపించారు. ఎంతో ఊరడించినారు. ప్రేరణ కలిగించినారు. అనంతపురం జిల్లా కమ్యూనిస్టు పార్టీ నిర్మాతలు ఐదుకల్లు సదాశివన్, తరిమెల నాగిరెడ్డి, నీలం రాజశేఖరరెడ్డి మా యింటికి వచ్చి వెళ్ళేవారు. వారి ప్రోత్సాహంతో కమ్యూనిస్టు సాహిత్యం చదవడం మొదలుపెట్టాను.

1948 ఆఖరులో రాజశేఖరరెడ్డిగారు అజ్ఞాతంలోకి వెళ్ళారు. రైల్వే కార్మికుల యిండ్లలో షెల్టరు తీసుకున్నారు. ఆ కార్మిక కుటుంబాలను కష్టపెట్టకుండా ఏ తిండైనా తినేవారు. ఆ విషయం మేము విన్నప్పుడు లక్ష్యం సాధించడానికి ఏ కష్టాన్నైనా సంతోషంగా కమ్యూనిస్టులు స్వీకరిస్తారని మా హృదయాలలో గౌరవభావం ఏర్పడింది. రహస్యదినాలలో ఆదోనిలో కామ్రేడ్ రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డితో పాటు నేనూ వున్నాను. మాతో పాటు తుమాటి దోణప్పగారుండేవారు. ఆ సమయంలో వీరు మాకు సిద్ధాంతాలు బోధించేవారు.

రాజశేఖరరెడ్డి చాలా మితభాషి. అవసరమున్నంత వరకే మాట్లాడేవారు. తమ లక్ష్య సాధన కోసం ఎప్పుడూ ఆలోచించేవారు. రహస్యరోజులలో తాడిపత్రి తాలూకా వేములపాడు లోనో, ఆ ప్రాంత అడవుల్లోనో సమావేశాలు, క్లాసులు జరిగేవి. వాటికి రాజశేఖరరెడ్డిగారు వచ్చేవారు.

---

*శ్రీమతి పార్వతమ్మగారు మహిళా సమాఖ్య నాయకురాలు. రాష్ట్ర సి.పి.ఐ. కౌన్సిల్‌లో సభ్యులుగా కూడా వుండినారు. వి. కె. ఆదినారాయణరెడ్డిగారి సోదరి.*

1951లో ఆయన మద్రాసులో పట్టుబడినపుడు పార్టీకి రాజీనామా చేస్తున్నట్లు పత్రికలకు వార్త పంపాడు. దాంతో అనంతపురం కమిటి ఆయన మీద క్రమశిక్షణ చర్య తీసుకొనింది. తాను ఆ రకంగా ప్రకటించకపోతే సమావేశానికి మద్రాసు డెన్‌కు వస్తున్న కేంద్ర నాయకులు పట్టుబడేవారు కాబట్టి అలా యివ్వవలసి వచ్చిందని రాజన్నగారి సతీమణి లీలమ్మ పెద్ద వుత్తరం రాసింది పార్టీకి. దాని తర్వాత రాజశేఖర్‌పై అభిప్రాయం మార్చుకుంది పార్టీ.

తరువాత ఆయన జిల్లా పార్టీ కార్యదర్శిగా ఎన్నికయ్యారు. ఉక్కు క్రమశిక్షణ, నిర్మాణ దక్షత కమ్యూనిస్టు త్యాగము మూర్తీభవించిన వ్యక్తే రాజశేఖర్. కామ్రేడ్స్ తప్పు చేస్తే నిశితంగా విమర్శించేవారు. ఆయన ఎప్పుడైనా పొరపాటు చేస్తే కామ్రేడ్స్ విమర్శించితే సహృదయంతో స్వీకరించేవాడు.

పాముదర్తి బయపరెడ్డి, దొరిగల్లు రంగారెడ్డి మొదలైన భూస్వాములు తమ గ్రామాలలో కమ్యూనిస్టు పార్టీ మీటింగులు పెట్టనిచ్చేవారు కాదు. ఒక డబ్బా తీసుకొని కొట్టుకుంటూ, మెగాఫోన్‌ద్వారా గ్రామంలో మీటింగు వుందని చాటింపు వేసేవారు రాజశేఖరరెడ్డిగారు. వీరితో పాటు తాతినేని వెంకటేశ్వరరావు, ఘనేనాయక్ మొదలైనవారు వెళ్ళేవారు. ఈ రెడ్లకు భయపడి జనం వాకిళ్లు వేసుకొని కిటికీలలోనో, సందుగొందులలోనో వుండి వినేవారట. ఆ విధంగా బడా రెడ్ల కోటలు బద్దలు కొట్టినారు.

1951లో బెంగుళూరులో ముఖ్యులున్న డెన్నులన్నీ దెబ్బతిన్నాయి. ముఖ్య కామ్రేడ్స్ వున్న డెన్నులపై సి.ఐ.డి. నిఘా ఎక్కువైంది. కొరియర్సు దొరికినారు. ఆ సమయాల్లో కామ్రేడ్స్‌ను రక్షించుకోవాలి. ఐదారుమంది ముఖ్యులం అక్కడ వున్నాం. ముఖ్య కామ్రేడ్ ఒక నాయకుని తీసుకురావడానికి వెళ్ళాడు. ఇంత టైముకు వస్తానని చెప్పాడు. కానీ ఆ టైముకు ఆ కామ్రేడ్స్ రాలేదు. చెప్పిన టైంకు రాకపోతే అపాయంలో పడ్డారనే అనుమానం. ఆ సమయంలో కామ్రేడ్ రాజశేఖరరెడ్డి పడిన ఆవేదన, తోటి కామ్రేడ్ కోసం అలమటించిన బాధ యింతా అంతా అని చెప్పలేను. వారు వచ్చిన తరువాతగాని మనశ్శాంతి దొరకలేదు. భోజనం చేసి ఎవరికి వారు వెళ్ళాలని నిశ్చయించారు. అన్ని ఏర్పాట్లు చేసాము సి.ఐ.డి. నిఘా ఎక్కువయిందని భోజనం కూడా చేయకుండా ఎవరి దారిన వారు వెళ్ళిపోయారు. వీరి త్యాగం ఆదర్శమైనది.

తరువాత రాజశేఖరరెడ్డి రాష్ట్రకార్యదర్శిగా ఎన్నికయ్యారు. అనంతపురం జిల్లా మహిళా సమాఖ్య ఆయనకు ఒక లేఖ వ్రాసింది. రాజశేఖరరెడ్డిగారి కోపానికి జిల్లా కామ్రేడ్స్ అలవాటు పడినారని, రాష్ట్ర కార్యదర్శిగా యితర జిల్లా కామ్రేడ్స్ పట్ల ఓపికతో, సహనంతో వుండాలని, జిల్లా గౌరవాన్ని నిలబెట్టాలని ఆ లేఖలో రాసాం. 'సహృదయంతో మీరిచ్చిన సలహా పాటిస్తాన'ని ఆయన సమాధానం యిచ్చారు.

ఆయన రాష్ట్ర నాయకత్వం నుండి, ఆలిండియా నాయకత్వానికి ఎదగ గలిగారు. కామ్రేడ్స్‌కు సిద్ధాంత పరిజ్ఞానం అవసరమని ప్రతి సంవత్సరం క్లాసులు జరపడానికి ఢిల్లీకి సమీపంలో ఒక భవనం ఆయన ప్రయత్నంతోనే నిర్మాణం జరిగింది. దానిపై ఎన్నో కలలు కన్నారు. ఆ విషయం ఆనందంగా మాకు చెప్పేవారు.

ఆయన అనంతపురం వచ్చినప్పుడల్లా మేము కలిసేవాళ్ళం. కలిసినపుడల్లా పార్టీ విషయాలు చెప్పేవారు. నిర్మాణం బలహీనపడుతున్నదని ఆవేదన పడేవారు.

ఒక రోజు ధర్మవరంలో మీటింగు పెట్టి వస్తున్నాము. "పార్టీలో యిక మనం యిమడ లేము. వూరి బయట యిల్లు కట్టుకొని, మంచి మంచి చెట్లు పెంచి నేను (రాజశేఖర్), లీల వుండాలని వుందమ్మా" అన్నారు. ఆయనకు ఎంత బాధ ఎంత వుందో అర్థం అయింది.

ఎంతో ఖరీదు చేసే 9 సెంట్ల స్థలాన్ని ఆయనా, ఆయన తమ్ముడు నీలం ప్రభాకర రెడ్డిగారు పార్టీకి త్యాగం చేసినారు. లీలావతమ్మగారు రాజశేఖరరెడ్డిగారికి బాగా తోడ్పడినారు.

రాజశేఖరరెడ్డిగారు అనారోగ్య పరిస్థితిలో వున్నపుడు ఒక మిత్రుడు ఆయనను చూడటానికి వెళ్ళాడు. మేము ఏమవుతామో కాని వి.కె. అనంతపురం జిల్లాలో ఎలా వేగగలడో, ఒక్కడు మిగిలాడని ఎంతో ఆవేదన పడ్డారట.

అనంతపురం జిల్లా కమ్యూనిస్టు పార్టీ ఉద్యమనేతలుగా కామ్రేడ్స్ ఐదుకల్లు సదాశివన్, నీలం రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి, వి.కె.ఆదినారాయణ రెడ్డి మూల స్తంభాలుగా వున్నారు. పార్టీకి మొలకవేశారు. ఉక్కు క్రమశిక్షణ, కమ్యూనిస్టు త్యాగం, నిర్భీతి, నిర్మాణ పద్ధతిలో పార్టీని పెంచారు. ఎన్నో కలలు కన్నారు. వాటిని నిజం చేయడం నవతరం, యువతరం మీద వుంది.

**ఎల్ల లోకము ఒక్క ఇల్లై**
**వర్ణ భేదము లెల్ల కల్లై**
**వేల నెరుగని ప్రేమ బంధము**
**వేడుకలు కురియ**

***-గురజాడ***

# ఆయన కోరిక తీరకుండానే.....

- నీలం లీలావతమ్మ



మా అమ్మ (రాజశేఖరరెడ్డి అక్కగారు) తులశమ్మ, నాన్న మల్లారెడ్డి, నేను పుడుతూనే మా అమ్మ చనిపోయింది. అందువల్ల అమ్మమ్మ పెంచింది. సంజీవరెడ్డిగారు, రాజశేఖర రెడ్డిగారు యింకా యిద్దరు బ్రదర్స్ మేమంతా కలసిమెలసి వున్నాం. చిన్నప్పుడు ఎక్కువగా సంజీవరెడ్డిగారు బొమ్మలు అవీ, యివీ తెచ్చిచ్చేవారు. రాజశేఖరరెడ్డిగారు చాలా తక్కువగా మాట్లాడేవారు. రాజశేఖరరెడ్డిగారు యస్.యస్.ఎల్.సి. ఋషీవాలీలో చదివినారు. కాంగ్రెసు నాయకులు కల్లూరు సుబ్బారావుగారు మాతాతగారి దగ్గరకు వచ్చి, తరిమెల నాగిరెడ్డిగారిని నీలం రాజశేఖరరెడ్డిగారిని బెనారస్‌లో చేర్పించమన్నారు. చాలా దూరం అవుతుందేమోనని కొంచెం అనుమాన పడినాడు గాని అంగీకరించినారు. మా తాతగారు ప్రోగ్రెసివ్. బెనారస్‌లో చేర్పించే బాధ్యత కల్లూరు సుబ్బారావుగారు తీసుకున్నారు. డిగ్రీ చదివేటప్పుడు ఫైనలియర్‌లో కమ్యూనిస్టుపార్టీతో సంబంధాలు ఏర్పడినాయి రాజశేఖరరెడ్డిగారికి. యింటికొచ్చినపుడు వాళ్ల పెద్దక్కతో కమ్యూనిస్టు పార్టీ గురించి చెప్పేవారు. ఆ మాటలు విని నాకు కూడా కమ్యూనిస్టు పార్టీ అంటే యిష్టం ఏర్పడింది.

నేను (లీలావతమ్మ) ఐదవ తరగతి మద్రాసు నవోదయ స్కూలులో చదువు కున్నాను. ఫస్టుఫారమ్ అనంతపురం గవర్నమెంటు హైస్కూలులో చదువుకున్నాను. ఇంటర్, డిగ్రీ అనంతపురంలోనే చదివినాను. బి.ఎ. మొదటి సంవత్సరం పూర్తి అయి రెండో సంవత్సరం వచ్చేటప్పటికి రాజశేఖరరెడ్డితో మ్యారేజి అయింది. ఆ సంవత్సరమే మొదటి అబ్బాయి డెలివరీ కోసం మదనపల్లెలో వున్నాము. రాజశేఖరరెడ్డిగారిని అరెస్టు చేసి వేలూరు జైలుకు పంపినారు. ఆ జైలులో విజయకుమార్‌గారు ఇంకా చాలామంది వున్నారు.

జైలు నుంచి వచ్చిన తరువాత అనంతపురం ఫస్టురోడ్డులో మా యింట్లో వున్నాము. బాబుకు సంవత్సరం రాకముందే ఆయన అండర్‌గ్రౌండ్‌కు పోయినారు. ఆ తరువాత నాలుగైదు మాసాలకే రెండోబాబు పుట్టినాడు. రెండోబాబుకు రెండు సంవత్సరాలు వున్నపుడే ఇద్దరి పిల్లల్ని తీసుకొని వారితో పాటు అండర్‌గ్రౌండ్ పోయినాను. మద్రాసుకు పోయినాము. అక్కడ చాలా డెన్సు మార్చినాం. అయినవరం, పల్లవరం, సైదాపేట చాలా చోట్ల వున్నాము. మాతో పాటు కంభంపాటి సత్యనారాయణ (సీనియర్)గారు, నర్సయ్యగారు, రామకృష్ణగారు (సైంటిస్టు) ఒకే డెన్సులో వుండేవాళ్ళం.

డెన్నులో చిన్నపిల్లల గురించి చాలా టెన్షన్ వుండేది. నేను పట్టుబడితే పిల్లలు ఏమవుతారో అని టెన్షన్. దినదినమూ గండమే.

ఒక మనిషి డెన్ను నుండి బయటకుపోతే చెప్పిన టైంకు రావాలి. అట్లా రాకపోతే దొరికినాడేమో అని అనుమానం. దొరికిన తరువాత వాళ్ళు పెట్టే బాధలకు తట్టుకోలేక మా ఉనికి బైటపెట్టినాడేమో అని అనుమానం. అందువల్ల మిగతా వాళ్ళు వెంటనే డెన్ను మార్చేస్తారు. పల్లవరంలో వున్నప్పుడు రాజశేఖరరెడ్డిగారు రావడం ఒకసారి లేట్ అయింది. అంతకు ముందు కూడా ఒకసారి లేట్ అయింది కాని వచ్చినాడు. ఈసారి కొరియర్ వాళ్ళన్న మోసం చేసినందున దొరికినాడు. మాకేమీ తెలీదు అపుడు "మరి ఎట్లమ్మా ఊరికి పోతావా?" అని అడిగినారు డెన్నులోని మిగతావారు. "లేదు, నేను వూరికిపోతే తన సంగతి ఏమీ తెలీదు కదా! నేను పోను" అని చెప్పి డెన్ను మారి వారితో పాటు వున్నాను. వాళ్ళూ కుటుంబాలతో వున్నారు. ఆ వీధిలో వుండేవారికి మావాళ్ళు ఏదో చేస్తున్నారని చెప్పేవాళ్ళం. ఫ్యామిలీతో వుంటే క్షేమమని ఫ్యామిలీ పెట్టినాము. పిల్లలకు ఏమైనా వస్తే డాక్టరు దగ్గరకు నేనే వెళ్ళి చూపించేదాన్ని.

రాజశేఖరరెడ్డిగారు రాకపోతే "ఏమమ్మా! ఆయన రాలేదు. మేము వెళ్ళిపోతున్నాము" అని చెప్పి వుండే యిద్దరూ వెళ్ళిపోయారు. నేను సి.సి.రెడ్డిగారికి విషయం చెప్పినాను. (ఈయనది చీమలవాగుపల్లె. ఆరోగ్యం కోసం మద్రాసులో వుంటున్నారు) మాకు తెలిసినాయన "బద్దు" అని ఋషితీర్థంలో వున్నాడు. అవసరమైనపుడు ఆయన్ను కలిస్తే విషయాలు తెలుస్తాయని రాజశేఖరరెడ్డిగారు చెప్పేవాడు. ఈ విషయం సి.సి.రెడ్డి గారికి చెబితే ఆయన విచారించినాడు. అరెస్టు అయినట్లు తెలిసింది. ఆయన నన్ను, పిల్లలను వారి దగ్గరకు తీసికెళ్లారు. రాజశేఖరరెడ్డిగారు జైలులో వున్నందున నేను మావూరికి వచ్చినాను.

ఆ రోజు సమావేశానికి నాయకులు మద్రాసు రావలసి వుంది. తను అరెస్టు అయిన విషయం వారికి తెలీదు. అందువల్ల తన వార్త పత్రికలలో రావడం కోసం రాజీనామా యిచ్చినట్లు ప్రకటించినాడు. దీన్ని అనంతపురం కామ్రేడ్స్ తప్పుగా అర్థం చేసుకున్నారు. నేను కూడ, తనదే తప్పు అన్నట్లుగా నిష్ఠూరంగా మాట్లాడినాను. ఏమిటమ్మా? అని పెద్దాయనే (సి.సి.రెడ్డి) నన్ను మందలించినాడు. రాజశేఖరరెడ్డిగారు బాధపడినారు. రాజశేఖరరెడ్డిగారు కూడా పూర్తి వివరాలు చెప్పలేదు. చాలా కష్టం వేసింది.

డెన్నుకు కరపత్రాలు, సర్క్యులర్లు వచ్చేవి. ఎక్కడెక్కడ ఏమేమి జరిగేది అవన్నీ అందులో వుండేవి. అవన్నీ మేము డెన్నులో వుండే స్త్రీలం కాపీ చేసే వాళ్ళం. ఆ ఘోరాలు అవి చూస్తే పిల్లల విషయం భయం వేసేది నాకు.

అప్పుడు వాళ్ళ బ్రదరు సంజీవరెడ్డిగారు ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ప్రొహిబిషన్ మినిష్టరుగా వుండేవారు. ఆయన మాబంధువని చెప్పలేదు. నేను కూడా అక్కడకు పోలేదు. నేరుగా వూరికే వచ్చేసినాను.

నేనూ, తరిమెల నాగిరెడ్డి భార్య కాంతం అనంతపురంలోనే వున్నాం. యు.జి. పీరియడ్‌లో ఆమెకు సుజాత పుట్టింది. రహస్యంగా రాజశేఖరరెడ్డి ఎప్పుడైనా వచ్చేవారు. కొరియర్ ద్వారా తెలిసేది. తలుపులు తీసుకొని రాత్రంతా ఎదురు చూస్తూ మేలుకొని వుండేవాళ్ళం. ఒకవేళ వుండాల్సి వచ్చినా కూడా ఎవరికి ఏమీ అనుమానం రాకుండా యింట్లో వుండేవాళ్ళను కూడా ఏదో పనిమీద పంపించేవారం.

రాజశేఖరరెడ్డిగారు రాష్ట్రకార్యదర్శి అయినపుడు అనంతపురంనుండి మకాం హైదరాబాదుకు మార్చినాము. ఇంట్లో నలుగురు పిల్లలు. పిల్లలతోనూ, మిగతా యింటి పనులతోనూ గృహిణిగానే సరిపోయిందిగాని పార్టీలో వర్క్ చేయడానికి నాకు వీలు పడలేదు. ఎపుడూ యింటికి పార్టీవాళ్ళు వచ్చేవాళ్ళు. పార్టీలో యాక్టివ్‌గా పనిచేయలేక పోయాను. పుస్తకాలు చదివేదాన్ని. కమ్యూనిస్టు పార్టీ గురించి, సిద్ధాంతం గురించి చదివేదాన్ని. అపుడపుడు మహిళా సమాఖ్య మీటింగులకు వెళ్ళేదాన్ని. వాళ్ళు కూడా నన్ను చాలా అభిమానంగా చూసుకొనేవాళ్ళు. రాజశేఖరరెడ్డిగారు నెలకు పదిరోజులు కూడా యింట్లో వుండేవారు కాదు. నేను కూడా బయట తిరగడానికి అసలు వీలుపడదు. పిల్లలున్నారు కదా! వాళ్ళు స్కూలుకు పోవడం, ఆరోగ్యాలు చూసుకోవడం, ఇద్దరూ లేకపోతే చెడిపోతారని. పిల్లలగురించి రాజశేఖర్ పట్టించుకొనేది తక్కువ. పెద్దవాళ్ళు అయ్యేకొద్దీ చదువు విషయంలో శ్రద్ధ తీసుకొనేవాడు. అంతానేనే చూసుకొనేదాన్ని. పిల్లలకు జబ్బులు అవీ, యివీ సమస్యలు వచ్చినాయి. జై తెలంగాణా ఉద్యమ సమయంలో పిల్లల చదువులు పాడవుతాయని మరల అనంతపురానికి మకాం మార్చినాం. రెండు సంవత్సరాల తరువాత మరల హైదరాబాదుకు పోయినాము. పెద్దబ్బాయిని మెడిసిన్‌లో, రెండవ అబ్బాయిని ఇంజనీరింగులో చేర్పించినాం. వాళ్ళమ్మగారికి వయసు అయింది. అమ్మను తీసుకొచ్చి నా దగ్గరే వుంచినారు. ఖర్చులకు కావాలి కదా! పంట నేనే చూసుకొనే దాన్ని. రాజశేఖర్ అవేమీ పట్టించుకొనేవాడు కాదు. అడిగేవాడూ కాదు. ఆర్థికంగా ఏమీ యిబ్బంది కాలేదుకాని, పంటలు, అమ్మ, పిల్లలు అంతా నేనే చూసుకోవాల్సి వచ్చింది. కొంచెం కష్టంగానే వుండేది. పార్టీలో ఏమీ పాల్గొనేదాన్ని కాను అని కష్టంగా వుండేది. పిల్లలు కాలేజిలో చేరిన తరువాత వారిని హాస్టలులో వదలాం, ప్రశాంత్‌ను వైజాగ్‌లోను, శ్రీకాంత్‌ను హైదరాబాదులోను వదిలి, భూములు చూసుకోవడం కష్టమని ఇల్లూరు చేరినాము.

నాకు థైరాయిడ్ గ్రంధి ఆపరేషన్ చేయాల్సి వచ్చింది. హైదరాబాదులో ప్రయత్నిస్తే పల్స్‌రేటు సరిగా లేదని ఆపరేషన్ చేయలేదు. ఆహ్వానం వస్తే నన్ను కూడా మాస్కోకు తీసుకెళ్ళారు రాజశేఖరరెడ్డిగారు. అక్కడ అన్నిటెస్టులు చేసి ఆపరేషన్ చేసినారు. లెనిన్‌గ్రాడ్, కీవ్‌లలో శానిటోరియంలలో వున్నాము. ఎన్నో మ్యూజియంలు చూసినాము. హాస్పిటలులో వున్నపుడు నేను వేరే దేశంలో వున్నాను అనే ఫీలింగే రాలేదు. అదో విశేషం. డాక్టర్స్, సిస్టర్స్ అంతా ఆప్యాయంగా చూసేవాళ్ళు. భాషకు సంబంధించి ట్రాన్స్‌లేటర్లు వుండేవారు. శ్రీలంక, బంగ్లాదేశ్ నుంచి వచ్చిన వారితో చాలామందితో పరిచయం ఏర్పడింది. వారంతా పార్టీ కుటుంబాల వారే. చాలా ఫ్రెండ్లీగా వుండేవారు. లోపల ఏమి జరుగుతుందో మనకు తెలీదుగాని, సంతోషంగా ఫ్రెండ్లీగా వుండేవారు. మనకు తెలియని చోటికి, మ్యూజియంకు వెళితే చీర కట్టుకొని వుంటాంగదా, ఇండియన్స్ అని సులభంగా తెలుస్తుంది గదా! పలకరింపుగా నవ్వేవాళ్ళు. భారతీయులంటే ప్రేమతో చూసుకొనేవారు. మరోసారి పోయినపుడు కూడా బ్లాక్‌సీ ఒడ్డున వున్న శానిటోరియంలో వుంచారు. అక్కడ యింకా చాలా బాగుంది.

నాకు పనిభారం అని ఎపుడూ ఫీల్ కాలేదు. బాధ పడలేదు రాజశేఖర్‌గారి విషయంలో ఏ విషయంలోను బాధపడలేదు. ఏ విషయంలోనూ ఘర్షణలు లేవు.

ఆయన చాలా గంభీరంగా, సీరియస్‌గా వుండేవారు. ఎక్కువ మాట్లాడేవారు కాదు. రాజకీయ విషయాలైతే ఎక్కువ మాట్లాడేవారు. వేరే దేశాలకు పోయి వచ్చినప్పుడు అక్కడి విషయాలు చెప్పేవారు. వయసు వచ్చిన తరువాత తన వూరంటే (ఇల్లూరు) ఎక్కువ అభిమానించేవారు. వూర్లో సమస్యలు పరిష్కరించేవారు. ఆయన వస్తాడంటే వూరు వారంతా కాసుకొని వుండేవారు. ఇల్లూరులో సంజీవరెడ్డిగారున్నా కమ్యూనిస్టు పార్టీకే ఓట్లు ఎక్కువ వచ్చేవి. అంటే రాజశేఖరరెడ్డి అంటే జనంలో ఎంత అభిమానం వుండేదో తెలుస్తుంది.

చివరి దినాలలో రాజశేఖరరెడ్డిగారు తన వూరి గురించి ఎక్కువ అనుకొనేవారు "నాకు బాగయిన తరువాత ఇల్లూరులో కొన్ని రోజులు వుందాం లీల'' అనేవారు. ఆయన కోరిక నెరవేరకుండానే పోయారు.

**ఇతరులకు ఆనందం అందించడంలోనే తన ఆనందాన్ని చూసుకున్న మహిళ యెవరన్నా వున్నారంటే ఆమె యీవిడే.**

***- జెన్నీ మార్క్సును గురించి ఏంగెల్స్***



లీలమ్మగారికి లభించిన సోవియట్ దర్శన భాగ్యం



ఉక్రెయిన్ రాజధాని

కీవ్ వద్ద





శ్రీమతి చంద్ర సావిత్రమ్మ, చంద్రశేఖర్ ఆజాద్ గార్లతో

# రాజశేఖరరెడ్డి గారి విశిష్ట వ్యక్తిత్వం



- యం.వి. రమణ

నేను హైదరాబాద్‌లో 1966లో విద్యార్థిగా వుంటున్నప్పుడు "విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు" ఆందోళనకు ఆకర్షితుడనై స్టూడెంట్స్ యూనియన్‌లో సభ్యత్వం తీసుకున్నాను. అప్పుడు రాజశేఖరరెడ్డిగారు రాష్ట్రపార్టీ కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. అనంతపురం జిల్లాకు చెందిన వాణ్ణి కాబట్టి, పార్టీ కార్యాలయంలో ఎప్పుడైనా తారసపడితే వూరికి వెళ్ళి వచ్చావా? పరిస్థితులు ఎట్లున్నాయి? అని మాత్రమే తెలుసుకునేవారు. అంతకుమించి ఆయనతో సన్నిహిత సంబంధం లేదు.

నిర్మాణ సమస్యల యెడల, కార్యక్రమాలు అమలు పరచడంలోనూ రాజశేఖరరెడ్డి గారి వైఖరి ఎలా వుంటుందో కొన్ని ఉదాహరణలు యిస్తాను. నేను జిల్లా యువజన సమాఖ్య కార్యదర్శిగా వున్న సమయంలో రెండు, మూడు పర్యాయములు నీవు అనంతపురం రాలేక పోయావా? నీవు ఎం.ఎ. ఎందుకు చదువుతున్నట్లు? వూరిలో వుంటే నీవు ఒక బర్రె అయిపోతావన్నారు. ఆ వ్యాఖ్యలో వాస్తవమున్నదని ఆనాడు, ఈనాడు అంగీకరిస్తున్నాను. జిల్లా పార్టీ సిఫార్సు చేయక పోయినా 1979లో ఆనాడు రాష్ట్ర ఎడ్యుకేషన్ డిపార్టుమెంటుకు బాధ్యులుగా వున్న వై. విజయకుమార్ గారికి చెప్పి నన్ను మాస్కోకు పంపారు. ఆ విధంగా ఒక కార్యకర్తను పార్టీ నిర్మాణంలో యిముడ్చుకోడానికి ప్రయత్నం చేసినారు.

రాజశేఖరరెడ్డిగారు అనంతపురం వస్తే అందుబాటులో వున్న కామ్రేడ్స్‌తో జిల్లా పార్టీ కార్యక్రమాలు, సమస్యలు చర్చించేవారు. ఒక సందర్భంలో ఒక గ్రామములో హరిజనుల మీద దాడి జరిగింది. మన పార్టీకి సంబంధం లేని గ్రామం. ఆయన ఆ విషయాన్ని తెలుసుకున్న తర్వాత జిల్లా పార్టీపై విరుచుకు పడ్డారు." మీదీ ఒక కమ్యూనిస్టు పార్టీనా? హరిజనుల మీద దాడి జరిగితే స్పందించరా?" అని ఘాటైన విమర్శ చేశారు.

ఒక జిల్లా కమిటీ సభ్యుడు ఆస్తి కొరకు స్వయాన తమ్ముణ్ణి హత్య చేయించాడు. ఈ వార్త రాజశేఖరరెడ్డి గారికి తెలిసింది, ఆ వ్యక్తి జిల్లా కమిటీలో కొనసాగుతుండటం గమనించి, మీ పార్టీలో అలాంటివారికి గౌరవ స్థానం యిస్తారా? అని ఆగ్రహించి పార్టీని సమావేశపరచి అతన్ని బహిష్కరించమని చెప్పాడు. వెంటనే పార్టీ ఆయన్ను

బహిష్కరించింది. అయితే దీర్ఘకాలం పార్టీలో పని చేసినందువల్ల ఆ వ్యక్తికి సహాయపడవలసినదిగా యిద్దరు సీనియర్ నాయకులు కర్నాటక పార్టీకి సిఫారసు లేఖలు రాసి యిచ్చారు. (ఈ నేరం కర్నాటకలో కనుక) రాజశేఖరరెడ్డిగారు కర్నాటక పార్టీకి బాధ్యులుగా వున్నందువల్ల కర్నాటక పార్టీ కార్యదర్శి ఆ లేఖలను ఆయన దృష్టికి తెచ్చినపుడు కోపంగా స్పందించి ఆ లేఖలను ఖాతరు చేయవద్దని గట్టిగా చెప్పారు. రాజశేఖరరెడ్డిగారు విధిగా కొన్ని సాంప్రదాయాలు పాటించేవారు.

ఒకసారి రాష్ట్ర పార్టీ నాయకుడు ఒకరు జిల్లా ప్రజాసంఘ సమావేశానికి అనంతపురం వస్తున్నాడు. రాజశేఖరరెడ్డి గారు, ఆయనా యాధృచ్ఛికంగా ఒకే రైలులో ప్రయాణించి అనంతపురం స్టేషనులో దిగారు. ఆ నాయకున్ని రిసీవ్ చేసుకోడానికి కార్యకర్తలెవరూ స్టేషన్‌కు రాలేదు. రాజశేఖరరెడ్డి ఆయన్ను తన ఇంటికి తీసుకెళ్ళాడు. తర్వాత సమావేశంలో అందుకు బాధ్యులైన వారిని ఘాటైన పదజాలంతో తీవ్రంగా మందలించారు. ఆ బాధ్యులు కంటతడి పెట్టి సమావేశం నుండి వెళ్ళిపోయారు. తర్వాత సర్దుబాటు జరిగింది.

చిన్న విషయాలు కూడా ఆయన దృష్టినుండి తప్పించుకోలేవు. మా జిల్లా పార్టీ కార్యాలయంలో చినిగిపోయిన ఈత చాపలు వుండేవి. "సదాశివన్ కాలం మారినా మనం మారేటట్లు లేమ్! కొన్ని కుర్చీలు కొంటే పోయేదేముంది" అన్నారు. అందుకు సదాశివన్‌గారు చిరునవ్వుతో సరిపెట్టుకున్నారు. మా జిల్లా పార్టీ జీపు అధ్వాన్న స్థితిలో వుండేది. మీది జీపు పెట్టుకోవలసినంత పెద్ద పార్టీ కాదు, మహా అంటే, మీరు మోటారు సైకిల్ పెట్టుకోవచ్చునని నిర్మొహమాటంగా అన్నారు. రాజశేఖరరెడ్డిగారు వాస్తవ పరిస్థితులకు దగ్గరగా వుండేవారు.

ఆయనతో పరిచయం తక్కువగా వున్నవారు ఆయనకు కోపం ఎక్కువ అని వ్యాఖ్యానించేవారు. నాకు కూడా మొదట అలాగే అనిపించేవి. సందర్భాన్ని బట్టి ఆయన స్పందన గమనించిన తర్వాత ఆయన కోపం అర్థవంతమైందని అర్థమయింది. ఆయన కంటూ ఒక పద్ధతి వున్నది. పనిచేసే విధానంగానీ, ఆలోచనలోగానీ ఆ పద్ధతి నుండి వైదొలగినట్లు తోస్తే ఆయన తీవ్రంగా స్పందించేవారు. ఆ విషయంలో వారు, వీరు అన్న భేదం లేదు. పొరబాటుగా స్పందిస్తే దానిని అంగీకరించేవారు.

కళ్యాణదుర్గం తాలూకా బెస్తరపల్లి గ్రామంలో రమణప్ప శెట్టి అనే పెద్ద భూస్వామి వున్నారు. పలుకుబడి కలిగిన వ్యక్తి. ఆయనకూ ఆ వూర్లోని మన పార్టీకి చెందిన పేదలకు ఘర్షణ జరిగినపుడు రమణప్ప శెట్టిగారిని పేదలు ఘాటైన పదజాలంతో

నిందించి మాటాడారట. రాజశేఖరరెడ్డిగారు బెస్తవారపల్లెకు వచ్చినప్పుడు రమణప్పశెట్టి ఈ విషయం ఆయనతో ప్రస్తావించగా, రమణప్పగారూ! మీరూ, మీ పెద్దలూ ఏండ్ల తరబడి వారిని అనరాని మాటలు అన్నారు. పేదవారు యిప్పుడు చక్రవడ్డీ కూడ తీర్చుకోలేదని రాజశేఖరరెడ్డిగారు అనగా రమణప్ప అవాక్కయినట్లు కామ్రేడ్ పి.యస్. శర్మ గారు చెబుతుండేవారు.

రాజశేఖరరెడ్డిగారు సమావేశానికి వస్తున్నారని తెలిస్తే మా జిల్లా కార్యకర్తలు, సభ్యులు ఆనందంగా వుండేవారు. ఎందుకంటే ఆయన ఏదో మనకు క్రొత్తది చెబుతాడు అని అభిప్రాయం వుండేది.

సదాశివన్‌గారి సంతాప సభలో రాజశేఖరరెడ్డి మాటలు మరిచిపోలేనివి. "యిల్లూరు, అనంతపురం తప్ప ఏమీ తెలియని నాకు సదాశివన్‌గారు గ్రామాల్లో సామాన్య ప్రజానీకానికి పరిచయం చేశారు." ఒక భూస్వామి కుటుంబంలో పుట్టి, ఉన్నత విద్య నభ్యసించి సిపిఐ జాతీయ నాయకునిగా ఎదిగిన రాజశేఖరరెడ్డిగారు ఎంతో నమ్రతతో అన్న మాటలవి. సదాశివన్ ట్రస్టు ఏర్పడటానికి ఆయన కారకులు. దాని కొరకు వ్యక్తి గతంగా కృషి చేశారు.

రాజశేఖరరెడ్డి పలుకు కటువుగా వుంటుంది. మనసు వెన్నలాంటిది. ఉపమానంతో కూడిన ఆయన పొదుపైన మాట అనంతమైన అర్థాన్నిచ్చేది. ఆయనొక విశిష్టమైన వ్యక్తి.

**"నేను సంపన్నుల సాంగత్యాన్ని, విందు భోజనాల్ని విసర్జించాను. మధ్య తరగతులు సేవించే పోర్టువైన్‌నీ, షాంపేన్‌నీ కాలదన్నేను. నా తీరిక సమయాన్ని ఇంచు మించు పూర్తిగా సామాన్య కార్మికులతో సాంగత్యానికి వినియోగించాను. అలా చేసినందుకు సంతోషపడ్డాను, గర్వపడ్డాను, సంతోషించడమెందుకంటే ఆ విధంగా నేను జీవిత వాస్తవాలను తెలుసుకోడానికి అనేక గంటలు ఆనందంతో గడపగలిగాను. లేకపోతే ఆ సమయమంతా ఫ్యాషన్లకు సంబంధించిన సంభాషణల్లోనూ, నిరర్థక మర్యాదల్లోనూ వ్యర్థమై పోయేది. గర్వించడ మెందుకంటే ఆ విధంగా నేను పీడిత వర్గానికి, ధూషిత వర్గానికి న్యాయం చేకూర్చేందుకు అవకాశం కలిగింది".**

***- ఏంగెల్స్ (కంభంపాటి కమ్యూనిస్టు నీతి గ్రంథం నుండి)***



# "రాజశేఖరరెడ్డిగారి మరణవార్త విని బండబారి పోయాను"

- జంధ్యాల లక్ష్మీసుందరమ్మ

చక్కని రాయలసీమ మాండలిక సొంపు నింపుకున్న కమ్మని యాసగల తెలుగులో "ఏమమ్మా, ఎలా వున్నారు, కుశలమేగదా" అన్న వారి చల్లని పలకరింపు హృదయాంతరంగాల్లో చేరి ఎంతో ఓదార్పునిచ్చేది.

అజ్ఞాత వాసానికి ముందు రాజశేఖరరెడ్డిగారితో నాకు ముఖ పరిచయం మాత్రమే కలదు. అజ్ఞాత వాసంలో పసివాడైన మా బాబు విప్లవకుమార్‌తో అనంత పురంలో గడిపాము. నేను కృష్ణా జిల్లా పార్టీ దళంతో కలిసి వుంటిని. అప్పటి నుండి మా దంపతులకు రాజశేఖరరెడ్డి గారితో అనుబంధం పెరిగింది. కామ్రేడ్ శాస్త్రి గారు దళంతో నన్నచ్చట వుంచి వేరేచోట్లకు వెళ్ళేవారు.

మిత్రులూ, బంధువూ ఐన శ్రీ లొల్లా సుబ్బారావుగారు అనంతపురంలో బ్యాంకు ఆఫీసర్‌గా వుంటున్నారు. నేను శారదానికేతన్‌లో టీచర్‌గా చేరాను. రాజశేఖరరెడ్డి, సుబ్బారావుగార్లు చాలా కాలంగా మంచి స్నేహితులు. అది సుజనుల మధ్య మైత్రి. రెడ్డిగారు సహృదయులు. ఓరిమిగల వారి వ్యక్తిత్వం గురించి శాస్త్రిగారు అనేవారు- "రాజశేఖరరెడ్డి గారు ఇతరులను ఎంత ఘాటుగా విమర్శించునో, తనపై కూడా అంతటి తీవ్రమైన విమర్శ వచ్చినపుడు చిరునవ్వుతో స్వీకరించగలడు. పగ, కక్ష సాధించుట లాంటివి అతనికి పనికిరావు. మరుక్షణమే ఆ కామ్రేడ్ భుజంపై చేయివేసి పలకరిస్తాడు. అంతటి గొప్పగుణం కొందరికే వుంటుంది. అది మన రాజశేఖరరెడ్డి గారికి వుంది సుమా" అనేవారు శాస్త్రిగారు.

భారత కమ్యూనిస్టు పార్టీకి చీలిక అనే విఘాత మొచ్చినపుడు రాష్ట్ర పార్టీ కార్యదర్శిగా రెడ్డిగారూ, కృష్ణా జిల్లా పార్టీ కార్యదర్శిగా శాస్త్రిగారూ వుండిరి. శాస్త్రిగారు ఏర్పాటు చేసిన మారుమూల సమావేశాలకు కూడా విసుగు, విరామం లేకుండా రెడ్డిగారు హాజరయ్యేవారు. ఏక బిగిన కొన్ని గంటల పాటు రాజకీయ విధానాన్ని వివరించేవారు. వాగాడంబరముతో సభ్యులను అయోమయంలో ముంచక చక్కగా విడమర్చి చెప్పేవారు. మధురగళంతో క్లిష్ట రాజకీయమును బోధించినట్లు వుండేది- వారి రిపోర్టు, వారి భాష, భావ వ్యక్తీకరణ చిన్న చిన్న వాక్యాల్లో జాతీయ, అంతర్జాతీయ పరిస్థితులను

---

*శ్రీమతి సుందరమ్మగారు మహిళా సమాఖ్య నాయకురాలు. కీ.శే. జి.యస్.ఆర్.ఆంజనేయశాస్త్రిగారి సతీమణి.*

గురించి చెప్పేతీరు సామాన్యుని సైతం రాజకీయవంతుని గావించిందంటే అతిశయోక్తి కాదు. అరటిపండు ఒలిచి అరిచేతికిచ్చినట్లు శ్రోతల కందించగల నేర్పు రెడ్డిగారిది.

చిత్రలేఖనం, శాస్త్రీయ సంగీతం, నృత్యము వారికి చాలా యిష్టము. మేము కొంత కాలంగా ముఖ్దుం భవన్‌లో వుంటున్నాము. శాస్త్రిగారితో కలిసి రెడ్డిగారు మా గదికి వచ్చేవారు. కాఫీ, టీ ఏమీ వద్దమ్మా - నేనొచ్చింది మీ పాట వినటానికే అనేవారు. నేను వచ్చి కూర్చొనగానే త్యాగరాజకృతిగానీ, తరంగం లాంటివి గానీ అడిగేవారు. మంచి లయ జ్ఞానం గల రెడ్డిగారు క్రమం తప్పకుండా సునాయాసంగా తాళం వేస్తూ నన్ను ప్రోత్సహించేవారు. ఆనందభైరవి, మధ్యమావతి, సామరాగం, కేదారగౌళ లాంటి మృదువైన రాగాలు కోరి పాడించుకునేవారు. దీనిని బట్టి వారి మనసు ఎంత సున్నితమో అర్థమౌతుంది.

15 ఏండ్ల కిందట నాకు కామెర్లు, షుగర్, బ్లడ్‌ప్రెషర్ వ్యాధులు ఒక్కసారిగా ముట్టడించాయి. రెడ్డిగారు నన్ను స్వయంగా ఆస్పత్రిలో చేర్పించి తన పర్యవేక్షణలో చికిత్స చేయించారు. శాస్త్రిగారిని సి.డి.ఆర్. లో చేర్చాక దాదాపు ప్రతిరోజూ వచ్చి డాక్టర్లతో మాట్లాడుతూ గంటల తరబడి కూర్చునేవారు. ధైర్యం చెప్పుతూవుంటే ఎంతో దండిగా వుండేది మాకు. శాస్త్రిగారు మరణించాక తరచు వచ్చి, ఎలా వున్నావమ్మా! ఇంజక్షన్సు వాడుతున్నావా? మందులెలా తెప్పిస్తున్నావు? నాకు చెప్పమ్మా. వండుకుంటు న్నావా? తింటున్నావా? అంటూ వెనక్కి పొయ్యిదాకా వెళ్ళి చూచేవారు. నా స్వంత అన్నలాంటి వారి ఆదరణ మరుపురాదు.

ఆ స్నేహశీలికి దురదృష్టవశాత్తు కిల్లర్ వ్యాధి వచ్చింది. చూట్టానికి వెళ్ళాను. పడుకున్నవారు లేచి వచ్చి నా ప్రక్కన కూర్చున్నారు. తన కుడిచేతితో నా కుడిచేయి ఎత్తి తన తలపై పెట్టుకొని ఆశీర్వదించండి, ఈ బాధ భరించలేనన్నారు. అయ్యో! ఇంకా నా చేతికీ, నా ఆశీస్సుకూ జీవం వుందా? అన్నాను. ఆ, వుంది. మీరున్నారంటే శాస్త్రిగారు వున్నట్లేగదా! అంటూ అంత బాధలోనూ చిన్నగా నవ్వారు.

డిసెంబరు 13 రానే వచ్చింది. కామ్రేడ్ రాజశేఖరరెడ్డి గారు కన్నుమూశారన్న ఘోర వార్త విని బండబారి పోయాను. బరువెక్కిన గుండెతో ఆ మహనీయుని భౌతిక కాయానికి ప్రదక్షణ చేసి శ్రద్ధాంజలి ఘటించాను. ఆప్యాయతగల ఆదరణ పోగొట్టుకొన్న నేను వారి కుటుంబమును చూడలేకపోయాను. సోదరి లీలాగారినీ, అమరజీవి కామ్రేడ్ రాజశేఖరరెడ్డి గారి కుమారులనూ పలకరింపనోరు రాలేదు. అలా చూస్తూ వుండి పోయాను.



# రాజశేఖర్ సాహచర్యం నేను మరువలేనిది

- జి. రామకృష్ణ

నీలం రాజశేఖరరెడ్డిగారితో నా పరిచయం రాజకీయం గానే కాదు, వ్యక్తిగతంగా సన్నిహితులం కూడా. అనంతపురం పాతవూరు మునిపిల్ హైస్కూల్‌లో ఫస్టుఫారంలో ఒకేసారి చేరినాం. ఆయనతో పాటే వారి అన్న నీలం సంజీవరెడ్డిగారు థర్డ్‌ఫారమ్‌లో చేరినారు. చెల్లెళ్ళు గర్ల్స్ హైస్కూల్‌లో చేరినారు. వంట మనిషిని పెట్టుకొని చదివేవారు. రాజశేఖరరెడ్డి మంచి హాకీ ప్లేయరు. ప్రతిరోజు సాయంత్రం హాకీ ఆడేవాళ్ళం. యన్. వెంకటరావు అనే టీచరు వుండేవాడు. ఆయన ఎవరికీ ట్యూషన్ చెప్పడు. చెప్తే ఒకే ఒకనికి చెప్పేవాడు. రాజశేఖర్‌ను ఆయన దగ్గర వదిలినారు. ఆ కాలంలో ట్యూషన్ ఫీజు ఒక రూపాయి. కానీ రాజశేఖర్‌కు ఆయన తండ్రి చిన్నపరెడ్డిగారు నాల్గురూపాయలు యిచ్చేవాడు. దర్డ్‌ఫారమ్ తరువాత రాజశేఖర్ రుషీవాలీలో చేరారు.

రుషీవాలీ తర్వాత రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డిగార్లు చదువుకోసం బెనారస్ పోయినారు. అయితే యిద్దరూ ఒక వంద మాత్రమే భోజనాలకు వాడుకొని మిగతా వందకు పుస్తకాలు కొనేవారు. ఫారిన్ నుండి నాలుగు పుస్తకాలు ఇండియాకు వస్తే ఒక పుస్తకం వీళ్ళ దగ్గర వుండి తీరుతుంది. బాగా చదివేవారు పుస్తకాలు. బెనారస్‌లోనే కమ్యూనిస్టు పార్టీతో పరిచయం ఏర్పడింది వారికి. రుద్రదత్త భరద్వాజ్ (ఆర్థికవేత్త, కమ్యూనిస్టు పార్టీ పోలిట్‌బ్యూరో మెంబరు) వీరికి పాఠాలు చెప్పేవారు. రాజశేఖరరెడ్డికి తత్వశాస్త్రం యిష్టమైన అంశం. తరిమెల నాగిరెడ్డికి ఆర్థికశాస్త్రం అంటే యిష్టం.

అనంతపురంలో నేనూ, సదాశివన్ "కేశవ విద్యానికేతన్" హరిజన హాస్టలుకు బాధ్యులుగా వున్నాం. మేము బందరు నేషనల్ కాలేజి విద్యార్థులం. మద్రాసు నుంచి యస్.వి.ఘాటే సంపాదకత్వాన వెలువడే "న్యూ యేజ్" తెప్పించుకొని చదువుకుంటూ, చర్చించుకుంటూ వుండేవారం. ఆలిండియా కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శిగా పి.సి.జోషీ వుండేవారు. రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి అనంతపురం వస్తూ అనంతపురంలో కమ్యూనిస్టు పార్టీవారు ఎవరైనా వున్నారా అని అడిగినపుడు, ఎవరో యిద్దరున్నారు, పేర్లు తెలియదు

---

*జి.రామకృష్ణగారితో అభ్యుదయ రచయిత విద్వాన్ దస్తగిరి జరిపిన ఇంటర్వ్యూ ఇది. సదాశివన్‌గారి జీవిత చరిత్ర రాసినది విద్వాన్ దస్తగిరిగారు.*

అన్నారు పి.సి.జోషీగారు. వీళ్ళిద్దరూ సెలవులలో అనంతపురం వచ్చినప్పుడు మమ్మలను చూడటానికి కాంగ్రెసు ఆఫీసుకు వచ్చినారు. అది వరకు నేను నాగిరెడ్డిని చూడలేదు. ఆ విధంగా మేము మరల కలుసుకున్నాం. ఒక పార్టీ సెల్ ఏర్పాటు చేయాలనుకున్నాం. మా నలుగురితో ఒక సెల్ ఏర్పడింది. విద్యార్థులకు స్టడీ సర్కిల్స్ ఏర్పాటు చేసేవారం. పొలిటికల్ సైన్స్, ఆర్గనైజేషన్ గురించి రాజశేఖర్ చేప్పేవారు. నాగిరెడ్డి ఆర్థికశాస్త్రం చెప్పేవారు. మోటూరు హనుమంతరావు, వై.వి.కృష్ణారావుగారు కూడా క్లాసులు తీసుకున్నారు. ఏటుకూరి బలరామమూర్తిగారు కూడా రాయలసీమ ఆర్గనైజర్‌గా వచ్చినారు. ఆయన క్లాసులు తీసుకొనేవారు. చర్చించేవారం. విద్యార్థుల రూంకు పోయి లిటరేచర్ యిచ్చేవాణ్ణి. అమ్మ, కూలి నవలలు, కమ్యూనిస్టు మ్యానిఫెస్టో, ఆగ్రా లిటరేచర్ యిచ్చేవాళ్ళం.

ఉత్తరప్రదేశ్ వారంటుపై రాజశేఖర్ అరెస్ట్ అయినారు. "ఆకాశవాణి" కేసులో సదాశివన్, నేనూ అరెస్టు అయినాం. జైలు నుండి వచ్చిన తర్వాత వివిధ ప్రజాసంఘాల నిర్మాణానికి పూనుకున్నాం. రైతు సంఘం, విద్యార్థి సంఘం, మునిసిపల్ వర్కర్స్ సంఘం, వ్యవసాయ కార్మిక సంఘం నిర్మించాం. బలమైన రైతు సంఘ నిర్మాణం చేసినాం. కళ్యాణదుర్గం, కదిరి, తాడిపత్రి, గుత్తి యిలా అన్ని ప్రాంతాలు తిరిగి రైతు సంఘ నిర్మాణం చేసినాం. తరిమెల నాగిరెడ్డి ఉపన్యాసాలిస్తూ వూరూరు తిరిగినాడు. ఆయన ఉపన్యాసాలు బాగా చెప్పేవాడు. రాజశేఖరరెడ్డి గంభీర ఉపన్యాసం చెప్పేవాడు. ఆవేశం లేదు. ఆయన టీచరు. బహిరంగ సభల్లో కూడా అయ్యవారు చెప్పినట్టు చెప్పేవాడు. వెన్నలో వెంట్రుక తీసినట్లుగా, విపులంగా అర్థమయ్యే విధంగా, మంచి సెటైర్‌తో చెప్పేవారు. ఆర్గనైజేషన్ అంతా రాజశేఖరరెడ్డిది. తరిమెల నాగిరెడ్డి అంతా జైలు, అజ్ఞాత వాసం, ఉపన్యాసాలు. ఆయన ఓడినా బహిరంగసభ, ఉపన్యాసం. గెల్చినా బహిరంగసభ, ఉపన్యాసం.

రాజశేఖరరెడ్డి మంచి ఆర్గనైజర్. ప్రజా సంఘాలు పెరుగుతున్నాయి. గుంతకల్లు రైల్వే యూనిట్ బాధ్యత కూడా అనంతపురం పార్టీపైనే పడింది. ఆధోని ఏరియాలో కార్మిక సంఘాలు ఆర్గనైజ్ చేసిన అనుభవం వి.కె. ఆదినారాయణరెడ్డికి వుంది. అందు వల్ల వి.కె.ను ఆర్గనైజర్‌గా గుంతకల్లుకు పంపితే బాగుంటుందని జిల్లా కార్యవర్గంలో ప్రతిపాదించారు రాజశేఖర్. పార్టీ ఆ తీర్మానాన్ని ఆంగీకరించింది. అట్లే సదాశివన్‌ను కదిరి ఆర్గనైజర్‌గా పంపినారు. నన్ను అనంతపురంలోనే బుక్‌స్టాల్ పెట్టుకోమన్నారు. కొరియర్‌గానూ, విలేకరిగానూ వుపయోగపెట్టుకున్నారు. బుక్‌స్టాల్ పెట్టుకోడానికి నా

దగ్గర డబ్బు లేదు. రాజశేఖరరెడ్డి మా మామ దగ్గరకు పోయి మాట్లాడి రూ.500/-లు యిప్పించినాడు.

వాదించడంలో ఒప్పించడంలో మంచి నేర్పున్నవాడు. చర్చలకు కూర్చుంటే తక్కువ ఆధారాలతో, మంచి తర్కంతో వాదిస్తాడు. కార్యకర్తలకు చాలా ఓపికగా జవాబు చెప్తాడు.

ఐదుకల్లు సదాశివన్‌కు రాజమ్మతో పెండ్లి కుదిర్చింది రాజశేఖర్. అలాగే సి. ముత్యాలప్ప (గాదిగకుంట) తన చెల్లెలు హైమావతికి పార్టీవారితోనే పెండ్లి చేయాలని పార్టీకి చెప్పినాడు. కరుగు క్యాంపు కార్యకర్తగా తాతినేని వెంకటేశ్వరరావు కోస్తా నుండి వచ్చి, ఉరవకొండలో ఆర్గనైజర్‌గా నిలిచిపోయినాడు. హైమావతికి, వెంకటేశ్వరరావుకు పెండ్లి చేస్తే బాగుంటుందని అన్నాడు రాజశేఖర్. మొదట వెంకటేశ్వరరావు అంగీకారం తెల్పలేదు. అందువల్ల చంద్ర రాజేశ్వరరావుగారి ద్వారా చెప్పించినాడు రాజశేఖర్. ఆయన సలహాతో, వివరణతో మందలింపుతో వెంకటేశ్వరరావు వొప్పుకున్నాడు.

జిల్లా పార్టీలో సంపాదన ఉండేది రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డిలకే పార్టీ లేవిగా తరిమెల నాగిరెడ్డి ఆరువేలు (ఒకతే కూతురు గనుక) రాజశేఖరరెడ్డి ఐదువేలు ఇవ్వాలని (నలుగురు కొడుకులు గనుక) పార్టీ నిర్ణయించింది. అట్లే యిచ్చేవారు. ఎవరి డబ్బు వారే ఖర్చు పెట్టుకొనేవారు.

రాజశేఖర్ పేదల పక్షపాతి. చాలా ఖచ్చితమైన మనిసి. రైతుల అప్పుపత్రాలు వాపసు ఇచ్చినాడు. బీదవాళ్ళు ఏమీ కట్టనక్కరలేదు. యివ్వగలిగినవాడు అసలు యివ్వ వచ్చు. వీళ్ళు పెద్ద రైతులు. వడ్లు లేవీ యివ్వాలి. అయినా అధికారులు అడిగేవారుకాదు. రాజశేఖర రెడ్డి అధికార్లను పిలిచి "మాకింత పండింది. మీ లేవీ మీరు తీసుకొని పోండి" అని యిచ్చినారు. రాజశేఖరరెడ్డి ఎక్కువ మాట్లాడేవారు కాదు. కానీ, ఏమాట మాట్లాడినా ఇంట్లో వారుకానీ, ఊర్లో వారుకానీ చాలా విలువ యిచ్చేవారు. రాజశేఖరరెడ్డిగారి తల్లి రామసుబ్బమ్మగారు పట్టుదల మనిషి. ఎవరినీ లెక్కచేయదు. కానీ, రాజశేఖరరెడ్డి మాటకు ఎదురు చెప్పదు. వూరిలో ఏదైనా పంచాయితీ తీర్పు చెప్పినా, రాజన్న చెప్పి నాడా, అది అంతేలే అని సంజీవరెడ్డిగారు కూడా అనేవారు.

నన్ను పట్టుకొని కడలూరు జైలులో పెట్టినారు. అక్కడ జరిగిన కాల్పులలో నా కన్ను పోయింది. గాయం మానడానికి మద్రాసు ఆస్పత్రిలో నన్ను చేర్పించింది ప్రభుత్వం. పోలీసుల కాపలా వుంది. రాజశేఖర్ అజ్ఞాతంగా వున్నారు. జూనియర్లను వెంటబెట్టుకొని వార్డు సందర్శించే డాక్టరులా రాజశేఖర్ నన్ను చూడటానికి వచ్చినాడు.

నాతో మాట్లాడినాడు. నా ధైర్యానికి మెచ్చుకున్నాడు. నన్ను సముదాయించినాడు. జరిగిన దానికి బాధపడినాడు. ఇది నాకు మరుపురాని ఘటన. రాజశేఖరరెడ్డి సాహచర్యం నాకు మరువరానిది.

రాజశేఖరరెడ్డి రచనలు, ఆయన జీవిత విశేషాలతో పుస్తకం రావడం మంచిది. రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి, ఐదుకల్లు సదాశివన్‌గార్ల చరిత్ర పుస్తకంగా రావడం అవసరం. వీళ్ళు మన జిల్లా ఉన్నతికి కృషి చేసినవారు. ఆర్థికంగా వెనుకబడి వున్నా సాంస్కృతికంగా ముందున్న జిల్లా యిది. వాళ్ళ స్మృతి చిహ్నంగా పుస్తకం తీసుకు రావడంతో పాటు వీరి విగ్రహాలు పెట్టడం కూడా అవసరం. యిప్పటికే సదాశివన్ పుస్తకం తెచ్చారు. రాజశేఖర్‌గారి పుస్తకం కోసం కూడా ప్రయత్నిస్తున్నందుకు చాలా సంతోషం.



# కక్ష, కార్పణ్యంలేని మనస్తత్వం రాజశేఖర్‌ది

- పూలకుంట సంజీవులు

అనంతపురంలో ఐదుకల్లు సదాశివన్ హరిజన హాస్టలు కేశవ విద్యానికేతన్ నడిపేవాడు. ఆయన గ్రామగ్రామాలు తిరిగి ధాన్యం అడుక్కొచ్చి హాస్టలు నడిపినాడు ఆ సందర్భంలో ఆయన మా గ్రామలకు పూలకుంట, చియ్యేడు గ్రామాలకు వచ్చేవాడు. వాగ్దానం చేసినవారినుండి గింజలు వసూలు చేసి, నేను హాస్టలు చేర్చేవాణ్ణి, ఆ హాస్టలులో నీలం రాజశేఖరరెడ్డితో పరిచయం అయింది. సదాశివన్, రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి, పార్టీలోకి యువకులను ఆకర్షించే ప్రయత్నము చేసినారు. రాజశేఖరరెడ్డి యింట్లో రెండు మూడు రోజులు క్లాసులు నడిపేవారు. రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి, విద్వాన్‌విశ్వం మాకు టీచర్లు. 1943లో కమ్యూనిస్టు పార్టీని ఆర్గనైజ్ చేయడానికి ఒక సమావేశం 32మందితో జరిగింది. రాష్ట్రపార్టీ నుండి ముక్కమల నాగభూషణం వచ్చినాడు. సదాశివన్, నాగిరెడ్డి, రాజశేఖరరెడ్డి, వి కె. ఆదినారాయణరెడ్డి, జి. రామకృష్ణ ఆర్గనైజింగ్ కమిటీ మెంబర్లు గానూ, రాజశేఖరరెడ్డి కార్యదర్శిగానూ ఎన్నుకోబడ్డారు.

1944-45 సం॥లో ధర్మవరంలో పేరూరు ప్రాజెక్టు మహాసభలు జరిగినాయి. జిల్లా కాంగ్రేసు నాయకులు వద్దన్నా ధర్మవరంలో కాంగ్రేసు పార్టీ నాయకులు పల్లెం శ్రీనివాసులు కమ్యూనిస్టు పార్టీకి సహకరించినాడు. ఆ మహా సభలకు గాడిచర్ల హరిసర్వోత్తమరావు హాజరైనాడు. 1945లో బుక్కపట్నంలో జిల్లా రైతు మహాసభ జరిపినాం. నాల్గు వేలమందికి పైగా రైతులు హాజరైనారు. కార్యకర్తలు 100 మంది వచ్చారు. పుచ్చలపల్లి సుందరయ్య వచ్చినారు. మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి బుర్ర కథ చెప్పడానికి వచ్చినాడు. మహాసభల సందర్భంగా గ్రామాల్లో ప్రచారానికి సదాశివన్ మూడు దళాలను ఏర్పరచినాడు. ఈ నీలం రాజశేఖరరెడ్డి, వి.కె. ఆదినారాయణరెడ్డి, వెంగళమ్మ చెర్వు లక్ష్మినారాయణరెడ్డి దళానాయకులు. జనం అంటే పడిచస్తాడు రాజశేఖర్. నిరంతరం జనం మధ్యనే వుండాలనే వాడు. అదో ఆనందం ఆయనకు.

1946లో ఉరవకొండలో కమ్యూనిస్టు పార్టీ జిల్లా మహాసభలు జరిగినాయి. 62 మంది ప్రతినిధులం హాజరైనాము. రాష్ట్రం నుండి చంద్ర రాజేశ్వరరావు హాజరైనాడు. నీలం రాజశేఖరరెడ్డి కార్యదర్శిగా ఎన్నికైనాడు. నేను (పూలకుంట సంజీవులు) తరిమెల శ్రీరాముల రెడ్డి, సోదనపల్లి నారాయణరెడ్డి, బంగి ఎర్రస్వామి, బంగి రామప్ప, తుపాకుల

---

*సంజీవులుగారిది అనంతపురం దగ్గర పూలకుంట. దళితులు, సి.పి.ఐ. జిల్లా కార్యవర్గంలో పని చేశాడు. సాహిత్యాభిమాని.*

రాముడు, కమ్మక్కగారి దాసప్ప, ఘనేనాయక్, చింతలయ్య, తాతినేని వెంకటేశ్వరరావు, చలిచీమల ముత్యాలప్ప ప్రతినిధులలో కొందరం.

విపత్తులో మంచి సమయస్ఫూర్తి చూపుతాడు రాజశేఖరరెడ్డి. ఒకసారి నేనూ, రాజశేఖరరెడ్డి కనగానపల్లి మండలం తగరుకుంట నుండి ఆత్మకూరు మండలం పడమట నారాయణ పురానికి రాత్రిపూట పోతున్నాము. శివాయిజమా పోరాటం బలంగా జరుగుతున్నకాలం. కడదరకుంట, కరుట్లపల్లి, నారాయణపురం యింకా జిల్లాలో చాలా చోట్ల పార్టీ పోరాటం చేస్తున్నది. చట్టం రాకనే వేలాది ఎకరాలు పంచింది పార్టీ. ఈ ఏరియాలోని రెవెన్యూ ఇన్స్‌పెక్టరును సస్పెండు చేయించింది పార్టీ. అప్పుడు మేము నడుచుకుంటూ పోతున్నాము. మాకు ఎదురుగా ఇద్దరో ముగ్గురో వస్తున్నారు. యింకా అంతదూరంలోనే మమల్ని చూసి వారు నిలబడినారు. వాళ్ళని చూసి మేము నిలబడినాము. ఎట్లా వాళ్ళతో సంప్రదింపులు చేసేది? రాజశేఖరరెడ్డి "సంజీవులు" అనె. "ఏం రాజన్నా? ఒక పాట పాడప్పా!" అన్నాడు. పాట పాడితి. "మన కమ్యూనిస్టు పార్టీ వాళ్ళేరో" అని వాళ్ళు మా అంచుకు వచ్చినారు.

గార్లదిన్నె మండలంలో బూదేడు గ్రామం వుంది. ఆ వూర్లో గుజ్జం నారాయణప్ప పెద్ద భూస్వామి. అక్కడ 500 ఎకరాలు ఆక్రమించినాం. పూలకుంట సంజీవులు, సి. ముత్యాలప్ప, సంకిరెడ్డి, తరిమెల శ్రీరాములరెడ్డి యింకా మేమంతా జనాన్ని పోగుచేసుకొని పోయినాం. 1952 నాటి మాటయిది. మాకు నాయకత్వం వహించింది నీలం రాజశేఖరరెడ్డి. భూస్వామి సారాయి డబ్బాలు దించినాడు. మంది మార్బలం దించినాడు. రౌడీలను దించినాడు. రాజశేఖర్ నాయకుడు కాబట్టి యస్.ఐ.వచ్చి మొదట భూస్వామిని అరెస్టు చేసినాడు. ఆ రోజుల్లో యిదోవింత. మా చరిత్రలో యిదో విజయంగా నమోదు అయింది. మా పోరాటాల్లో అంతవరకు ఏ భూస్వామిని అరెస్టు చేయలేదు అని నవ్వుకున్నాము.

నీలం రాజశేఖరరెడ్డి దగ్గర బంధువు తిమ్మ సముద్రం నారాయణరెడ్డి. ఆయనవి 800 ఎకరాలు ఆక్రమించాలని పార్టీ నిర్ణయము. ఆ వూరికి పోయినాము. అక్కడ పార్టీ కార్యకర్త బలరాయప్ప. కార్యకర్తయింటికే పోయినాము. ఆడే భోంచేసినాం. నారాయణరెడ్డి అదేపనికి బి.సి.ల వీధిలోకి వచ్చినాడు. "ఏమి రాజశేఖరరెడ్డీ! ఇంటికొచ్చి భోంచేసి, యివన్నీ చూసుకోవచ్చుకదా! ఆతరువాత నీ రాజకీయాలు నీవి. ఏమన్నా చేసుకో. నాకు చేతనవుతే ఎదుర్కొంటా, లేకపోతే ఓడిపోతా." అన్నాడు. ఆయన బాగా తెలివైనవాడు. ముసలోడు. ఆయన ఆ తరువాత భూములు వదులుకున్నాడు.

ఆత్మకూరు మండలం పడమట యాలేరులో క్రైస్తవులు ఎక్కువ. మాజి పార్లమెంటు సభ్యుడు ఆంథోనిరెడ్డిది ఆ వూరే. ఆ వూర్లో చర్చి వుంది. మేధావులున్నారు. బి.ఏ; యం.ఏ; లు చదివిన వాండ్లున్నారు. "ఈ దేశానికి కమ్యూనిజం కొత్తది. ఇక్కడ

ఎట్ల అభివృద్ధి అవుతుంది?'' అని ప్రశ్నించేవారు. "మీరు కోరే క్యాపిటలిజం కూడా యీ దేశానికి కొత్తకదా! అది ఎట్లా మనగలుగుతుంది?'' అని ప్రశ్నించేవాళ్లం. 1955 ఎలక్షన్లలో ఆ వూరికి ప్రచారానికి పోయినాం. ఆంధోనిరెడ్డి మన ప్రత్యర్థి. సంజీవరెడ్డికి ప్రియమిత్రుడు. ఆ వూరిలో అతి పేదవాళ్ళ యింటికే రాజశేఖరరెడ్డి పోయేవాడు. అక్కడే గోనిపట్ల మీదనో, పాత ఈత చాపల మీదనో, కూర్చొనో వాళ్ళం. వాళ్లు పెట్టిన బొరుగులో, కారం బొరుగులో తినేవాళ్ళం. ఈ సంగతి ఆరెడ్లకు తెలిసింది. నేరుగా గ్యాసులైట్లు ముట్టించుకొని ఏడెనిమిది మంది వచ్చినారు. నన్ను ముద్దలాపురం ఓబులేసును చూసి "మీకన్నా తెలీదా మేముండేది. మా యింటికి వచ్చి కూడుతిని, యాడన్నా చావండి. ఇదంతా సంజీవరెడ్డికి చెప్పితే మాకు సిగ్గు కదా!'' అనేవాళ్ళు. "వీళ్ళతో మాట్లాడుదామని వచ్చినాము. మాట్లాడిన తర్వాత వస్తామనుకొంటి! మీరు మాకు ఓటు వేయరని తెలుసు. అయినా అడిగే బాధ్యత వుంది కదా!'' అనేవాడు రాజశేఖరరెడ్డి.

మనం రెడ్ల యింటికి పోదాము అంటే ఒప్పుకునే వాడు కాదు. "సంజీవులూ నువ్వు వూరుకో. మనం ఎవరింటికి పోవల్లో ఆటికే పోవల్ల. నువ్వు తినకపోయినా నేను తింటా నప్పా!'' అనేవాడు. ఎక్కడైతే పోరాటాలు జరుగుతున్నాయో, అక్కడే ఆ పేదవారింట్లోనే కూర్చొనేవాడు. వాళ్లు పెట్టింది తినేవాడు. తగరకుంటలో పెద్దపోరాటం జరుగుతోంది. అక్కడ కమ్మ భూస్వాములు, వాళ్ళంతా బాగా ఆతిధ్యం యిచ్చినవాళ్ళే. భూపోరాటం వల్ల మనకు వ్యతిరేకులైనారు. కానీ ఊర్లోకి పోతే కాఫీకి రమ్మంటారు. కాని ఈయన అట్లపోడు. ఈయన పార్టీకి కావాల్సిన వారిండ్లకు, వడ్డె, బోయ, పేదల యిండ్లకు పోయేవాడు. వాళ్ళిండ్లలో చేసిన కర్జికాయలో, అంగట్లో తెచ్చినవో తినేవాడు. నేనే వెనక ముందాడితే నవ్వి "నువ్వెక్కడ కార్మిక నాయకుడివయ్యా?'' అనేవాడు.

వ్యవసాయ కార్మికులకు కూలి పెంపుదల కార్యక్రమం చేపట్టింది పార్టీ. నీలం రాజశేఖరరెడ్డి వెంబడి ఇల్లూరు పోయినాను. పార్టీ పిలుపు మేరకు 1 శేరు గింజలు పెంచుతూ పైటాల బువ్వ పెడదాం అన్నాడు రాజశేఖరరెడ్డి. ఆయన తల్లిగారు రాజశేఖరరెడ్డికి ఎదురు చెప్పలేదు. ఆమె నన్ను పిలిచి "నువ్వన్నా చెప్పప్పా'' అంది. నామాట ఎట్ల యింటాడు పెద్దమ్మా? అన్నాను. శింగనమల, తరిమెల రెడ్లు "రాజశేఖరరెడ్డి మా కొంపలు ముంచినాడు'' అని కేకలు వేయబట్టి, "మనం అమలు జరపకపోతే ఎవరు అమలు పరుస్తారు?'' అని. పార్టీ గ్రామాల్లో ఒత్తిడి చేసి కూలి పెంచేటట్లు చేసినాడు. పార్టీ జిల్లా కమిటీలో అందరు భూస్వాములే. భూస్వామ్య వ్యతిరేక పోరాటంచేయాలని నిర్ణయించినారు.

1955 ఎన్నికలలో ఓడిపోయిన తరువాత కార్యకర్తలు నిరాశలో వున్నారు. తరిమెల నాగిరెడ్డి, నీలం రాజశేఖరరెడ్డి మీటింగులు పెట్టి ఉత్సాహం కలిగించినారు.

మా శాఖలో (పూలకుంట) తగాదా వచ్చింది నాకు, నరసింహారెడ్డికి. ఆయన్ను గ్రామశాఖ 6 నెలలు సస్పెండు చేసింది. ఆయన తాలూకా ఆర్గనైజరు. తరిమెల నాగిరెడ్డి తరువాత అంత ఉపన్యాసకుడు. ఆయన శాఖ నిర్ణయాన్ని సవాల్ చేస్తూ జిల్లా కమిటీకి అపీలు చేసుకున్నాడు. జిల్లా కమిటీ తరపున నాగిరెడ్డి విచారణకు వచ్చినాడు. ఆయన శాఖలో ఏమి చెప్పలేదు. తన అభిప్రాయాన్ని జిల్లా కమిటీలో చెప్పినారు. "నరసింహారెడ్డిని తీసేస్తే ఆ ఏరియా కమ్యూనిస్టు పార్టీ ఎట్ల బతుకుతుంది? సంజీవులు యాడ నిర్మిస్తాడు? ఆయన స్టేటస్ ఏమిటి?" అన్నాడు నాగిరెడ్డి. "అంటే నాగిరెడ్డీ! కార్మికవర్గం తరంగాదా విప్లవానికి? మనలాంటి భూస్వాముల బిడ్డలే తరమవుతారా? వాళ్ళే ఆకర్షణ అంటావా? వట్టి ఆకర్షణ కాదు, ఉద్యమాలు కావాలి. ప్రజలు తమంతకు తాము పోరాటాలు చేసుకోవాల" అని ఘాటుగా విమర్శించినాడు రాజశేఖరరెడ్డి.

రాజశేఖరరెడ్డి సిద్ధాంత గ్రంథాలే కాకుండా సాహిత్యం కూడా బాగా చదువుకున్నవాడు. ఆయన చదివిన నవలలు, కథలు మాకు చెప్పేవాడు. బెర్నార్డ్‌షా రచనలు, చెహోవ్ కథలు చెప్పినాడు. పరిసరాల ప్రభావం వల్ల ఒక వ్యక్తి నాయకుడవుతాడు అని చెప్పే సోమర్‌సెట్ మామ్ కథ ఆయన చెప్పిన కథ నాకు యింకా జ్ఞాపకమే. నేను పాటలు బాగా పాడుతాను, గేయాలు రాస్తాను. బాగా మెచ్చుకునేవాడు. నాకు పెద్దగా చదువురాదు. అందువల్ల నా కవిత్వంలో అవసరమైన మార్పులు చేసేవాడు. 1947లో తెనాలిలో నెలరోజుల సాహిత్య పాఠశాల నడిపింది పార్టీ. సదాశివన్, రాజశేఖరరెడ్డి నన్ను ఆ పాఠశాలకు పంపినారు. ఆ పాఠశాలకు శ్రీశ్రీ, నాజర్ వచ్చినారు. కరువు గురించి రాసిన గేయాన్ని శ్రీశ్రీకి చూపించినాను. ఆయన మెచ్చుకున్నాడు.

రాజశేఖరరెడ్డి మంచి సిద్ధాంత వేత్త. బాగా తెలిసినవాడు. బాగా చెప్పేవాడు. ఆయన ఒకసారి చెప్పినా చాలు వంటబట్టుతుంది. చదువురాని వారికి కూడా బాగా అర్థం అయేటట్లు స్వచ్ఛమైన మాటలతో చెప్పేవాడు జిల్లా పార్టీ నిర్మాణానికి సదాశివన్ పునాది. సిద్ధాంతంలో రాజశేఖర్ పునాది. "సమాజాన్ని సంపూర్తిగా మార్చకపోతే ఇది యిట్లనే వుంటుంది. దీన్ని మార్చాలి, మార్చడానికి ఒక తత్వశాస్త్రం అవసరం. అదే మార్క్సిజం" అని చెప్పేవాడు. మేము ఆయన్ను గురువుగా భావించేవారము.

సమస్యను బట్టి రాజశేఖర్ కటువుగా మాట్లాడేవాడు. వెంటనే ఆప్యాయంగా మాట్లాడేవాడు. తనది పొరపాటు అని తెలిస్తే కఠినంగా మాట్లాడడం పొరపాటు అని చెప్పేవాడు. కక్ష కార్పణ్యంలేని మనస్తత్వం వున్నవాడు రాజశేఖర్.

**సమతలేని రిత్త చదువులేల?**
**పదివేల మతములేల?**
**నూరు వ్రతము లేల?**

**- జాషువా**



# కరుణ... మెరిసే... కన్నుల్లో రాజన్న

- కొండపల్లి కోటేశ్వరమ్మ

గత దశాబ్ది జ్ఞాపకాల సాక్షిగా
సి.ఆర్.కు కుడి భుజంగా
సమతానురాగాల వేదికపై
యువకుల నుత్తేజపరుస్తూ
ఉత్సాహంగా కనిపిస్తాడు రాజన్న!
అనంతపురాన్ని గూర్చి మిత్రులు
ఆహ్లాదంగా చెపుతుంటే... విన్నాను
అంత గొప్పదా? .. అడిగాను
దాని ప్రాముఖ్యత చెప్పమన్నాను
సమ సమాజ స్థాపన కోసం
నాగీ, రాజన్న, ఐ.యస్, వీకే,లు
ఉద్యమించిన నగరం
ఇంత కన్నా ప్రాముఖ్యం ఏమి కావాలన్నారు

❖ ❖ ❖ ❖ ❖

అమీర్‌పేటలో సావిత్రమ్మిచ్చిన
సంక్రాంతి విందు సందర్భంలో
రాజశేఖరరెడ్డి మాటల్లో
వెన్నెల కురవడం చూశాను
తొలిగ అన్నా! అని పిలవాలనుకున్నాను
సంక్రాంతి సంబరాల గూర్చి
రాజన్నా, రాజేశ్వర్రావుగారూ
జంట కవుల్లా వర్ణిస్తే విన్నాను
సావిత్రమ్మ వంటకాల గూర్చి
చెప్ప మన్నాను
రాజన్న నా వంక చూస్తూ
అక్షరాల బువ్వ అమ్మలా పెడతావా?
అమృతంలా జుర్రుతూ
ఆనందంగా చెబుతామన్నారు

---

*కవితలోని కరుణ కోటేశ్వరమ్మగారి కుమార్తె. అకాల మరణం చెందిన డాక్టర్ కరుణ; సావిత్రమ్మ రాజేశ్వర్రావు గారి భార్య; లీలమ్మ రాజశేఖరరెడ్డిగారి భార్య.*

అర్థం గాక సాహిత్యాకాశాన్ని చూశాను
"అణగారిన జాలి ఆకలీ, ఆవేదనా, ఆక్రందనలు
బొట్టు, బొట్టుగ రాలి అక్షరంగా జ్వలించి
వాక్యంగా మారి, పదమై ధ్వనించి
అక్షర బువ్వగ ప్రజల నోట గానమైంది" - అంది
ఆకాశం విశ్లేషణ నాలో ఆవేశం రగిల్చింది
అక్షరాల బువ్వ వంకే ఆలోచన పెరిగింది



భర్కత్‌పూరాలో లీలమ్మ చేసిన
ఉగాది పచ్చడి అన్న ఊసలతో పెడుతూ
"మావి, వేప, చెరకు, పనసలు
ముడుపులు ముట్టవు, విధులు నిర్వహిస్తాయి
అమాత్యులు, అధికార్లు ఆ తోవ నడిస్తే
ఆంధ్ర..... నవ జీవన బృందావనం కాదా?
శ్రమైక జీవన సౌందర్యం కనిపించదా?
నవ వసంతం కుసుమించదా?
ఏరువాక సాగనంటదా?....." ప్రశ్నించాడు
క్రాంతి పల్లవిగా, జనహితం గీతంగా
సృజన, సుగుణాలు శ్రుతిలయలుగ
మేళవించి గానం చేస్తావా? చెల్లీ! అని
ఆనందం సందడించ అడిగారు
అన్నలో ఉబికిన అభ్యుదయ భావాలు
తరంగిస్తూ..... నన్నుత్తేజ పరిచాయి
నా గొంతు నుండి గానంగా వెలికి వచ్చాయి



కరుణ మరణించిందని దుఃఖించే
నా కన్నీరొత్తుతూ ఓదార్చుతూ రాజన్న
కరుణకు మరణం లేదమ్మా! అన్నారు
మరణిస్తే మానవ మనుగడ లేదన్నారు
అది పరిమళించాలనే శాంతిని కోరుతూ
మనం ఉద్యమించామని గుర్తు చేశారు
ద్రవించే గుండెల్లో స్రవించే కళ్ళల్లో
కరుణ కనిపిస్తుంది చూడమన్నారు.

అన్న ఆత్మీయతానురాగాలతో
కన్నీళ్ళు కారడం ఆగాయి
ఆయన కన్నుల్లో కరుణ కనిపించింది
బ్రతుకు వ్యర్థం చేయకన్నమాట వినిపించింది.



కొన్నాళ్ళకు రాజన్న ఇక కనిపించడని
ఏడుస్తూ వినిపించారు మిత్రులు
నేను నమ్మలేనన్నాను
కరుణ మెరిసే కన్నుల్లో కనిపిస్తూ
ఆశయాలు వినిపిస్తాడన్నాను
మన ఆశయాలపై అమావాస్య చీకటి
కమ్ముతోందని కాలం
కన్నీరు కారుస్తుంది కనమంటాను
కారణం చెప్పమంటాను
దుఃఖించకండని మిత్రులకు చెప్పాను
కన్నీరు కార్చే శక్తీ, చూసే శక్తీ
సన్నగిల్లిన వాళ్ళం, వయసు మళ్ళిన వాళ్ళం
గుండెలపై ఎర్రజెండా నావిష్కరించిన
అమరుల ఆదర్శాల నాచరిస్తామంటున్నా
ఆశ్రమాల చేరి సేద తీర్చుకుంటామని
అంజలిస్తూ అన్నతో చెప్పాలనుకున్నాను
వృద్ధాశ్రమంలో కాలెట్టాను
సి.ఆర్.కు కుడివైపుగా
పరిశోధనా కేంద్రం పలకరించింది
రెప్ప వాల్చక పరిసరాలను పరిశీలించాను.
కేంద్రానికి దన్నుగ
క్షేత్రానికి వెన్నుగ
పరిశోధనల కన్నుగ
ప్రగతి సాధకుల నేస్తంగ
ప్రజాస్వామ్య ప్రతినిధిగ
సంభ్రమాశ్చర్యాలు గొలుప
సాక్షాత్కరించాడు రాజన్న

- కొండపల్లి కోటేశ్వరమ్మ

# చరిత్రలో చోటు చేసుకున్న
# డిసెంబర్ 13

# అరుణాంజలి

- అంత్యఘడియలు
- శ్రద్ధాంజలి
- అంత్యక్రియలు
- సంతాపం

**మరణించి అమరుడైన రాజన్న**

# ఎదవాకిళ్ళను తట్టే నిండు చూపులేవి?

- ఎస్వీ



ఉత్తమ వ్యక్తిత్వం
ఉద్యమ జనగీతం
నవనీతం హృదయం
వర్షించిన 'నీలం'
కనుమూసిన అరుణారుణ తారల్లో కలిసి
కమ్యూనిస్టు యోధుల కన్నీరై ఎద కదిపినావు ॥ఉత్తమ॥
రాయలసీమను పీడిత
రణసీమగ తీర్చిదిద్ది
స్వాతంత్ర్యోద్యమ జ్వాలలు
యువతలో రగిలించినావు
విడిపోయిన తెలుగు ప్రజల వికాసాన్ని కోరి
'విశాలాంధ్ర' జనం 'గుండెనాదం'గా మలిచినావు ॥ఉత్తమ॥
శ్రమజీవుల స్వేదం
సగటు మనిషి వేదం
అంతరాలు లేని సామ్య
వాద జగతి నాదం
మార్క్స్ ఏంగిల్స్ లెనిన్ మాట బాటలపై నిలిచి
వామపక్ష సైద్ధాంతిక సారధిగా నడిపినావు ॥ఉత్తమ॥
అంచెలంచెలుగ పార్టీ
అగ్రస్థాయి కెదిగినావు
ఒడిదుడుకులు కుదిపినపుడు
ఒడుపుగా కాపాడినావు
తర్కబద్ధ ఆలోచన స్పష్టత చేకూర్చి
భారత కమ్యూనిస్టు పార్టీ బాటను చూపెట్టినావు ॥ఉత్తమ॥
నిజాయితీ నిబద్ధత
నిరాడంబరం నైజం
ఆత్మీయత అనురాగం
రూపొందిన తేజం
చిరునవ్వుల పలుకరింపు 'నీలి' నీడలేవీ?
ఎదవాకిళ్ళను తట్టే నిండు చూపులేవీ!? ॥ఉత్తమ॥

---

*రాజన్న మరణానంతరం రాసిన కవిత ("ఎలిజీ") ఇది. ఎస్వీ అన్న కలం పేరుతో రాస్తున్న డా॥ ఎస్వీ సత్యనారా యణగారు అరసం నాయకులు, లెక్చరర్.*

# కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డి కన్నుమూత

1994న డిసెంబరు 13 ఉదయం 10.30 గంటలకు ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు, స్వాతంత్ర్య సమర యోధులు కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డి ఉస్మానియా ఆసుపత్రిలో మరణించారు. అప్పటికి ఆయన వయస్సు 76 సంవత్సరాలు.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి తుదిశ్వాస విడిచినపుడు భార్య శ్రీమతి లీలావతమ్మ, నలుగురు కుమారులు శ్రీ విజయ్ కుమార్, శ్రీ రవికుమార్, శ్రీ ప్రశాంత్, శ్రీ శ్రీకాంత్‌లు ప్రక్కనే వున్నారు. మాజీ రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి రాజశేఖరరెడ్డికి స్వయాన అన్నగారు.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి భౌతికకాయాన్ని ఆసుపత్రి నుండి సి.పి.ఐ. రాష్ట్ర కార్యాలయం మఖ్దూంభవన్‌కు తరలించారు.

క్యాన్సర్‌తో బాధపడుతున్న కామ్రేడ్ రాజశేఖరరెడ్డికి జులై 14వ తేదీన బొంబాయిలోని టాటా హాస్పిటల్‌లో శస్త్ర చికిత్స జరిగింది. కోలుకుంటున్న దశలో ఇతర సమస్యలు ఎదురై యశోదా ఆసుపత్రి, ఉస్మానియా ఆసుపత్రులలో చికిత్స పొందారు. ఆయన ఆరోగ్య పరిస్థితి రోజురోజుకూ క్షీణించింది.

12 సాయంత్రం సి.పి.ఐ. ప్రధాన కార్యదర్శి శ్రీ ఇంద్రజిత్ గుప్తా, రాష్ట్ర కార్యదర్శి శ్రీ దాసరి నాగభూషణరావు, లెజిస్లేచర్ పార్టీ నాయకులు శ్రీ పువ్వాడ నాగేశ్వరరావు ఆసుపత్రికి వెళ్లినపుడు, మాటలు స్పష్టంగా లేనప్పటికి కామ్రేడ్ రాజశేఖరరెడ్డి వారిని గుర్తించి మాట్లాడారు. శాసనసభ ఎన్నికల్లో పార్టీ 19 స్థానాల్లో విజయం సాధించినందుకు అభినందనలు తెలిపారు. శ్రీ ఇంద్రజిత్ గుప్తా తాను ఇపుడు తిరిగి ఢిల్లీ వెళ్ళిపోతున్నానని చెప్పినపుడు ఆయనకు 'షేక్ హ్యాండ్' ఇచ్చారు. వారితోపాటు శ్రీ రాజశేఖరరెడ్డిని ఎరిగిన వివిధ జిల్లాలకు చెందిన పలువురు పార్టీ కామ్రేడ్స్ ఒకేసారి గదిలోకి వెళ్ళగానే "ఏమిటి ఇంతమంది ఒకేసారి వచ్చారు?" అని ప్రశ్నించారు. శ్రీ ఎన్.టి. రామారావు ముఖ్యమంత్రిగా నూతన మంత్రిమండలి ప్రమాణ స్వీకారం చేసిన సందర్భంగా వచ్చిన కామ్రేడ్స్ మిమ్మల్ని కూడా చూడాలని వచ్చారని తెలియ చేయడంతో ఏదో చెప్పడానికి ప్రయత్నించారు, కానీ స్పష్టత లేదు.

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి ఆరోగ్య పరిస్థితి ఆందోళనకరంగా వుందని ఉదయం మఖ్దూంభవన్‌కు సమాచారం అందగానే రాష్ట్ర పార్టీ నాయకత్వం ఆసుపత్రికి చేరుకుంది. ఆసుపత్రి చేరుకున్న వారిలో శ్రీ దాసరి నాగభూషణ రావు, శ్రీ ఎస్. సుధాకర్‌రెడ్డి, శ్రీవై.వి.కృష్ణారావు, శ్రీ జి. యల్లమందారెడ్డి, శ్రీ సి.హెచ్. రాజేశ్వరరావు, శ్రీ వల్లూరి గంగాధర రావు, శ్రీ పొట్లూరి నాగేశ్వరరావు, శ్రీ పి. శ్రీనివాసులు నాయుడు, శ్రీ కె. నారాయణ, శ్రీ కె.ప్రతాప్‌రెడ్డి, శ్రీ ఎ.పుల్లారెడ్డి, శ్రీ లక్ష్మీ నారాయణ, శ్రీ కె.రామకృష్ణ

---

*విశాలాంధ్ర 1994 డిసెంబరు 14,15 సంచికల్లోని వార్తల సంక్షిప్తము.*

(ఎం.ఎల్.ఎ), శ్రీ విశ్వేశ్వరరెడ్డి, శ్రీ రంగన్న, శ్రీ చంద్ర ఆజాద్, ఆసుపత్రి సూపరింటెండెంట్ డా॥ సత్యనారాయణ, డాక్టర్ కుమార్ ప్రభృతులున్నారు.

**అరుణ పతాకం అవనతం :**

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి మృతి వార్త తెలియగానే సంతాప సూచకంగా ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు సమితి కార్యాలయం మఖ్దూంభవన్‌పై అరుణ పతాకాన్ని అవనతం చేశారు

మఖ్దూం భవన్‌లో ప్రజల సందర్శనార్థం వుంచిన కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డి భౌతిక కాయంపై పుష్పగుచ్ఛాలుంచి నివాళులర్పించిన వారిలో పార్టీ కేంద్ర నాయకులు శ్రీ ఎన్. గిరిప్రసాద్ (ఎం.పి)తో పాటు పలువురు పార్టీ నాయకులు, కార్యకర్తలు, వివిధ వర్గాలకు చెందిన ప్రముఖులు, వివిధ పార్టీల నాయకులు శ్రీ రాజశేఖరరెడ్డి భౌతికకాయంపై పుష్పగుచ్ఛాలు వుంచి శ్రద్ధాంజలి ఘటించారు. సి.పి.ఐ. రాష్ట్ర కార్యదర్శి శ్రీ దాసరి నాగభూషణరావు, సహాయకార్యదర్శి శ్రీ ఎస్. సుధాకర్‌రెడ్డి, అఖిల భారత వ్యవసాయ కార్మిక సమాఖ్య అధ్యక్షులు శ్రీ గుజ్జుల యల్లమందారెడ్డి, అఖిల భారత కిసాన్ సభ ప్రధాన కార్యదర్శి శ్రీ వై.వి. కృష్ణారావు, ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కార్మిక సంఘం అధ్యక్షులు శ్రీ భూపతి నర్సయ్య, ఎ.ఐ.టి.యు.సి. రాష్ట్రశాఖ అధ్యక్షులు శ్రీ వై. విజయ కుమార్, ప్రధాన కార్యదర్శి శ్రీ పొట్లూరి నాగేశ్వరరావు, కార్యదర్శి శ్రీ పి.జె. చంద్రశేఖర్, ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య అధ్యక్షులు చంద్ర రాజకుమారి, ప్రధాన కార్యదర్శి శ్రీమతి పశ్యపద్మ, భారత వర్కింగ్ జర్నలిస్టుల యూనియన్ ప్రధాన కార్యదర్శి శ్రీ కె. శ్రీనివాసరెడ్డి మొదలగువారు కూడా శ్రద్ధాంజలి ఘటించారు.

రాష్ట్ర మంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు, తెలుగుదేశం సమాలోచనా మండలి సభ్యులు, ఎం.ఎల్.ఎ. శ్రీ ఎ. మాధవరెడ్డి, ఆ పార్టీ పార్లమెంట్ మాజీ సభ్యులు శ్రీయలమంచిలి శివాజీ, టి.డి.పి. నాయకులు శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి, శ్రీ ఎం. సోమిరెడ్డి, రాష్ట్ర అధికార భాషా సంఘం అధ్యక్షులు శ్రీ గజ్జెల మల్లారెడ్డి, సినీ దర్శకులు శ్రీ వి. మధుసూదనరావు, శాంతి ఉద్యమ నాయకులు శ్రీ వేములపల్లి శ్రీకృష్ణ, స్వాతంత్ర్య సమరయోధులు శ్రీమతి ఆరుట్ల కమలాదేవి మున్నగువారు పుష్పగుచ్ఛాలుంచి శ్రద్ధాంజలి ఘటించారు.

ఆంధ్రప్రదేశ్ విద్యుత్ బోర్డు అధ్యక్షులు శ్రీ కె. బలరాంరెడ్డి, న్యాయమూర్తి శ్రీ గంగాధరరావు, మాజీ మంత్రి శ్రీమూర్తిరాజుగార్లు పుష్పగుచ్ఛాలుంచి శ్రద్ధాంజలి ఘటించారు.

సి.పి.ఎం. నాయకులు శ్రీ రాఘవులు, సి.ఐ.టి.యు. నాయకులు శ్రీ వి. శ్రీహరి, ఎం.సి.పి.ఐ. నాయకులు శ్రీ ఎం. ఓంకార్, ప్రముఖ పాత్రికేయులు శ్రీ నరసింహం, శ్రీ పి.ఆర్. రెడ్డి, స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ ఎన్.బి. శ్రీహరి, ట్రేడ్ యూనియన్ నాయకులు శ్రీ వి.ఎస్. బోస్, శ్రీ శాస్త్రిలు కూడా పుష్పగుచ్ఛాలుంచి నివాళులర్పించినారు.

# కామ్రేడ్ రాజశేఖరరెడ్డికి సంజీవరెడ్డి, ఎన్.టి.ఆర్. ప్రభృతుల శ్రద్ధాంజలి

హైదరాబాద్, డిసెంబర్ 14 రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావు నేటి ఉదయం సి.పి.ఐ. రాష్ట్ర కార్యాలయం మఖ్దూంభవన్‌కు విచ్చేసి నీలం రాజశేఖరరెడ్డి భౌతిక కాయంపై పుష్పగుచ్ఛాలుంచి శ్రద్ధాంజలి ఘటించారు.

అనంతరం శ్రీ రామారావు, శ్రీ రాజశేఖరరెడ్డి కుటుంబ సభ్యులను ఓదార్చి ధైర్యం చెప్పారు. ముఖ్యమంత్రి వెంట ఆయన అల్లుడు, మంత్రి శ్రీ ఎన్. చంద్రబాబు నాయుడు కూడా వున్నారు.

తన సోదరుని మరణవార్త తెలియగానే మంగళవారం రాత్రి నగరానికి చేరుకుని మఖ్దూంభవన్‌కు వచ్చి వెళ్ళిన మాజీ రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి నేటి ఉదయం కూడా మఖ్దూంభవన్‌కు వచ్చి చివరిసారిగా శ్రీ రాజశేఖరరెడ్డి భౌతిక కాయంపై పుష్పగుచ్ఛాలుంచి తిరిగి నేరుగా విమానాశ్రయానికి వెళ్ళి అక్కడి నుండి బెంగుళూరు వెళ్ళారు.

ఇదిలా వుండగా, శ్రీ రాజశేఖరరెడ్డి అంతిమ దర్శనం కోసం నేటి ఉదయం నుండి వివిధ వర్గాల ప్రజలు, పార్టీల నాయకులు తండోప తండాలుగా మఖ్దూంభవన్‌కు చేరుకున్నారు.

శ్రీ రాజశేఖరరెడ్డికి శ్రద్ధాంజలి ఘటించిన వారిలో సి.పి.ఐ. కేంద్ర నాయకులు, పార్లమెంటు సభ్యులు శ్రీమతి గీతా ముఖర్జీ, శ్రీ ఎన్. గిరిప్రసాద్, అఖిల భారత రైతుసంఘం అధ్యక్షులు శ్రీ వై.వి. కృష్ణారావు, అఖిలభారత వ్యవసాయ కార్మిక సంఘం అధ్యక్షులు శ్రీ జి. యల్లమందారెడ్డి, సి.పి.ఐ. రాష్ట్ర కార్యదర్శి శ్రీ దాసరి నాగభూషణరావు, పార్టీ కార్యవర్గం సభ్యులు, వివిధ జిల్లాల కార్యదర్శులు, నగర పార్టీ కార్యదర్శి శ్రీ ఎ. పుల్లారెడ్డి వున్నారు.

ఎ.ఐ.టి.యు.సి. రాష్ట్ర సమితి తరపున అధ్యక్షులు శ్రీ వై. విజయకుమార్, యువజన సమాఖ్య తరపున ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్. వెంకటేశ్వరరావు, విద్యార్థి సమాఖ్య కార్యదర్శి శ్రీ ఎన్. బాలమల్లేష్, మహిళా సమాఖ్య కార్యదర్శి శ్రీమతి ప్రేమ పావని, రాష్ట్ర వైద్య ఉద్యోగుల సంఘం అధ్యక్షులు శ్రీ జి. రాంచందర్, సింగరేణి కార్మిక సంఘం నాయకులు శ్రీ కొమరయ్య, హెచ్.సి.ఎల్. కార్మిక సంఘం నాయకులు శ్రీ సాంబశివరావు, శ్రీ బాలిశెట్టి, ఆంధ్రాబ్యాంక్ ఉద్యోగుల సమాఖ్య నాయకులు శ్రీ సాంబశివరావు కూడా శ్రీ రాజశేఖరరెడ్డికి కడసారిగా శ్రద్ధాంజలి ఘటించిన వారిలో వున్నారు.

సి.పి.ఐ. శాసనసభ్యులు శ్రీ సి.హెచ్. రాజేశ్వరరావు, శ్రీ పువ్వాడ నాగేశ్వరరావు, శ్రీ కె. రామకృష్ణ, శ్రీ పి. సారయ్యలతో పాటు తెలుగుదేశం శాసనసభ్యులు శ్రీ టి దేవేందర్‌గౌడ్, శ్రీ ఎ. మోహన్, పార్టీ నాయకులు శ్రీ విజయమోహనరెడ్డి, శ్రీ సుఖేందర్ రెడ్డి, కాంగ్రెస్(ఐ) పార్టీ శాసనసభ్యులు శ్రీ ఎం. కోదండరెడ్డి, పార్టీ నాయకురాలు శ్రీమతి సరోజినీ పుల్లారెడ్డి, రాష్ట్ర పౌరహక్కుల సంఘం అధ్యక్షులు శ్రీ ఎం.టి. ఖాన్, శ్రీ కన్నాభిరాన్, మాజీ ప్రధాన న్యాయమూర్తి శ్రీ చల్లా కొండయ్య, న్యాయమూర్తి శ్రీ రంగారెడ్డి, సి.పి.ఎం. నాయకులు శ్రీ కె కృష్ణమూర్తి, శ్రీ రఘుపాల్, రాష్ట్ర చలనచిత్ర అభివృద్ధి సంస్థ అధ్యక్షులు శ్రీ ఎం.ఎస్. రెడ్డిలు కూడా శ్రద్ధాంజలి ఘటించిన వారిలో వున్నారు.

అనంతపురం జిల్లా సి.పి.ఐ. నాయకులు, స్వాతంత్ర్య సమరయోధులు శ్రీ వి.కె. ఆదినారాయణరెడ్డి, చేనేత కార్మిక సంఘం నాయకులు శ్రీ చెలివేరు మాణిక్యరావు, డా॥ సి.ఆర్. రాజగోపాల్, డా॥ సి ఎల్.రాయుడు, శ్రీ రావూరి భరద్వాజ్, శ్రీమతి రాజ్యం సిన్హా డా॥ శ్యామల, ఈనాడు సంపాదకులు శ్రీ సి.హెచ్. రామోజీరావు, సినీనటులు శ్రీ మాదాల రంగారావులతో పాటు ఇంకా అనేక మంది ప్రముఖులు, కార్మికులు, ఉద్యోగులు, యువజనులు, విద్యార్థులు, మహిళలు నేటి ఉదయం నుండి శ్రీ రాజశేఖరరెడ్డికి శ్రద్ధాంజలి ఘటించిన వారిలో వున్నారు.

శ్రీ రాజశేఖరరెడ్డి కుటుంబసభ్యులు, అనంతరం సి.పి.ఐ. రాష్ట్ర సహాయ కార్యదర్శి శ్రీ ఎన్. సుధాకరరెడ్డి, తర్వాత చివరగా పార్టీ రాష్ట్ర కార్యదర్శి శ్రీ దాసరి నాగభూషణరావు శ్రీ రాజశేఖరరెడ్డి భౌతిక కాయంపై పార్టీ జండాను కప్పి శ్రద్ధాంజలి ఘటించిన తర్వాత అంతిమయాత్ర మఖ్దూం భవన్ నుండి బయలుదేరింది.

# కామ్రేడ్ రాజశేఖరరెడ్డి అంత్యక్రియలు

డిసెంబర్ 13 ఉదయం మృతి చెందిన ప్రముఖ కమ్యూనిస్టు యోధుడు కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డి భౌతిక కాయానికి 14 మధ్యాహ్నం పంజాగుట్ట శ్మశాన వాటికలో అంత్యక్రియలు జరిగాయి.

ప్రజలు సందర్శనార్థం మఖ్దూంభవన్‌లో వుంచిన కామ్రేడ్ రాజశేఖరరెడ్డి భౌతిక కాయాన్ని నేటి ఉదయం ఊరేగింపుగా పంజాగుట్ట శ్మశాన వాటికకు తీసుకువచ్చారు. శ్రీ రాజశేఖరరెడ్డి చితికి ఆయన కుమారుడు డాక్టర్ విజయకుమార్ మధ్యాహ్నం 12 గంటలకు నిప్పంటించారు. అరుణపతాకాలు, నల్లజెండాలు చేతపట్టి ఆయన అంతిమ యాత్రలో పాల్గొన్న సి.పి.ఐ. కార్యకర్తలు నీలం రాజశేఖరరెడ్డి అమర్‌రహే, రెడ్ సెల్యూట్ టు కామ్రేడ్ రాజశేఖరరెడ్డి, రాజశేఖరరెడ్డికి జోహార్లు అని నినదిస్తుండగా చితి మంటలలో ఆయన దేహం అనంత వాయువుల్లో కలిసిపోయింది.

సి.పి.ఐ. పార్లమెంట్ సభ్యులు శ్రీమతి గీతా ముఖర్జీ, శ్రీ ఎన్. గిరిప్రసాద్, రాష్ట్ర కమ్యూనిస్టు సమితి కార్యదర్శి శ్రీ దాసరి నాగభూషణరావు, సహాయ కార్యదర్శి శ్రీ సురవరం సుధాకరరెడ్డి, వివిధ జిల్లాల కమ్యూనిస్టు సమితి కార్యదర్శులు, సి.పి.ఐ. శాసనసభ్యులు, సి.పి.ఐ. నాయకులు, ప్రజాసంఘాల కార్యకర్తలు, టి.డి.పి. కార్యదర్శి శ్రీ ఎన్. రామచంద్రారెడ్డి, జనతాదళ్ రాష్ట్ర శాఖ అధ్యక్షులు శ్రీ వన్నాల శ్రీరాములు, కాంగ్రెస్ శాసనసభ్యులు శ్రీ ఎం. కోదండరెడ్డి, మాజీ మంత్రి శ్రీ పి. రామచంద్రారెడ్డి తదితర ప్రముఖులు అంతిమయాత్రలో పాల్గొన్నారు.

శ్రీ రాజశేఖరరెడ్డి భౌతిక కాయానికి ఆయన కుమారుడు చితికి నిప్పంటించే చివరి క్షణంలో రాష్ట్ర గవర్నర్ శ్రీ కృష్ణకాంత్ శ్మశాన వాటికకు చేరుకొని చితిపై పుష్పగుచ్ఛాలుంచి శ్రద్ధాంజలి ఘటించారు. అనంతరం గవర్నర్, శ్రీ రాజశేఖరరెడ్డి సతీమణిని ఓదార్చి సంతాప సభలో పాల్గొన్నారు.

అంతకు ముందు సి.పి.ఐ. రాష్ట్ర కార్యాలయం మఖ్దూంభవన్ నుండి ప్రత్యేకంగా అమర్చిన వాహనంలో శ్రీ రాజశేఖరరెడ్డి భౌతిక కాయాన్ని ఊరేగింపుగా శ్మశాన వాటికకు తీసుకువచ్చారు. సి.పి.ఐ. జాతీయ నాయకులు శ్రీమతి గీతాముఖర్జీ, శ్రీ రాజబహదూర్‌గౌర్, శ్రీ వై.వి. కృష్ణారావు, సి.పి.ఐ. రాష్ట్ర కార్యదర్శి శ్రీ దాసరి నాగభూషణరావు, పార్టీ రాష్ట్ర కార్యవర్గ సభ్యులు శ్రీ వి.కె. ఆదినారాయణరెడ్డి, సి.పి.ఐ. అగ్రనాయకులు శ్రీ చండ్ర రాజేశ్వరరావు కుమారుడు శ్రీ చండ్ర ఆజాద్‌తో పాటు శ్రీ

నీలం రాజశేఖరరెడ్డి నలుగురు కుమారులు శ్రీ విజయకుమార్, శ్రీ రవికుమార్, శ్రీ ప్రశాంత్, శ్రీ శ్రీకాంత్‌లు ఆ వాహనంలో వున్నారు.

యువజన సమాఖ్య రాష్ట్ర ప్రధాన కార్యదర్శి శ్రీ ఎన్. వెంకటేశ్వర్లు, విద్యార్థి సమాఖ్య జాతీయ కార్యదర్శి శ్రీ రామాంజనేయులు కూడా వాహనంలో వున్నారు

శ్రీ నీలం రాజశేఖరరెడ్డి అమర్ రహే, రాజశేఖరరెడ్డికి లాల్‌సలాం అనే నినాదాలు చేస్తూ అనేక మంది అంతిమయాత్రలో పాల్గొన్నారు.

అంతిమయాత్ర ముందు నల్లజండాలతో, నల్ల బ్యాడ్జీలు ధరించిన ప్రదర్శకులు ద్విచక్ర వాహనాలపై ఊరేగింపుగా నినాదాలు చేస్తూ ఊరేగింపులో పాల్గొన్నారు. యాత్ర ఓల్డ్ ఎం.ఎల్.ఎ. క్వార్టర్స్, బషీర్‌బాగ్, ఖైరతాబాద్‌ల మీదుగా పంజాగుట్ట శ్మశానవాటికకు చేరుకుంది.

# సి.పి.ఐ. జాతీయ కార్యవర్గం సంతాపం

సి.పి.ఐ. ప్రముఖ నాయకులు శ్రీ నీలం రాజశేఖరరెడ్డి మృతిపట్ల భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ కార్యవర్గం తీవ్ర దిగ్భ్రాంతిని వ్యక్తం చేసింది. ఆంధ్రప్రదేశ్‌లో పార్టీ నిర్మాణంలో ఆయన చెప్పుకోతగ్గ పాత్రను నిర్వర్తించారని పేర్కొంది.

పై మేరకు ఇక్కడ విడుదల చేసిన ఒక ప్రకటనలో సి.పి.ఐ. జాతీయ కార్యవర్గం శ్రీ రాజశేఖరరెడ్డి 50 సంవత్సరాలకు పైగా దేశ కమ్యూనిస్టు ఉద్యమానికి తన సేవలను అందించారని కొనియాడింది. తెలంగాణా ఉద్యమం, ఇతర ప్రజా ఉద్యమాల్లో ఆయన పాల్గొన్నారని పేర్కొంది.

శ్రీ రాజశేఖరరెడ్డి మరణం దేశంలోని వామపక్షాలు, ప్రజాస్వామ్య శక్తులకు తీరని లోటని పేర్కొంది. భారత కమ్యూనిస్టు ఉద్యమానికి ఆయన మృతి భర్తీ చేయలేని లోటనీ ఆ ప్రకటనలో తెలిపింది.

# సి.పి.ఐ. రాష్ట్ర సమితి సంతాపం

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి మృతికి సి.పి.ఐ. రాష్ట్ర సమితి తీవ్ర విచారం వ్యక్తం చేసింది. ఆయన భార్య శ్రీమతి లీలావతి, కుమారులు, సోదరులు, యితర కుటుంబ సభ్యులకు, హృదయ పూర్వక సంతాపాన్ని తెలియజేసింది

పార్టీ రాష్ట్ర కార్యదర్శిగా దశాబ్దంపాటు పనిచేసిన శ్రీ రాజశేఖరరెడ్డి, పార్టీ అభివృద్ధికి ఎంతో కృషి చేశారు. పార్టీ కేంద్ర నాయకునిగా, పార్టీ విద్యా విభాగం బాధ్యులుగా రెండు దశాబ్దాలు పనిచేసిన శ్రీ రాజశేఖరరెడ్డి పార్టీ విద్యా కార్యక్రమాన్ని గొప్ప ఉద్యమంగా తీర్చిదిద్ది అనేక వేలమంది యువ కమ్యూనిస్టు కార్యకర్తలను తయారు చేశారని సమితి నేడిక్కడ ఒక ప్రకటనలో పేర్కొంది

పార్టీ సిద్ధాంతవేత్తగా, దేశ వ్యాపితంగా కమ్యూనిస్టు కార్యకర్తలకు పటిష్టమైన, శాస్త్రీయమైన మార్క్సిస్టు సైద్ధాంతిక ప్రాతిపదికను సమకూర్చారు. పార్టీ సిద్ధాంతాల అధ్యయనానికి అన్ని సదుపాయాలు కలిగి వున్న కేంద్ర పాఠశాల భవన నిర్మాణంలో ఆయన కీలక పాత్ర వహించారని ఈ ప్రకటన పేర్కొంది.

పార్టీలో యువతరాన్ని ప్రోత్సహించడానికి ఆయన తన జీవితాంతం కృషి చేశారని పేర్కొంది. ఆయన నిబద్ధత కలిగిన కమ్యూనిస్టు. కమ్యూనిస్టు ఉద్యమ సేవకు ఆయన జీవితాన్ని అంకితం చేశారని రాష్ట్ర సమితి తెలిపింది.

తమ ప్రియతమ నాయకునిపట్ల గౌరవ సూచకంగా పార్టీ రాష్ట్ర కార్యాలయం మఖ్దూంభవన్‌లో అరుణపతాకాన్ని అవనతం చేశారు.

# కామ్రేడ్ రాజశేఖర్ మృతిపట్ల కేరళ, కర్నాటక సి.పి.ఐ. సమితుల సంతాపం

ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు, స్వాతంత్ర్య సమరయోధులు కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డి మరణంపట్ల కేరళ, కర్నాటక రాష్ట్రాల కమ్యూనిస్టు సమితులు తీవ్ర దిగ్భ్రాంతిని, విచారాన్ని వ్యక్తం చేశాయి. ఆయన భార్య శ్రీమతి లీలావతి, కుమారులు, సోదరులు, యితర కుటుంబ సభ్యులకు సంతాపాన్ని తెలియజేశాయి. శ్రీ రాజశేఖరరెడ్డి మరణం కమ్యూనిస్టు ఉద్యమానికి తీరని లోటని కేరళ సి.పి.ఐ. రాష్ట్ర సమితి కార్యదర్శి శ్రీ పి.కె. వాసుదేవన్ నాయర్ అన్నారు. కమ్యూనిస్టు ఉద్యమం ఒక గొప్ప నాయకుడిని కోల్పోయిందని కర్నాటక కమ్యూనిస్టు సమితి నాయకులు శ్రీ ఎం. వెంకట్రాము, శ్రీ ఎం.ఎస్. కృష్ణన్ పంపిన సంతాప సందేశంలో పేర్కొన్నారు.

బి.కె.ఎం.యు. ప్రధాన కార్యదర్శి శ్రీ పి.కె. కొడియన్ శ్రీ రాజశేఖరరెడ్డి మరణం పట్ల ప్రగాఢ సంతాపాన్ని, హృదయపూర్వక సానుభూతిని వ్యక్తం చేస్తూ సంతాప సందేశం పంపించారు. కమ్యూనిస్టు ఉద్యమం మరో ధ్రువతారను కోల్పోయిందని ఆయన పేర్కొన్నారు.

# రాజశేఖరరెడ్డి మృతికి ప్రధాని ప్రభృతుల సంతాపం

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, సి.పి.ఐ. నాయకులు శ్రీ నీలం రాజశేఖరరెడ్డి మృతి పట్ల ప్రధానమంత్రి శ్రీ పి.వి. నరసింహారావు సంతాపాన్ని వ్యక్తం చేశారు.

స్వాతంత్ర్య ఉద్యమానికి శ్రీ రాజశేఖరరెడ్డి చేసిన సేవలను సమాజంలోని పేద, బలహీన వర్గాల అభ్యున్నతికి చేసిన కృషిని శ్రీ పి.వి. నరసింహారావు ప్రస్తుతించారు.

**ఎన్.టి.ఆర్. సంతాపం :**

ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు శ్రీ నీలం రాజశేఖరరెడ్డి మృతివల్ల దేశం ఒక స్వాతంత్ర్య సమరయోధుడ్ని, బలహీన వర్గాల నాయకుడ్ని కోల్పోయిందని ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి. రామారావు తన సంతాప సందేశంలో పేర్కొన్నారు. శ్రీ రాజశేఖరరెడ్డి నమ్మిన సిద్ధాంతాల కోసం అవిశ్రాంత పోరాటం చేశారని, ప్రజా సమస్యలపై ఎన్నడూ రాజీ పడలేదని, ఆయన ఎన్నడూ పదవుల కోసం ప్రాకులాడలేదని అన్నారు.

**విజయభాస్కరరెడ్డి సంతాపం :**

శ్రీ రాజశేఖరరెడ్డి ఆకస్మిక మృతిపట్ల మాజీ ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి తీవ్ర దిగ్భ్రాంతిని వ్యక్తం చేశారు.

భారతదేశ కమ్యూనిస్టు ఉద్యమానికి ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ్‌లో శ్రీ రాజశేఖరరెడ్డి చేసిన సేవలు చిరస్మరణీయమని శ్రీ విజయభాస్కరరెడ్డి నేడిక్కడ విడుదల చేసిన పత్రికా ప్రకటనలో పేర్కొన్నారు.

పేద ప్రజలకు నిస్వార్థ సేవలు అందించిన శ్రీ రాజశేఖరరెడ్డి ఎన్నడూ అధికారాన్ని ఆశించలేదని, ఆయన మృతివల్ల తానొక వ్యక్తిగత స్నేహితుడినేగాక, గొప్ప నాయకుడిని కోల్పోయానని తెలిపారు. శ్రీ రాజశేఖరరెడ్డి కుటుంబ సభ్యులకు ఆయన ప్రగాఢ సానుభూతిని తెలిపారు.

**విజయవాడ నగర సి.పి.ఐ. సంతాపం :**

కామ్రేడ్ రాజశేఖరరెడ్డి మరణం పట్ల విజయవాడ నగర కమ్యూనిస్టు సమితి నేడొక ప్రకటనలో తీవ్ర సంతాపం వ్యక్తం చేసింది. వారి కుటుంబ సభ్యులకు ప్రగాఢ సానుభూతిని వ్యక్తం చేసింది.

**ఇంద్రజిత్ గుప్తా ప్రభృతుల సంతాపం :**

ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు, స్వాతంత్ర్య సమరయోధులు కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డి మృతిపట్ల సి.పి.ఐ. జాతీయ కార్యదర్శి శ్రీ ఇంద్రజిత్ గుప్తా దిగ్భ్రాంతిని, తీవ్ర విచారాన్ని వ్యక్తం చేశారు. పార్టీరాష్ట్ర కార్యదర్శి శ్రీ దాసరి నాగభూషణరావుకు

పంపిన ఒక సందేశంలో శ్రీ రాజశేఖరరెడ్డి మృతికి సంతాపం ప్రకటించారు. శ్రీ గుప్తా పంపిన టెలిగ్రాం పూర్తి పాఠం ఈ క్రింది విధంగా వుంది:

మన ప్రియతమ నాయకుని మరణవార్త విని తీవ్ర దిగ్భ్రాంతికి లోనయ్యాను. శ్రీ రాజశేఖర్ ఇటు దేశం మొత్తం, అటు ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు ఉద్యమంలోను ఆయన అత్యంత సీనియర్, రాజశేఖర్ మృతి భారతదేశ వామపక్ష, లౌకిక, ప్రజాతంత్ర శక్తులకు తీరని లోటు. విచారంలో మునిగి వున్న ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు కార్యకర్తలకు రాజశేఖర్ కుటుంబ సభ్యులకు భారత కమ్యూనిస్టు పార్టీ జాతీయ సమితి తరపున, అజయ్ భవన్‌లో పనిచేస్తున్న కార్యకర్తల తరపున, నా తరపున ప్రగాఢ సంతాపాన్ని తెలియ చేస్తున్నాను.

### నల్లకన్ను సంతాపం :

నల్లకన్ను, శ్రీ రాజశేఖరరెడ్డి మృతికి హృదయపూర్వక సంతాపాన్ని వ్యక్తం చేశారు. పార్టీ తమిళనాడు రాష్ట్ర సమితి తరపున శ్రీ రాజశేఖరరెడ్డికి నివాళులర్పించారు.

### తారారెడ్డి విచారం :

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలలో ఒకరైన శ్రీ రాజశేఖరరెడ్డి మృతికి భారత జాతీయ మహిళా సమాఖ్య అధ్యక్షురాలు శ్రీమతి తారారెడ్డి తీవ్రవిచారం వ్యక్తం చేశారు. కుటుంబ సభ్యులకు  సానుభూతి తెలిపారు.

### గవర్నరు సంతాపం :

రాష్ట్ర గవర్నర్ శ్రీ కృష్ణకాంత్, కామ్రేడ్ రాజశేఖర్‌రెడ్డి భౌతిక కాయంపై పుష్ప గుచ్ఛాలుంచి శ్రద్ధాంజలి ఘటించారు. శ్రీ రెడ్డి సతీమణి శ్రీమతి లీలను, ఆయన కుమారులను పరామర్శించి సానుభూతిని వ్యక్తం చేశారు.

### రఘునాథరెడ్డి సంతాపం :

ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు శ్రీ నీలం రాజశేఖరరెడ్డి మరణం పట్ల పశ్చిమ బెంగాల్ గవర్నర్ శ్రీ కె.వి. రఘునాథరెడ్డి తీవ్ర దిగ్భ్రాంతిని, ప్రగాఢ సంతాపాన్ని తెలియజేశారు.

శ్రీ రాజశేఖరరెడ్డి మరణంలో మరో ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుణ్ణి కోల్పోయామని శ్రీ రఘునాథరెడ్డి ఒక సంతాప సందేశంలో పేర్కొన్నారు. ప్రగతిశీల, ప్రజాస్వామ్య సమస్యలపైన పోరాడే ఒక గొప్ప కమ్యూనిస్టును మనం కోల్పోయామని ఆయన అన్నారు.

# పలువురి సంతాపం

ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డి మరణం పట్ల అఖిలభారత కిసాన్ సభ అధ్యక్షులు శ్రీ వై.వి. కృష్ణారావు, అఖిల భారత వ్యవసాయ కార్మిక సంఘం అధ్యక్షులు శ్రీ గుజ్జుల యల్లమందారెడ్డి, ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కార్మిక సంఘం అధ్యక్షులు శ్రీ భూపతి వెంకటనర్సయ్య, భారత జాతీయ మహిళా సమాఖ్య కార్యదర్శి శ్రీమతి జి. సరళాదేవి, ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య అధ్యక్షురాలు చంద్ర రాజకుమారి, ప్రధాన కార్యదర్శులు శ్రీమతి పశ్య పద్మ, శ్రీమతి ప్రేమపావని, శ్రీమతి కె. అరుణ తీవ్ర దిగ్భ్రాంతిని, ప్రగాఢ సంతాపాన్ని, ఆయన కుటుంబ సభ్యులకు హృదయపూర్వక సానుభూతిని వ్యక్తం చేశారు.

సాంఘిక న్యాయం, పేద వర్గాల అభ్యున్నతి, సోషలిస్టు సమాజం ఏర్పడటానికి కామ్రేడ్ రాజశేఖరరెడ్డి జీవితాన్ని అంకితం చేశారని శ్రీ వై.వి. కృష్ణారావు తన సంతాప సందేశంలో పేర్కొన్నారు. కామ్రేడ్ రాజశేఖరరెడ్డితో తాను కలిసి పనిచేసిన రోజులను ఆయన ఈ సందర్భంగా గుర్తుచేశారు.

త్యాగ నిరతి, ఉద్యమస్ఫూర్తికి నిదర్శన మైన కామ్రేడ్ రాజశేఖరరెడ్డి మరణం కమ్యూనిస్టు పార్టీ సాగిస్తున్న ఉద్యమాలకు తీరని లోటని శ్రీ గుజ్జుల యల్లమందారెడ్డి జోహార్లు అర్పించారు. పేద వర్గాలకోసం జీవితాన్ని అంకితం చేశారని, నూతన సోషలిస్టు వ్యవస్థ ఏర్పడాలని అహర్నిశలూ కృషిచేశారని శ్రీ యల్లమందారెడ్డి తన సంతాప ప్రకటనలో తెలిపారు.

సంపన్న కుటుంబంలో పుట్టి బడుగు వర్గాల అభ్యున్నతికి జీవితమంతా ధారపోసిన కామ్రేడ్ రాజశేఖరరెడ్డి మరణం బడుగువర్గాలకు తీరని లోటని శ్రీ భూపతి వెంకటనర్సయ్య విడుదల చేసిన సంతాప ప్రకటనలో పేర్కొన్నారు.

ప్రజా ఉద్యమాలకు స్ఫూర్తిదాయకంగా నిలిచిన కామ్రేడ్ రాజశేఖరరెడ్డి మరణం ఉద్యమస్ఫూర్తికి తీరని లోటని మహిళా సమాఖ్య నాయకులు సంతాపం వ్యక్తం చేశారు.

# ఖమ్మం సంతాపసభలో ఘనమైన నివాళులు

కమ్యూనిస్టు ఉద్యమ అవిశ్రాంత పోరాట సేనాని అమరజీవి శ్రీ నీలం రాజశేఖరరెడ్డి అని సి.పి.ఐ. ఖమ్మం జిల్లా సమితి ఆధ్వర్యంలో నిర్వహించిన సంతాపసభ ఘనంగా జోహార్లర్పించింది.

నేడు హైదరాబాద్ నుంచి శ్రీ రాజశేఖరరెడ్డి మరణం విషాదవార్త తెలియగానే జిల్లా సి.పి.ఐ. కార్యాలయంలో సుజాతనగర్ శాసన సభ్యులు శ్రీ మహ్మద్ రజబ్ ఆలీ అధ్యక్షతన సంతాపసభ జరిగింది. జిల్లా సి.పి.ఐ. కార్యవర్గ సభ్యులు శ్రీ గంగవరపు విజయకుమార్ నాయకులు శ్రీ చిర్రావూరి లక్ష్మీనర్సయ్య, శ్రీ మంచికంటి రాంకిషన్‌రావు, జిల్లా సి.పి.ఐ. కార్యవర్గ సభ్యులు శ్రీ వెంపటి సూర్యనారాయణ, శ్రీ మేకల సంగయ్య, శ్రీ గంగవరపు విజయకుమార్ తదితరులు సంతాపసభలో ప్రసంగించారు.

**అరుణపతాకం అవనతం :**

శ్రీ నీలం రాజశేఖరరెడ్డి మరణవార్త తెలియగానే సంతాపసూచకంగా ఖమ్మం జిల్లా సి.పి.ఐ. కార్యాలయంపైన జిల్లా సి.పి.ఎం. కార్యాలయంపైన అరుణపతాకాలను అవనతం చేశారు.

**సి.పి.ఐ. పశ్చిమ గోదావరిజిల్లా సమితి సంతాపం :**

భారత కమ్యూనిస్టు పార్టీ అగ్ర నాయకులు శ్రీ నీలం రాజశేఖరరెడ్డి మరణంపట్ల పశ్చిమ గోదావరి జిల్లా సి.పి.ఐ. సమితి ఒక ప్రకటనలో తీవ్ర సంతాపాన్ని వ్యక్తం చేసింది.

ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడుగా, దీర్ఘకాలంపాటు రాష్ట్ర పార్టీ కార్యదర్శిగా, జాతీయ సమితి కార్యదర్శిగా, కమ్యూనిస్టు ఉద్యమానికి ఆయన చేసిన సేవలు చిరస్మరణీయమైనవని జిల్లా కమ్యూనిస్టు పార్టీ నివాళులర్పించింది.

**చిత్తూరు సి.పి.ఐ. నాయకుల సంతాపం :**

రాయలసీమ జిల్లాల్లో ప్రముఖ కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతల్లో ఒకరైన కామ్రేడ్‌నీలం రాజశేఖరరెడ్డి మృతికి చిత్తూరు పట్టణ సి.పి.ఐ. సమితి కార్యదర్శి శ్రీ పి. వెంకటరత్నం, పట్టణ సి.పి.ఐ. నాయకులు తీవ్ర సంతాపం వ్యక్తం చేశారు.



కామ్రేడ్ రాజశేఖరరెడ్డీ!

నీ వెప్పుడూ అమరుడివే

# కామ్రేడ్ రాజశేఖరరెడ్డీ!
# నీ వెప్పుడూ అమరుడివే



# నీకివే మాలాల్‌సలాం

ఆకులు రాలిపోతేనేమి
చిగురాకులు పుట్టవా?
నీళ్ళు ఇగిరిపోతేనేమి
నీలి మబ్బులు గజ్జెకట్టవా?

-సి.నా.రె.
విశ్వంభర

# ఇంటర్నేషనల్

ఈ లోక సిరులను దోచి
        మకుటాలను దాల్చినవారు
మన స్వేద రుధిరము మీద
        మనుటే కద వారల తీరు
కష్టించి కార్మికులెల్ల
        సమకూర్చిన భూరి ధనాలు
మింగేటి దొంగలబట్టి
        తెరిపింతము వారి కోరలు
రోషాతిశయమున పొంగి
        పదవోయిది అంతిమ సమరం
ఇంటర్నేషనల్
        నరజాతి సమైక్యవరం

- "ఇంటర్నేషనల్" గీతానికి
రాంభట్ల అనువాదం